OBM/1638 TEL

# క్రొత్త స్టేఫ్రీ బెల్టులేని నేప్‌కిన్లు






## లూపులు, బెల్టులు, పిన్నులు ఇక ఏమి అవుసరంలేదు. మీకు కావసిన పూర్తిరక్షణతో, మీరు కోరుకున్న పూర్తిస్వేచ్ఛ

మీరు ప్రతిఒక్కరోజు సద్వినియోగం చేయాలని కోరేస్త్రీ అయితే, మేము మీకు అతి ప్రత్యేకమైన దానిని సమర్పించ కోరుతున్నాం: **స్టేఫ్రీ** బెల్టులేని నేన్‌కిన్లు.

### మీరు కోరుకున్న పూర్తి స్వేచ్ఛ

మీరు లూపులు, పిన్నులు, తాళ్ళు లేక బెల్టులతో బాధ పడాల్సిన రోజులు పోయాయి. **స్టేఫ్రీ** నేప్‌కిన్లు సరైనట్లు అమరుటకోసం ఎడ్హెసివ్ పట్టీలు ఉన్నాయి. మీ బిగువైన చెడ్డీల లోపల దీనిని నొక్కండి. మీరు తీసివేసేదాకా చెమ్మను పీల్చి సురక్షితంగా అక్కడే ఉంటుంది. **స్టేఫ్రీ** నేప్‌కిన్లు మీరు ఏ దుస్తులతోనైనా




ధరించ వచ్చును ఏంకావలసినా చేయవచ్చును. అవి నిజంగా అమర్చినచోట అట్లానే ఉంటాయి.

### మీకు కావలసిన రక్షణ

**స్టేఫ్రీ** మీకు కావలసిన రక్షణ నిశ్చయంగా ఇచ్చేటట్లు ప్రత్యేకంగా డిజైను చేయబడ్డది. అధికంగా చెమ్మనుపీల్చి లోపలి మడతలలో చెమ్మనిలిచి పోతుంది. మరి. 3-వైపులా ప్లాస్టిక్‌షిల్డ్ నేప్‌కిన్ దిగువభాగము మరియు. ప్రక్కల మరకలు పడనీయదు. నేడే ఒక ప్యాక్ కొనండి. బెల్టులేని దాని స్వేచ్ఛను అనుభవించండి. మరి మీ రెప్పటికీ లూప్‌లు లేక బెల్టులు, పిన్నులు, తాళ్ళ జోలికి పోరు !

భారత దేశంలో తయారు చేయువారు జాన్సన్ & జాన్సన్ లిమిటెడ్, బొంబాయి-400 036
లైసెన్స్ యూజర్. స్టేఫ్రీ. జాన్సన్ & జాన్సన్ యు.ఎస్.ఎ. వారి ట్రేడ్‌మార్క్ © J & J '79

# ఆ స్పర్శ

సున్నితంగా, చల్లగా, మెల్లగా
లాలనలా, ముచ్చటగా
నేయబడినవి. ధరిస్తే
మహదానందాన్ని గొల్పేవి.
ఫ్యాషన్ చిందించే బట్టలు.
ఎవరినైనాసరే ఆకట్టుకోగలవి.

సూటింగులు, షర్టింగులు,
చీరలు, డ్రెస్ మెటీరియల్స్,
డెనిమ్స్ మరియు పంచలు.

గొప్ప ఫ్యాషన్, అపూర్వమైన అనుభవానికి.







**మఫత్‌లాల్ ఇండస్ట్రీస్** న్యూ షర్రాక్ మిల్స్
**మఫత్‌లాల్ ఫైన్**

everest/79/MFI/310-tl



జనవరి (80) నుంచి–
'అభిప్రాయాలు' శీర్షికలో
ప్రచురింపబడే లేఖలకు ఇచ్చే
పారితోషికంలో పెంపు:

ఇప్పుడు ఇస్తున్నది ఐదు రూపాయలు
జనవరి (80) నుంచి
ఈ శీర్షికలో వచ్చే ప్రతి లేఖకూ
పారితోషికం పదిరూపాయలు

### అర్థంలేని ఆచారం!

"అర్థంలేని ఆచారం"తో స్త్రీ జాతకాన్ని పురుషుడు రాస్తున్నాడు. మధ్యతరగతి కుటుంబీకులు ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేయలేక అవస్థపడుతున్నారు. దీని కంతటికీ కారణం పురుషులే; శాస్త్రాలు పురుషులే రూపొందించారు. అందుకే స్త్రీని క్రిందికి అణగ ద్రొక్కారు. అంగవైకల్యం కలిగిన అమ్మాయి అయితే, ఎక్కువ కట్నం ఇస్తే చాలు, పిల్లను చూడకుండా చేసుకుంటారు. పురుషుడు - కట్నం అనే వాంఛ మర్చిపోగలగాలి. మగవాడు చదివిన చదువుకు తగిన కట్నం ఆడపెళ్ళి వాళ్ళ వద్ద నుండి గుంజుతారు. బూజు పట్టిన ఆచార, సంప్రదాయాలు గల తల్లిదండ్రులను ఒప్పించి ప్రేమించిన అమ్మాయి కోసం ముందుకు రావాలి. జానెడు పొట్టకోసం జీవితాంతం భర్తకు, పిల్లలకు సేవ చేయటమా? ఎంత బానిసత్వపు బతుకు! మాతృత్వం ఆడదానికి వరమని చెప్పి మనస్సును తృప్తి పరుస్తుంటారు. భర్తకు సర్వసుఖాలు అందించి భార్య అవస్థ పడుతుంది. మానవత్వంలేని మగవాడు ఆమెని పట్టించుకోడు. స్త్రీ పడే ప్రసవవేదన ముందు అతడు తీసుకొనే కట్నం ఎంతటి రాక్షసత్వాన్ని తెలియజేస్తుందో ఆలోచించండి. ఎన్ని మహిళా మండలులో పెట్టి, ఎన్ని చర్చలు జరిపినా లాభం లేదు. ఆ చైతన్యం పురుషుడిలోనే రావాలి. మన ఆచారం ప్రకారం ఆడవారిచ్చే కట్నం, మగవారే ఇచ్చి వివాహం చేసుకోవాలని తారుమారైతే? ఎంత బాధ పడతారో ఒక్కసారి ఆలోచించండి. ఏమైనా పురుషులు ప్రేమ వివాహాలకు ముందుకు రానంతవరకు ఈ కట్నం సమస్య పరిష్కారం కాదని నా అభిప్రాయం.

కె. జోత్స్న మచిలీపట్నం

### ఫలితం ఏమిటి?

ప్రస్తుత పరిస్థితుల్లో ఆడపిల్ల పెళ్లి, మగపిల్లాడి ఉద్యోగం రెంటికి రెండూ సరితూగుతున్నాయంటే, అదెంత మాత్రమూ అతిశయోక్తి కాదు. మధ్యతరగతి జీవితాలకు సంబంధించినంతవరకూ ఎదిగిన ఆడపిల్లకు పెళ్లి చేయడం ఎంతటి తీవ్ర సమస్యగా పరిణమిస్తూందో, చదువయిన మగపిల్లవాడికి -- ఉద్యోగం రావడం కూడా అంతే సమస్యగా పరిణమిస్తోంది. గతంలో ఏమోగానీ, ప్రస్తుతంలో మాత్రం మగపిల్లవాడికి - ఆడపిల్లకి ఏ కోణంలోనూ తేడా కన్పించడం లేదు. చదివించడం ఇద్దరినీ సమానంగా చదివిస్తున్నారు తల్లిదండ్రులు. ఉద్యోగాలకు దరఖాస్తు చేయడంలో కూడా వెనుకంజ వేయకుండా ప్రోత్సహిస్తున్నారు ఇద్దరినీ సమానంగానే! ఇలా ఎన్నివిధాల యోచించినా ఆడా - మగా అనే తేడాలు ఇంచుమించుగా లేవనే చెప్పాలి ప్రస్తుతంలో!....

కాని విచిత్రమేమంటే, మధ్యతరగతి జీవితాల్లోని ఆడపిల్ల మాత్రం తన అభిరుచి మేరకు వరుడు లభించడం లేదని అహర్నిశలూ 'అసంతృప్తి' అనబడే అంధకారమయ ఆలోచనలతో సుందర భవిష్యాన్ని, సుమధుర జీవితాన్ని దుఃఖమయం చేసుకోవడం పరిపాటి. ఆ మాట కొస్తే, మధ్యతరగతి మగపిల్లాడికి మాత్రం, అతని అభిరుచి మేరకు ఉద్యోగం లభిస్తోందా?....అని ప్రశ్నించుకుంటే ఉద్యోగం రావడమే గగన మౌతున్న ప్రస్తుత కాలంలో ఇంక 'అభిరుచి' అనే మాటకు తావు లేదని సమాధానపడాల్సి వస్తోంది. ఆ దృష్ట్యా ఆలోచిస్తే మధ్యతరగతి జీవితాల్లోని పెళ్ళికి 'కట్నం' ఎలాంటిదో, ఉద్యోగానికి 'లంచం' అలాంటిదని సరిపోల్చితే సత్యదూరం కాదు. మరి, మధ్యతరగతి మగవాడు తనకు వచ్చిన ఉద్యోగంతో సంతృప్తి పడ్తున్నాడే కానీ, తనకు నచ్చిన ఉద్యోగం రాలేదని బాధపడ్డం లేదే? .... కనుక అనుకున్నది జరగపోవడం, ఆశించనిది అందకపోవడమే జీవితం అనుకొని సంతృప్తిపడ్డం సర్వవిధాలా వాంఛనీయం. అంతే

**వనిత**
స్త్రీ జన మాస పత్రిక

కానీ, ఆశించినదానికి వ్యతిరేకంగా పరిణమిస్తున్న పరిస్థితులు, స్త్రీ జాతి స్వాతంత్ర్యేచ్ఛకు ప్రతిబంధక మౌతున్నాయని వాపోవడం వలన ఫలితమేముంటుంది?

శ్రీమతి రమణాప్రకాష్ కాశీబుగ్గ



యమ్. ఉషారాణి కథలు రాస్తారు. ఆమె తొలి కథ 76 లో 'వనిత'లో వచ్చింది. తర్వాత పలు పత్రికల్లో ఆమె రచనలు వచ్చాయి. "ఊహించి కథలు రాయడం కంటె, మన చుట్టుపక్కల జరిగే సంఘటనలను ఆధారం చేసుకుని చేసే రచనలు చదవడం అన్నా, చెయ్యడం అన్నా నాకు ఇష్టం" అంటారామె. శ్రీమతి ఉషారాణి అనంతపూరులో పుట్టారు; రాజమండ్రి, విజయనగరం, విశాఖ పట్నాలలో చదువుకున్నారు; ఎమ్.ఏ. పాసయ్యారు. భర్తగారి ఉద్యోగరీత్యా ప్రస్తుతం ఆమె కర్నూల్లో వుంటున్నారు. ఉషారాణి స్వస్థలం మైసూరు రాష్ట్రంలోని బెట్టదకెళగినహళ్లి గనక, ఆమెకు కన్నడ ప్రాంతపు వంటకాలు బాగా తెలుసు. ఈ సంచికలోని 'వంటలు' పేజీలో ఆమె కొన్ని కన్నడ వంటకాలు చెప్పారు.

### కంచే చేను మేస్తే!....

నిత్యావసర వస్తువుల్లో ఎలాంటి కల్తీలు జరుగుతున్నాయో అవి ఎంతటి విపరీత పరిణామాలకు దారితీస్తున్నాయో, గ్రహించలేని వినియోగదార్లు నూటికి తొంభై తొమ్మిదిమంది వున్న ఈ సమాజంలో, లాభాపేక్షకులయిన వ్యాపారస్తులు చేసే కల్తీలు-వాటి పరిణామాలు మాటలావుంచి, ప్రభుత్వమే స్వయంగా నడిపిస్తున్న చౌకదుకాణాలు—సూపర్ బజార్లను గురించి ఆలోచిస్తే కంచే చేను మేసే పరిస్థితంటే ఏమిటో క్షణంలో అర్థమౌతుంది మనకు!...

నిత్యావసర వస్తువుల ధరలు నేల నుంచి నింగికి నిచ్చెన వేస్తున్న ఈ రోజుల్లో ధరల పెరుగుదల కన్నా భయంకరమైన, భరింపరాని సమస్య ఈ కల్తీల సమస్య!....ప్రాణాధారమైన వంట దినుసులే ప్రాణాంతకమయ్యేలా చేస్తున్న ఈ కల్తీల బెడద తప్పించే బాధ్యత ప్రభుత్వంపై వుండగా, ప్రభుత్వం నడిపించే సూపర్ బజార్లలో కూడా శుభ్రమైన, కల్తీలేని సరకులు లభించకపోవడం నిజంగా దురదృష్టకరం. మరో విషయం ఏమిటంటే, మామ్మూలు బజార్లలో మనం తెచ్చుకున్న వస్తువు మంచిదికాకపోతే తిరిగి మార్చుకునే అవకాశం లేదా వస్తువు ధరకు సరితూగే వేరే సరకు తెచ్చుకోవడం వంటి మార్పు -చేర్పుల కవకాశముంటుంది. కానీ, అదే సూపర్ బజార్లలో కానీ, ప్రభుత్వం నడిపించే మరే చౌకదుకాణంలో గానీ అయితే, వస్తువు కొని, బిల్లు కట్ చేసాక....మరి ఆ వస్తువు మార్చే ప్రశ్నే లేదు-అది ఎలా వున్నా! అందువల్ల ప్రభుత్వ దుకాణాలకన్నా, మామ్మూలు వ్యాపారస్తుల దుకాణాలే నయమనిపిస్తోంది. పైగా సూపర్ బజార్లలో నూక, గోధుమలు వంటి వస్తువుల్లో అంధులకు సైతం గోచరించేటంత 'పెద్ద పురుగులు' స్వైరవిహారం చేస్తుండడం గమనించదగ్గ అంశం. కల్తీలు జరగడం మాటెలావున్నా.... పురుగులతో ఇలా అమ్మకానికి తెగించడమనేది భరింపరాని సత్యం. ప్రజల బాగోగులను పరిశీలించే ప్రభుత్వ పంపిణీ దుకాణాల వ్యవస్థలింత దారుణంగా వున్న ఈ రోజుల్లో, ఆహార పదార్థాల కల్తీ జరిగిందని గత సంచికలోని వ్యాసంలో తెలియచేసినట్లు, భారతీయ పౌరునిగా, ఔషధ, ఆహార (ఆరోగ్య) శాసన పాలనాధికారికి తెలియచేయడం వలన లాభం వుంటుందని ఎలా అనుకోవడం?

ఎమ్. వి. రమణమ్మ — కాశీబుగ్గ

ఈ సంచికలోని 'బాధ్యత' కథ (పేజీ: 65) రాసిన విన్నకోట సుశీలాదేవి, తెలుగులో ఎమ్.ఎ. పాసయి, మచిలీపట్నంలోని మహిళా హిందూ కళాశాలలో, తెలుగు భాషా ఉపన్యాసకురాలిగా వుంటున్నారు. ఆమె తొలిసారిగా రాసిన 'ఎర్రచీర' అన్న కథ ఆంధ్రజ్యోతి వారపత్రికలో వచ్చింది. 'మహిళ' పత్రిక ఇటీవల జరిపిన 'దీపావళి కథల పోటీ'లో సుశీలాదేవి రాసిన 'నాగరికత నీడలలో' అన్న కథకు మొదటి బహుమతి వచ్చింది. పలు పత్రికల్లో పలు రచనలు చేస్తూ "మంచి రచనలు చేసి, అందరి మన్ననలూ పొందాల"ని ఆశిస్తున్నారామె.



సంపుటి: 5 సంచిక: 6 డిసెంబరు: 1979 విడి ప్రతి: రెండు రూపాయిలు
సం॥ర చందా: ఇరవైనాలుగు రూపాయిలు శ్రీలంక: రూ. 2.00 (ఇండియా)
మలేసియా: 90 సెంట్స్ చిరునామా: చందమామ బిల్డింగ్స్ మద్రాసు-600 026
డిసెంబరు: 1979 విడి ప్రతి: రెండు రూపాయిలు

### రక్షకులా....భక్షకులా?

సుమారు ఒకటిన్నర సంవత్సరం క్రితం రక్షకభటులు రమీజాబీ మానాన్ని, ఆమె భర్త ప్రాణాన్ని హరించారు. ఈ రాక్షస కృత్యాన్ని హైదరాబాద్ పౌరులు తీవ్రంగా గర్హించారు. కానీ ప్రభుత్వం ఎన్ని హామీలు ఇచ్చినా, పోలీసుల ప్రవర్తనలో మార్పు రాకపోగా, నానాటికీ ఇంకా మొరటుతనం, కరకుతనం పెరిగిపోతోంది.

రమీజాబీ కేసు ప్రజల స్మృతిపథంలో మెదలుతూ ఉండగానే, అంతకంటే ఘోరమైన, క్రూరమైన మరో దారుణం ఆమధ్య, భువనగిరిలో జరిగింది. షకీలా అనే పేరుగల యువతి, ఆమె భర్త హెన్రీ పోలీసుల చేతుల్లో చిక్కి చిత్రహింసలకు గురి అయ్యారని, షకీలా పోలీసుల పశుత్వానికి బలి అయిందన్న వార్త ఈ సభ్య సమాజానికే ఒక తీరని మచ్చలాంటిది. రమీజాబీ విషాధ గాధలాగే షకీలా కథ కూడా నడుస్తోంది. ఆనాడు పోలీసులు రమీజాబీ మానాన్ని మాత్రమే దోచుకున్నారు. కానీ నేడు షకీలా ప్రాణాన్ని, మానాన్ని కూడా హరించారు. నాడు రమీజాబీ భర్త చంపివేయబడితే, నేడు షకీలా భర్త చావు బ్రతుకుల మధ్య సతమతమవుతున్నాడు.

ఇలాంటి కేసుల్లో పోలీసు ఫార్ములా మేరకు ఇంచుమించుగా అన్ని కథలూ ఒకే మూసలో ఉంటాయి. వాళ్లపాలిట పడిన పురుషులు సాధారణంగా నేరాలకు అలవాటుపడినవారై ఉంటారు. నేరస్తుని భార్యకు మర్యాద ఇవ్వనవసరంలేదనీ, అవకాశాన్నిబట్టి ఏమి చేసినా తప్పులేదనీ పోలీసుల నమ్మకం కాబోలు. అందువల్లనే, మానభంగం జరిగిందన్న ఆరోపణలు వచ్చినపుడు, ఆ స్త్రీల చరిత్ర మంచిదికాదని, పతిత అని ప్రత్యారోపణలు చేస్తూ ఉంటారు. అంటే 'పతత' అని ముద్ర వేసిన అబలను ఏమిచేసినా పర్వాలేదన్న ధోరణి ఇందులో మిళితమై ఉంది.

షకీలాపై జరిగిన ఈ అత్యాచారాన్ని గురించి న్యాయవిచారణను జరిపించడంతోనే ఆగిపోకుండా, ఇందుకు బాధ్యులైనవారిని, కఠినంగా శిక్షించడం కూడా అవసరం.

వై. కుల్సుమ్‌బీ — అనంతపురం




నవంబర్ "వనిత" ముఖచిత్రం అత్యంత ఆకర్షణీయంగా ఉంది మా హృదయాలను దోచుకుంది. "కట్నం కోరని కుర్రాడు" చిట్టికథ చాలా గమ్మత్తుగా ఉంది. "కల్తీ వస్తువులు కనుగొనడం ఎలా ?" వ్యాసం ఎంతో ఉపయోగకరంగా ఉంది.

—కందిగట్ల సావిత్రి, జనగామ

19వ శతాబ్ది ముగియవస్తున్నా బామ్మగారు చెబుతున్నవి నిర్రాణమై వున్న జీవితాలను చిగురింపజేస్తున్నవి. కాని 'ఏమర్రా, అవునర్రా' అని ఆమె సంబోధించడం సభ్యతగా లేదు.

—ఆర్. వి. కామేశ్వరి, మద్రాను

వనితలకోసం పత్రికలు నిర్వహించుకుంటున్న మనం- వనితలకు పూసల నంచులు, మాచింగ్ సెట్లూ కాక ఇవాళ్టి వనితలు గురవుతున్న అన్యాయాలను ఎత్తి చూపడం పోరాడటం కూడా నేర్పాలి. నిన్న రమీజాబీ ఇవాళ షకీలా రేపు మరో మాధవి. ఎన్నాళ్ళిలా! ఇంకా ఎప్పుడు ఈ దేశంలో ఆడదానికి విముక్తి? ఈ రకమైన హైన్యతను తీవ్రంగా అనహ్యించుకుంటూ తోటి మహిళలను తమ ఆందోళనను వ్యక్తపరచవలసిందిగా ప్రార్థించాలి.

—టి. వాణి రంగారావు, చిలకలూరిపేట

"కల్తీ వస్తువులు తెల్సుకోవడం" వ్యాసంలో తెల్పిన విషయాలు ఎంతో ప్రయోజనకరంగా వున్నాయి. "నాణానికి మూడోవైపు" (పెద్ద) కథ ముగింపు చాలా అద్భుతంగా వుంది. రచయిత్రి విమలగార్కి నా ప్రత్యేకాభినందనలు.

—వి. సాధనా చక్రపాణి, రాజమండ్రి

అంతర్జాతీయ బాలల సంవత్సర సందర్భంగా ఫొటోలతో సహా ప్రచురితమవుతున్న బాలల స్వర్గం వ్యాసం చదువుతుంటే మన దేశం కూడా ఎన్నేళ్ళకైనా అటువంటి అభివృద్ధి సాధిస్తుందా అనిపిస్తోంది.

—అల్లంరాజు మాధవి, రాజమండ్రి

మధ్య ప్రదేశ్‌లో వుంటున్న నేను ఆంధ్రా వచ్చినప్పుడు తెచ్చిన వనితల్లో మంగళాకందూరుగారి పూలుతో నెక్ బ్లాక్ చూసిన తరువాత పూలుతో అల్లికలు నేర్చుకోవాలనుకున్నాను. కానీ నాకు భాష సమస్య అగులచే స్వయం కృషితో నేర్చుకుని ఈ రోజే మా శ్రీవారికి స్వెట్టరు అల్లుతున్నాను. శోభారామ్‌జీగారి కాలిఫ్లవర్ మసాలా కూర చేసిన తరువాత తరచూ రొట్టెల్లో దాన్నే ఎంతో ఇష్టంగా తినుచున్నాము.

—ఎ. కామేశ్వరి, డాటలా

వనితలో చిట్టికథల ద్వారా చక్కని సందేశాలను అందిస్తున్నందుకు చాలా సంతోషం. వనితలో ప్రచురించే కథలు, వ్యాసాలు, చాలామటుకు సంఘంలోని చెడు గురించే వ్రాయబడతున్నాయి. ఉన్నతమైన స్త్రీలయొక్క పరిచయాలు కూడా చాలా బాగా వుంటున్నాయనటంలో సందేహం లేదు.

—డి. సీతాదేవి, పీరవల్లి

నవంబర్ '79 నెల వనితలోని మైథిలిగారి 'ప్రేమ లేఖకు జవాబు' చదివిన తరువాత ఈ ఉత్తరం వ్రాయకుండా ఉండలేకపోయాను. ఎంతో తెలివిగలదానిగా, వివేకవతిగా తనకు తాను భావించే దృఢమయిన హృదయంగల మైథిలిగారు, దారి పొడవునా ఆ పుస్తకంలో ఏం ఉంటుందో అన్న ఆలోచనలతో, ఇల్లు చేరుకోవలసిన అవసర మేమిటో నాకర్థం కాలేదు. అలాగే కవర్ తెరిచిన వారి చేతులు వణకడమెందుకో కూడ అసలర్థం కాలేదు. కేవలం వయసులో ఉన్న ఒక స్త్రీ పురుషుడి మధ్య కలిగేదే ప్రేమగా భావించే మైథిలిగారి ప్రేమగూర్చి పదిలేద్దాం! వారు 'మిమ్మల్ని ప్రేమించాలని చట్టమా ఏం?" అని ప్రశ్నించడం మూర్ఖంగానే కాదు, అసహ్యంగా కూడ వుంది. ఉన్నతాభిప్రాయాలుగల స్త్రీలు ఎందరో ఉంటారుగాని ఇలాటి "ఎప్పుడో విన్నట్లు, ఎక్కడో చదివినట్లు గుర్తు" అనే మైథిలిగారి పద్ధతిలోని కథలు వెయ్యకండి. మీకేదయినా చెప్పాలన్పిస్తే, తిన్నగా మంచి ఆర్టికల్ రూపంలో ప్రచురించండి, పత్రిక విలువ పెంచండి. అంతేకాని, సర్వాంగ సుందరంగా ఉన్న వనితకు అంగవైకల్యం కలుగజేయకండి.

—సుష్మ, బాపట్ల

నవంబర్ 'వనిత'లో శ్రీమతి రెబెల్లో ఐ. ఎ. ఎస్.గారి పరిచయం ఎన్నో సందేహాలను తీర్చటమే కాకుండా ఉద్యోగాలు చేయాలని కుతూహలపడే ఆడపిల్లలకు చక్కటి ప్రోత్సాహాన్ని కలిగించింది! శ్రీమతి గౌరా పంత్ శివానీ రచించిన నేరస్థుల వాస్తవిక గాథలను అందిస్తున్నందుకు 'వనిత'కు మా ప్రత్యేక అభివందనలు! 'అభిప్రాయాలు' శీర్షికలో ప్రచురితమయిన 'నగ్మాన' మద్రాసుగారి లేఖ భలే తమాషాగా వుంది! కె. వాసంతీకిషన్‌శాస్త్రిగారి 'సిగ్గు' సింపుల్ బట్ వెరీ ఫైన్!

—శ్రీమతి నజీర్ హుసేన్, కావలి

'వనిత' పత్రిక చేతిలోకి తీసుకొని ఎన్నిసార్లు తిరగవేసినా కాలక్షేపానికి, వినోదానికి చదువదగ్గ అంశంగా ఏదీ కనిపించడం లేదు. వ్యాసాలతో, విజ్ఞాన వార్తలతో ఏదో క్లాసు పుస్తకం చదువుతున్నట్లుగా వుంటున్నది. ఒక్క కథ, ఒక్క సీరియల్ మాత్రమే వుంటున్నాయి. పుస్తకంలోని అంశాలు ఎక్కువ కుతూహలాన్ని కలిగించేవిగా వుండటం లేదు.

—ఎస్. సులోచన, బాపట్ల

"వంట చిట్కాలు"లో "శోభా"వారు ఆకుకూరలు మూతపెట్టవద్దని, వాటిరంగు పోతుందని రాసారు. రంగు సంగతి ఎలా ఉన్నా మనకు ముఖ్యమైన "విటమిన్లు" ఆవిరిరూపంలో బయటకుపోతాయి. అట్లాగే అన్నం ముద్దకాకుండా ఉండటానికి నిమ్మకాయ పిండమన్నారు. నిమ్మకాయ సమయానికి అందుబాటులో లేకపోవచ్చు అందువల్ల ఎసరు తెర్లేటప్పుడు 1 టేబుల్ స్పూన్ వంటనూనె వేసి వండినా అన్నం ముద్దకాదు. ఆకుకూరలు ఉడికేటప్పుడు వంటసోడా వెయ్యమన్నారు. ఆకుకూరలే కాదు ఏ ఆహారపదార్థాలు ఉడుకుతున్నా వంటసోడా చేర్చడం వల్ల విటమిన్‌లని పోగొట్టుకుని తిన్నట్టవుతుంది. బామ్మగారి పేజీలో "అరుంధతి"గారు కాళ్ళుపగిలి చీలికలు ఏర్పడతాయని అన్నారు. నాకు తెలిసినది నేను ఉపయోగించిన వైద్యం ఒకటి చెబుతాను. "కరక్కాయ" అంటే "పచారీ" దుకాణంలో ఇస్తారు. దీన్ని అరగదీసి గంధం కాళ్ళపగుళ్ళకు రాయాలి. నీళ్ళలో ఎక్కువ నానటం వల్ల కలిగే వాటికి కూడా బాగా ఈ కరక్కాయ గంధం పని చేస్తుంది.

—హెచ్. అంజలీశాస్త్రి, మహబూబాబాద్

## వనిత మాటల కొలువు – 52

సరైన సమాధానం:

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 కా | 14 కి | | 2 గి | 15 ర | గి | 16 ర | |
| 3 దు | టి | ప్ప | | వ | | 4 క్త | భ |
| | కి | | 17 జం | | 5 కు | క్షి | |
| 18 మా | | 6 తో | క | చు | క్క | | 19 కా |
| 7 కు | 20 లె | ట | | | 8 గొ | లు | సు |
| | తాం | | 9 ఒ | క | డు | | |
| 10 మహా | త | | డ | | 11 గు | 21 రు | 22 తు |
| 12 డు | ము | వు | లు | | | 13 చి | ప్ప |

పై సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారు పదకొండు మంది. వారు

1. సి. వెంకటమారుతాంబ, మచిలీపట్నం 2. జి. దేవి మీనాక్షి, అమలాపురం 3. పి. సత్యవాణి, బొంబాయి 4. డి. వసుంధర, కావలి 5. ఆర్. ఇందిరాశేఖర్, కోరగుంటపల్లె 6. ఎ. కమలా రామలింగం, కొత్తగూడెం 7. బి. పద్మామోహన్, గూటి 8. వై. లక్ష్మీదేవమ్మ, ఆకుమళ్ల 9. బి. హైమవతి, అంగలకుదురు 10. ఇ. సుశీలారాణి, కడప 11. డి. నాగపద్మ, అనంతపూర్.

బహుమతి మొత్తం రూ. 150 లను వీరికి సమానంగా పంచి అందజేస్తున్నాము.

# ప్రపంచం

ప్రతి నియంత కథా సాధారణంగా హత్యతోనే ముగుస్తుంది—అని మరోసారి ఋజువు చేసింది దక్షిణ కొరియా నియంత పార్క్ చుంగ్ హీ హత్య। ఒక విందు జరుగుతున్నప్పుడు ప్రెసిడెంట్ పార్క్‌ను-దక్షిణ కొరియా గూఢచారి సంస్థ అధిపతి కిమ్ జే క్యూ తుపాకితో కాల్చి చంపాడు. మొదట ఈ హత్య ప్రమాదవశాత్తు జరిగిందని ప్రకటించినప్పటికీ ఆ తర్వాత అది ముందే ఏర్పాటు చేయబడిన కుట్ర అని తేటతెల్లమయింది. ఇంతకూ కిమ్ జే క్యూ, పార్క్‌కు అంతరంగిక స్నేహితుడట।

నోరు కదిపితే జైలుశిక్ష, మారు పలికితే మరణ దండన అన్న అటవిక దౌర్జన్యంతో ఆత్యయిక స్థితిని అమలు జరిపి ఇనుప హస్తంతో రాజ్యం చేసిన పార్క్ చంపబడటంతో అక్కడ ప్రజా పాలనలో భానూదయం అయిందా? అంటే—అదేమీ లేదు. హత్య చేయబడిన అధ్యక్షుని స్థానంలో ప్రస్తుతం చోయ్ క్యూహా అధ్యక్షుడయ్యాడు. రాజకీయ పక్షాలన్నీ రద్దు చేయబడ్డాయి। మరో నియంత రావడం తప్ప, పరిపాలనలో ఎలాంటి మార్పూ లేదు।

క్రీస్తు పూర్వం నుంచే ఆసియా నాగరికతకు పుట్టినిల్లుగా చరిత్రలో చోటు చేసుకున్న దేశం కొరియా. చైనాకు ఆగ్నేయ దిశగా ద్వీప కల్పంలా వున్న ఈ దేశం—ప్రకృతి సంపదలకు నిలయం కావడంతో ఆదినుంచే తరచూ చైనా, జపాన్, మంగోలియా దురాక్రమణలకు గురి అవుతూ వుండేది. అందువల్ల కొరియా ప్రజలకు మిగతా వారంటే ఓ ఏహ్యాభావం ఏర్పడింది. కొరియాకు Hermit kingdom అన్న పేరూ వచ్చింది.

ద్వితీయ ప్రపంచ సంగ్రామ సమయంలో జపాన్ సైనాధిపత్యం క్రింద వుండేది కొరియా. ఆట్టు తర్వాత అమెరికా సైన్యం రావడం మొదలైంది. చైనాలో మావో నాయకత్వం సాధించిన విప్లవ విజయం ఉత్తర కొరియా ప్రజలకు ఎంతో ఉత్సాహ ఉద్రేకాలు కల్గించింది. పర్యవసానంగా ఉత్తర కొరియా—కమ్యూనిస్టు పథంలో పయనిస్తోంది.

అయితే దక్షిణ కొరియాలో అమెరికా సైనిక బలగం సాయంతో 1948 సం॥లో సిగ్మన్‌రీ అన్న దళపతి అధ్యక్షుడుగా ప్రకటించడం జరిగింది. 1950 సం॥లో ఉత్తర కొరియా దక్షిణ కొరియా మీద దురాక్రమణ జరిపిందన్న ప్రచారం కూడా జరిగింది. దక్షిణ కొరియా ప్రజాస్వామ్య మార్గంలో పయనిస్తోంది అని కూడా అమెరికా ప్రచారం చేసింది.

1960 సం॥ కొరియా సైన్యం సిగ్మన్‌రీని పదవీ భ్రష్టుని చేసింది. అప్పుడే అధికారం తన కైవసం చేసుకున్నాడు ప్రెసిడెంట్ పార్క్ చుంగ్ హీ। అప్పటినుంచి పేరుకు ప్రజాస్వామ్యం జరుగుతూ ఎన్నికలు జరుగుతున్నా పార్క్ చుంగ్ హీ అధ్యక్షుడుగా వుంటూనే వచ్చాడు. ప్రతిపక్షాలను అణచి వేయడంలో - అమెరికా సైనిక సాయం ఆయనకు తోడుగా నిలిచింది. ప్రస్తుతం అధ్యక్షుడుగా వున్న చోయ్ క్యూ హాకు అమెరికా అంగీకారం, ఆదరణ వుండడం గమనించతగ్గ విషయం।

అధికార దాహం, పదవీ వ్యామోహం ఒక్కసారి ఏర్పడ్డాయంటే ఓ పట్టాన తగ్గవని పాకిస్థాన్ అధ్యక్షుడు జనరల్ జియావుల్ హక్ ఇటీవలి చర్యలు నిరూపించాయి. అంతేకాదు. మతతత్వాన్ని, నియింతృత్వాన్ని ఆదిలోనే చిదిమివేయకపోతే అవి ఎలాంటి దారుణ పరిణామాలకు దారి తీస్తాయో సూచిస్తాయి ఇవాళ పాకిస్థాన్‌లో జరుగుతున్న సంఘటనలు.

'ఇస్లాం రాజ్యమే సుఖశాంతుల నిలయం' అన్న ధ్యేయంతో ఆవిర్భవించిన పాకిస్థాన్ అతి త్వరలో సైనిక నియంతల అధికార దాహానికి ఎరయి, అమానుష బాధలకు గురయింది. ఇటీవలి పాకిస్థాన్ చరిత్ర సైనికపాలనతోనే జరుగుతోంది.

పాకిస్థాన్ నేషనల్ అసెంబ్లీ ఎన్నికలు, యాహ్యాఖాన్ హయాంలో 1970 సం॥ చివర తొలిసారిగా జరిగాయి. ఆ ఎన్నికలో ముజుబుర్ రహమాన్ పార్టీ అవామీలీగ్ ఎక్కువ సీట్లు సంపాయించడం యాహ్యాఖాన్‌కు ప్రాణ సంకటంగా తయారయింది. అసెంబ్లీని వాయిదా వేశాడు. పర్యవసానంగా ఎన్నో హింసాకాండలు జరిగాక తూర్పు పాకిస్థాన్ బంగ్లాదేశ్‌గా విడిపోయింది.

రెండోసారిగా మహమ్మదాలీ భుట్టో పరిపాలనలో 1977 సం॥లో ఎన్నికలు జరిగాయి. అయితే అందులో మోసం జరిగిపోయిందని ఉద్యమాలు చెలరేగాయి. ఈ పరిస్థితిని అసరాగా తీసుకుని జనసల్ జియా భుట్టోను పదవీచ్యుతుని చేశాడు.

అప్పటినుంచి ప్రజా పాలనను మళ్లీ ఉద్ధరించే తీరుతానని తరచూ ప్రకటనలు చేస్తూ వచ్చాడు జనరల్ జియా. అయితే తగిన వాతావరణం లేదని, ఎన్నికలకు టైమ్ కాదనీ ఎన్నికలు వాయిదా వేస్తూ వచ్చాడు. ఆఖరుసారిగా గత నవంబర్ 17న ఎన్నికలు జరుగనున్నట్లు ప్రకటన కూడా చేశాడు.

1962 సం॥నాటి రాజకీయ చట్టాన్ని తనకు అనుకూలంగా సవరించాడు జియా. రాజకీయ పక్షాలకు ఎన్నో ఆంక్షలు విధించాడు. ఈ సవరణ చట్టం ప్రకారం అన్ని రాజకీయ పక్షాలు ఎన్నికల కమిషనర్ దగ్గర రిజిష్టర్ చేయించుకోవాలి. అడిగిన డాక్యుమెంట్లు దాఖలా చెయ్యాలి. సైనిక పరిపాలనకు వ్యతిరేకంగా ఏ పార్టీ కార్యకలాపాలు జరిపినా ఆ పార్టీని నిషేధించే హక్కు కమిషనర్‌కు వుంది. అన్నిటికన్నా ముఖ్య విషయం - భుట్టోకు ఉరిశిక్ష విధించిన లాహోర్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి ముస్తాక్ హసన్ ఎన్నికల కమీషన్ అధ్యక్షుడు కావడం। ఈ పరిస్థితులలో పాకిస్తాన్ రాజకీయ పక్షాల మనుగడ దినగండం నూరేళ్ళాయుష్షుగా తయారయ్యింది.

ప్రముఖ రాజకీయ పార్టీ నాయకులతో సంప్రతింపులు జరుపగా వారి కోర్కెలు పరస్పర విరుద్ధాలుగా వుండడంతో ప్రజాశ్రేయస్సు దృష్ట్యా ఎన్నికలు నిరవధికంగా వాయిదా వేస్తున్నట్టు జనరల్ జియా ప్రభుత్వం ప్రకటించింది. రాజకీయ పక్షాలను, కార్యకలాపాలను, నిషేధించింది. భుట్టో సతీమణి, కుమార్తెతో సహా రాజకీయ పక్ష నాయకులందరూ ఖైదు చేయబడ్డారు. పత్రికా స్వాతంత్ర్యం పూర్తిగా రద్దయింది. కార్మికులకు సమ్మెచేసే హక్కుగాని యజమానులకు లాకౌట్ చేసే అధికారంగాని లేని అత్యయిక పరిస్థితి ప్రకటించబడింది.

ప్రజల ఆర్థిక స్థితిగతులను మెరుగుపరచడానికి, ఇస్లాం తత్వ ప్రాతిపదికలోని క్రమబద్ధమైన ప్రజాస్వామ్య ఉద్ధరణకు ఈ చర్యలు చాలా అవసరమని జనరల్ జియా ప్రకటించాడు।



# ముఖ చిత్రం:

# మదర్ తెరెసా

**1979** సంవత్సరపు
నోబెల్ శాంతి బహుమతి మదర్ తెరెసాకు
లభించింది. ఈ 'బహుమతి'ని
స్థాపించిన ఆల్‌ఫ్రెడ్ నోబెల్ జన్మదినాన,
డిసెంబర్ 10వ తేది నాడు
మదర్ తెరెసాకు ఈ బహుమతి
అందజేయబడుతుంది.
'పేదలలో నిరుపేదల' సేవకే తన
జీవితాన్ని ధారపోసిన
'మదర్'కు 'వనిత' తన
జోహార్లు అర్పిస్తున్నది.

**ఒ**కరు కరుణామయి మేరీమాత, మాతృప్రేమతో ఉప్పొంగిపోయిన మమతామూర్తి. మరొకరు మదర్ తెరెసా. నిర్భాగ్యులను, నిరుపేదలను, అనాథలను, అనారోగ్య పీడితులను తన బిడ్డలుగా భావించిన దయామయి. ఆనాడు పీడిత ప్రజలకి విముక్తి ప్రసాదించిన మహనీయుని గన్న ధన్యజీవి మేరీ మాత. ఈనాడు పీడిత ప్రజల సేవకే తన జీవితాన్ని ధారపోసిన ఆదర్శ వనిత మదర్ తెరెసా. ఎక్కడ బాధాసర్పదష్టులు, దీనచరితులు వుంటే అక్కడల్లా ఆమె సేవలు వారికి అందుతూనే వున్నాయి. ఆమధ్య పెనుతుపానుకు గురైన దివిసీమ ప్రజలకు 'నేనున్నాను' అంటూ సేవ చెయ్యడానికి ముందుకు వచ్చిన కరుణామూర్తి ఆమె.

1910లో యుగోస్లోవియాలోని ఒక అల్బేనియన్ కుటుంబంలో జన్మించిన తెరెసాకి తల్లిదండ్రులు పెట్టిన పేరు ఆగ్నెస్‌గోంషా బొజాహియు. ఆమె తన పద్దెనిమిదవ ఏటనే ఐర్లండులోని లోరెటోనన్స్ సంస్థలో శిక్షణ పొందారు. ఆరు సంవత్సరాల తర్వాత భారతదేశానికి వచ్చి కలకత్తాలో ఉపాధ్యాయ వృత్తి స్వీకరించారు. ఇరవై ఏళ్ళ ఉపాధ్యాయ వృత్తి తర్వాత కలకత్తాలోని సెయింట్ ఏన్నీ బాలికోన్నత పాఠశాలకు ప్రిన్సిపాల్ అయ్యారు. ఆ పాఠశాల నగరంలోని గుడిసె ప్రాంతాల సమీపంలో వుంది. అక్కడి వారిని చూసినప్పుడల్లా పేద ప్రజలకు, వ్యాధిగ్రస్తులకు సేవ చెయ్యడమే తన జీవిత ధ్యేయం అని ఆమె గ్రహించారు. దీన జనులకి సేవ చెయ్యడం ద్వారానే భగవంతుడికి సేవ చెయ్యగలమని భావించి, ఆమె తన ఉపాధ్యాయ వృత్తికి రాజీనామా యిచ్చి పూర్తిగా సేవా కార్యక్రమాలలో నిమగ్నురాలయ్యారు.

కలకత్తా మహానగరంలో పెద్ద పెద్ద భవంతులు ఎన్ని వున్నాయో వాటికి పదింతలు గుడిసెలూ వున్నాయి. సుందర ఉద్యానవనాల చుట్టూ మురికి వాడలూ వున్నాయి. ఈ వాడల్లో...ఆ గుడిసెల్లో ఒక పూట గంజి కూడా గతి లేకుండా దారుణ జీవనం గడిపే దౌర్భాగ్యులు వేలాదిమంది వున్నారు. 'అనాథలుగా జీవించే ఈ పసిపాపలను చూస్తుంటే బెతల్‌హామ్‌లోని జీసస్ గుర్తుకు వస్తున్నాడు" అని ఆమె తన డైరీలో రాసుకున్నారు. వీరికి విద్యనేర్పి, స్వశక్తితో జీవించే వీరి వదనాలలో చిరునవ్వులు చిందేటట్లు చూడడమే మదర్ చేపట్టిన మహత్కార్యం.

అయితే పేద ప్రజలకు కావలసింది విద్య మాత్రమే కాదనీ, కట్టుకునేందుకు బట్ట, కడుపు నిండా తిండి, తలదాచుకోడానికో నీడ అవసరమని ఆమె గ్రహించారు. కాని అప్పుడామె చేతిలో వున్నది కేవలం ఐదు రూపాయలు మాత్రమే. దైవం మీద భారంవేసి ఆమె తన సేవా కార్యక్రమాలను ప్రారంభించారు.

పోప్ అనుమతితో 1950లో ఆ విధంగా వెలిసినదే 'మిషనరీ ఆఫ్ ఛారిటీస్' అనే సేవా సంస్థ. ఇవాళ ఈ సంస్థ దాదాపు నూరు కేంద్రాలలో 158 శాఖలుగా విస్తరిల్లింది. అందులో 98 మన దేశంలోనే వున్నాయి. తక్కిన శాఖలు – శ్రీలంక, ఇటలీ, ఐర్లండు, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, పశ్చిమ

### మదర్ తెరెసా పొందిన కొన్ని బహుమతులు

1962 – పద్మశ్రీ అవార్డు
,, – ఫిలిప్పైన్ దేశపు రోమన్ మాగసెసె అవార్డు
1971 – పోప్ జాన్ XXVIII శాంతి బహుమతి
,, – జోసెఫ్ కెన్నెడీ అంతర్జాతీయ అవార్డు
,, – అమెరికా[illegible] కాథలిక్ విశ్వ[illegible] గౌరవ డాక్టరేటు పట్టా
1972 – అంతర్జాతీయ అవగాహనకై – ఇచ్చే నెహ్రూ అవార్డు
,, – అంతర్జాతీయ సంస్థ ఆహార, వ్యవసాయ సమాఖ్యవారి సెరెస్ మెడల్
1973 – మతాభివృద్ధికి తోడ్పడినందుకు టెంపుల్‌టన్ ఫౌండేషన్ బహుమతి
1974 – సెయింట్ ఫ్రాన్సిస్ అవార్డు
1979 – నోబెల్ శాంతి బహుమతి

ఆసియా, దక్షిణ అమెరికా, ఇంగ్లండు మొదలైన దేశాలలో వున్నాయి. దేశ, విదేశాలలో తొమ్మిది వేల మంది కార్యకర్తల సహాయంతో మదర్ తెరెసా ఇవాళ–ఎందరో అభాగ్యులను సేద తీరుస్తున్నారు.

మూడు దశాబ్దాలుగా తన సేవా కార్యక్రమాలను నిర్వర్తిస్తున్న మదర్ తెరెసా మనదేశానికి వచ్చి యాభై సంవత్సరాలవుతోంది. ఎక్కడో పుట్టి.... ఎక్కడో పెరిగిన ఆమె "ఈ ప్రజలు నా ప్రజలు... ఈ దేశం నా దేశం" అంటూ భారత పౌరసత్వాన్ని స్వీకరించారు. మనదేశాన్నే తనదేశంగా చేసుకున్నారు. ఎండి, మోడువారి నిర్వేదమై వున్న లక్షలాది నిరుపేదల జీవితాలలో పన్నీటి జల్లు కురిపించారు.

ప్రపంచంలోని వివిధ దేశాలు ఆమెను తమ దేశపు పౌరసత్వం స్వీకరించమని అర్థించాయి. కాని ఆమెలోని మతానురాగాన్ని మానవతానురాగంగా మార్చింది మనదేశం. "ఈ దేశంలో పేద ప్రజలు అధికంగా వుండవచ్చు. కాని వారిలో దైవభక్తి వుంది. దేవుడి మీద నమ్మకం వుంది. మమతానురాగాలూ వున్నాయి. అందుకే ఈ దేశం నాదేశం చేసుకున్నాను" అంటారు మదర్ తెరెసా.

దేశ విదేశాలలో ఆమె పలు సత్కారాలు, బహుమతులు పొందారు. వాటి ద్వారా లభించిన మొత్తాన్ని ఆమె తన సేవా కార్యక్రమాలకే వినియోగించారు. అందుకే ఇన్ని బహుమతులు పొందినా... వాటిద్వారా యింతంత ఆదాయం లభించినా మదర్ తెరెసాకి తనదంటూ చెప్పుకోదగ్గ ఆస్తి ఏమీలేదు. అయితే తనకి హిమగిరిశిఖరాలను చేరుకునేటంతటి సంపద వుందంటారామె. ఆ సంపదే – 60 పాఠశాలల్లో చదువుకుంటున్న 7,500 మంది పేద బాలబాలికలు, 215 చికిత్సా నిలయాల్లో చికిత్స పొందుతున్న 9,60,000 మంది రోగులు, 54 ఆసుపత్రులలో వున్న 47,000 మంది కుష్టువ్యాధి గ్రస్తులు, 20 గృహాలలో తలదాచుకుంటున్న 2,000 మంది అనాథ బాలలు, 23 గృహాలలో ప్రశాంత జీవనం గడుపుతున్న 3,400 మంది వృద్ధులు, నిరాశ్రయులూ. వీరంతా కూడా దేశ విదేశాలలోని వివిధ కేంద్రాలలో ఆమె ప్రసాదించిన నీడన తలదాచుకుంటున్నారు.

ఇప్పుడు ఆమెకు లభించిన నోబెల్ బహుమతి మొత్తం 1,90,000 డాలర్లు (15,20,000 రూపాయలు) కూడా కుష్ఠరోగుల ఆసుపత్రుల నిర్మాణం కోసం, అనాథాశ్రమాల నిర్మాణానికి, పేద ప్రజలకు గృహవసతులకూ వినియోగించడానికే నిశ్చయించుకున్నారు మదర్ తెరెసా.

అసలు ఈ సంవత్సరం నోబెల్ శాంతి బహుమానానికి 56 మంది పేర్లు ప్రకటించబడ్డాయి. వారిలో అమెరికా అధ్యక్షుడు జిమ్మీకార్టర్, ఫిన్‌లాండ్ అధ్యక్షుడు ఉర్హో కెక్కోనెన్‌వంటి అగ్రగణ్యులు కూడా వున్నారు. అయితే అర్ధ శతాబ్దిగా తన యావచ్ఛక్తినీ అనాధ బాలలకు, నిరుపేదలకు సేవ చెయ్యడంలోనే వినియోగించిన మదర్ తెరెసాకి యివ్వడానికి నిశ్చయించుకుంది నోబెల్ కమిటీ. అంతర్జాతీయ బాలల సంవత్సరంలో అనాధ బాలల మనుగడకై కృషి చేసిన మదర్ తెరెసాకి ఈ బహుమతి లభించడం ఔచితీ చిహ్నం.

ఆ విధంగా మదర్ తెరెసా స్వతంత్ర భారతావనిలో నోబెల్ బహుమతి పొందిన ప్రథమ వ్యక్తి అయ్యారు. గతంలో సాహిత్యంలో రవీంద్రనాథ టాగూర్ (1913), భౌతికశాస్త్రంలో సి. వి. రామన్ (1930) మొదలైన భారతీయులకు నోబెల్ బహుమతి లభించింది. శాంతికి మారుపేరైన భారతావనిలో ఒక వ్యక్తికి నోబెల్ శాంతి బహుమానం లభించడం యిదే ప్రథమం!

మార్టిన్ లూథర్ కింగ్, బెర్ట్రెండ్ రస్సెల్ వంటి మహనీయులు పొందిన నోబెల్ శాంతి బహుమానం 1901 లో ప్రారంభించినప్పటి నుంచి మదర్ తెరెసాతో కలిపి, ఆరుగురు స్త్రీలకు లభించింది. ఆ ఐదుగురూ–బారొనెస్ బెర్తావాన్ సట్నర్ (1905-ఆస్ట్రియా) జేన్ ఆడామ్స్ (1931-అమెరికా, నికోలస్ మూర్ట్ బట్లర్‌తోపాటు). ఎమిలీ జి. బాల్క్ (1946-అమెరికా, జాన్, ఆర్. మాట్‌తోపాటు), బెట్టీవిలియమ్స్, మైరీడ్ కార్రిగాన్ (1976-ఉత్తర ఐర్లాండ్)

మదర్ తెరెసాకి శాంతి బహుమానం లభించిందన్న ప్రకటన వినగానే "ఇటీవల కాలంలో రాజకీయాలతో కలుషితమైన నోబెల్ కమిటీ ఆలస్యంగానైనా ఒక మహనీయురాలి కృషిని గుర్తించింది" అన్న వ్యాఖ్యానాలు సర్వత్రా వినవచ్చాయి. ఎందరో ఆమెకీ బహుమతి వచ్చినందుకు సంతోషించారు. ప్రముఖులు ప్రశంసించారు. ఇక పేదప్రజల ఆనందానికి అంతులేదు.

కాని "అంతా భగవంతుడి దయ. నేను నిమిత్తమాత్రురాలిని" అనే మదర్ తెరెసా మాత్రం "ఈ రోజు నాకు ఎప్పటిలాగే వుంది. ఇందులో ఏ విశేషమూ కనిపించడం లేదు. ఆ బహుమతి వచ్చిందీ అంటే అది పేదప్రజలకు లభించిన గుర్తింపు మాత్రమే" అన్నారు. □

వినియోగదార్ల ఉద్యమం అనేది ఒక సాంఘిక ఉద్యమం. వినియోగదార్లలో చైతన్యాన్ని కలుగజేసి వారి హక్కులను కాపాడే ఉద్యమం. నాణ్యతగల వస్తువులకోసం, అవినీతిపరులైన వ్యాపారస్తుల పట్ల చర్య తీసుకోవడం కోసం ఉద్దేశించి ప్రారంభించిన ఉద్యమం.

అంచేత వినియోగదార్లు కేవలం సంఘం చేత గుర్తింపు పొందడమే కాక రాజకీయంగా కూడా గుర్తింపు పొందినట్లలెక్క. అందువల్ల ప్రభుత్వం కూడా వినియోగదార్ల సమస్యలను పరిశీలించి వాటికి తగ్గట్టుగా వ్యాపారస్తుల మీద కట్టడి తేవాలి. వారికి కొన్ని నియమావళులు రూపొందించాలి. అంతేకాదు – అవి అమలు జరుగుతున్నాయో లేదో కూడా చూడాలి.

అభివృద్ధి చెందిన దేశాలలో అగ్రస్థానం వహిస్తున్న అమెరికాలో కూడా ఈ మధ్య వినియోగదార్ల ఉద్యమాలు తీవ్రస్థాయిని చేరుకున్నాయి. చెప్పుకోదగ్గ విషయమేమిటంటే ఈ ఉద్యమానికి అత్యధిక సంఖ్యలో ప్రజాభిమానం లభించడమేకాక అక్కడి ప్రభుత్వం కూడా 'ఇవి వినియోగదార్ల హక్కులు' అని గుర్తించి అందుకు తగ్గట్టుగా తన సహకారాన్ని అందజేస్తోంది.

కాని మన దేశంలో వినియోగదార్ల హక్కులనీ వ్యాపారస్తుల హక్కులనీ విడివిడిగా నిర్ణయించారు. అవి ఎవరు నిర్ణయించారో తెలియదు కాని ఇన్నాళ్లూ అవే ప్రత్యక్షంగాను, పరోక్షంగానూ అమలులో వున్నాయి. ఆ హక్కులేమిటో పరిశీలిద్దాం.

వ్యాపారస్తులు 'తమ హక్కులు' అని చెప్పుకునే అంశాలు ఇవి:

- ☐ ఏ వస్తువైనా, ఏ సైజులోనైనా వారికి తోచినట్లుగా తయారు చేసి అమ్మవచ్చును. అయితే అది హానికరంగా వుండకూడదు. ఒకవేళ ఆ వస్తువువల్ల ఏదైనా హాని సంభవించేటట్లయితే ఆ విషయం హెచ్చరిస్తూ తీసుకోవలసిన జాగ్రత్తల గురించి వివరంగా తెలియజేయాలి.
- ☐ ఆ వస్తువు ధరను నిర్ణయించే అధికారం వారికే వుంది. కాని ఆ ధర అన్ని వర్గాలవారికీ ఒకే విధంగా వుండాలి. అందులో తేడా వుండకూడదు.
- ☐ తమ వస్తువు అమ్మకాన్ని వృద్ధి చేసేందుకు వారు ఎంత ధనమైనా వెచ్చించవచ్చును. కాని అది అనారోగ్యకరమైన పోటీగా మారకూడదు.
- ☐ తాము అమ్మే వస్తువు గురించి ఎటువంటి సమాచారాన్నయినా అందజేయవచ్చును. కాని అది తప్పుడు సమాచారంగా వుండకూడదు.
- ☐ వినియోగదార్లకు 'బహుమతి పథకాలు' తదితర ఆకర్షణీయమైన పథకాలను వ్యాపారస్తులు తమ యిష్టప్రకారం ప్రవేశపెట్టవచ్చును.



వారు చెప్పే వినియోగదార్ల హక్కులు ఇవి:

- ☐ తాము కొనే వస్తువు హానికరంగా వుండకూడదు అనుకోవడం.
- ☐ వర్తకులు ప్రకటనలలో చెప్పినట్లుగా ఆ వస్తువు వుండాలి అనుకోవడం.
- ☐ ఏ వస్తువైనా తమకి నచ్చకపోతే కొనకుండా మానెయ్యడం.

ఇవే ఇన్నాళ్లు గుత్తపెట్టుబడిదారులు, వ్యాపారస్తులు వినియోగదార్లకు ప్రసాదించిన హక్కులు!

పైన పేర్కొన్న ఇద్దరి హక్కులను చూస్తుంటే మన దేశంలో ఆధిపత్యం చెలాయిస్తున్నది వినియోగదారు కాదని, వర్తకులేననీ స్పష్టంగా తెలిసిపోతోంది.

నానాటికి పెరుగుతున్న ధరలు, నిత్యావసర వస్తువుల కొరత – యివన్నీ కూడా మన దేశంలో అమ్మకందార్లు లాభాలు సంపాయించేందుకు తగిన అవకాశం కల్పించాయి. ప్రభుత్వాలు అనిశ్చిత పరిస్థితిలో కొట్టుమిట్టాడుతూ ఆకాశానికి అంటుతున్న ధరలను అదుపులో పెట్టలేకపోతున్నాయి. ద్రవ్యోల్బణం పెరిగిపోతోంది. జనాభా పెరగడంతో వస్తువులకు డిమాండు పెరుగుతోంది. కాని అందుకు తగ్గ సరఫరా లేకపోతోంది. దాంతో అవినీతిపరులైన కొందరు వ్యాపారస్తులు ప్రజల అసహాయ స్థితిని తమకు అనుకూలంగా వాడుకుంటున్నారు. అసలే కరువులో కొట్టుమిట్టాడుతున్న వస్తువులను దాచేసి వాటి వెల విపరీతంగా పెంచేస్తున్నారు. అంతటితో పోనిస్తే వారి ఘనతేముంది? ఆ లాభాలు వారికి సరిపోతే యిక అది పేరాశ ఎలా అవుతుంది? ఆ వస్తువులను కల్తీలో ముంచెత్తి విరివిగా ధనార్జన చేస్తున్నారు.

కేంద్ర ఆరోగ్య మంత్రిత్వశాఖ దేశ వ్యాప్తంగా 1968 లో ఒక సర్వే జరిపింది. ఆ సర్వే ప్రకారం మనం తీసుకునే ఆహారపదార్థాలలో మూడవవంతు కల్తీచెయ్యబడినవేనని తేలింది.

ఈ సర్వే జరిగి పదకొండేళ్లవుతోంది. అప్పటికీ యిప్పటికీ కల్తీ ఎన్నింతలు పెరిగిందో ఈ ఉదాహరణ చెబుతుంది. 1977 లో బొంబాయిలో ఒక సంస్థ జరిపిన సర్వే ప్రకారం అక్కడ అమ్మకం చెయ్యబడుతున్న ఆహారపదార్థాలలో 90 శాతం కల్తీ చెయ్యబడుతున్నాయట!

మన దేశంలో వినియోగదార్లు స్థానిక వ్యాపారస్తుల చేతుల్లోనే కాకుండా విదేశీ సంస్థలచే కూడా దగా చేయబడుతున్నారు. అమెరికాకు చెందిన మందుల తయారీ కంపెనీలు తమ మందులను యూరప్‌లో కన్న బడుగుదేశాలలో అధిక వెలకి అమ్ముతున్నాయి. ఈ వెలల తేడా ఎంతుందంటే యూరప్‌లో ఆ లాభాలు ఇరవై అయిదు శాతం అయితే బడుగుదేశాలలో పదకొండు వందల శాతం వరకూ ఈ లాభాలు వుంటున్నాయట. అంటే విదేశీయ గుత్తాధిపత్య సంస్థలు ఎంతగా మందుల వెలలు పెంచేశాయో చూడండి.

ఇటువంటి పరిస్థితులలో వినియోగదార్లని రక్షించే వారెవరు? ప్రభుత్వం 'సివిల్ సప్లయిస్' పేరిట కొన్ని శాఖలు స్థాపించింది. ఇవి సరసమైన ధరలకు నిత్యావసర వస్తువులను అమ్మకం చెయ్యాలి. కాని తగిన నిధులు, శిక్షణ పొందిన సిబ్బంది తదితర సదుపాయాలు లేక యివి

# వినియోగదార్ల హక్కులు ఏమిటి?



తమ కర్తవ్యాన్ని సరిగ్గా నిర్వర్తించలేకపోతున్నాయి. ప్రభుత్వ విభాగాలలో వీటి కార్యక్రమాల అమలువట్ల జరిగే జాప్యం కూడా ఒక కారణమే.

అయితే ఈ ధరల పెరుగుదలపట్ల, కల్తీ వస్తువులపైనా కేవలం అసంతృప్తి ప్రకటించి వూరుకున్నంతమాత్రాన ప్రయోజనం లేదు. ఇది స్వేచ్ఛా స్వాతంత్ర్యాలయుగం. 'అడగందే అమ్మయినా పెట్టద'న్నట్లు తమ అసంతృప్తిని బహిరంగంగా వ్యక్తపరచవలసిన సమయం. అందువల్ల తయారీదారులు, ప్రకటనా సంస్థలు, వ్యాపారస్తులు-వీరందరిచే దగాచేయబడిన వినియోగదార్లు తమ సమస్యల్ని ఉద్యమాలరూపంలో బహిర్గతపరచాలి.

ఈనాడు వినియోగదార్ల అవసరాలు పెరిగాయి హక్కులూ పెరిగాయి. తమకు నచ్చకపోతే ఆ వస్తువు కొనకుండా మానెయ్యడమే వారి హక్కా? కాదు.

మరైతే వినియోగదార్ల హక్కులు ఏమిటి?

- ☐ తాము కొనుగోలు చేసే వస్తువు గురించి పూర్తిగా సమాచారం తెలుసుకోవడం
- ☐ నాణ్యతగల వస్తువులనే పొందడం
- ☐ గ్యారంటీ సమయం లోగా వస్తువు పాడైనట్లయితే తగిన సర్వీస్ సదుపాయాన్ని ఉచితంగా పొందడం
- ☐ సరసమైన ధరలకు నిత్యావసర వస్తువులు లభించేటట్లు చూడడం
- ☐ సందేహాస్పదంగా వున్న వస్తువులను అధికారుల దృష్టికి తెచ్చి తగిన చర్యలు తీసుకునేటట్లు చెయ్యడం
- ☐ నల్లబజారు, దొంగరవాణా వ్యాపారస్తుల అవినీతిధోరణిని బహిర్గతపరిచేవారికి ప్రభుత్వం తగిన రక్షణ కల్పించడం
- ☐ ప్రభుత్వంవద్ద నుంచి వినియోగదార్ల సమస్యలకు పూర్తి మద్దతు, సహకారం లభించేలా చూడడం.

వినియోగదార్లు విడివిడిగా తమ హక్కులకోసం గానీ, తమకు జరుగుతున్న అన్యాయాలకోసం గానీ పోరాడడం సాధ్యపడదు. కాబట్టి, వారందరూ కూడా తమకంటూ సమాఖ్యలను స్థాపించుకోవాలి. ఇవి నిష్పక్షపాతంగా తమకు సేవ చెయ్యగలిగేటట్లు చూసుకోవాలి. ఈ సమాఖ్యలు వినియోగదార్ల సమస్యలని ప్రభుత్వ దృష్టికి తెస్తూ, వ్యాపారస్తుల అన్యాయాలు తెలియజెబుతూ వినియోగదార్లకి సరైన న్యాయం చేకూరేటట్లు చెయ్యగలగాలి.

వినియోగదార్ల ఉద్యమం ముఖ్య ఉద్దేశ్యం-వ్యాపారస్తులకు వారి సాంఘిక బాధ్యతను తెలియజెప్పడం. అంతే. అంచేత ఈ ఉద్యమాలతో వినియోగదార్లందరూ తమ మీద కత్తికట్టినట్లుగా వ్యాపారస్తులు భావించనవసరం లేదు. సంఘానికి మేలు చేసే ఈ ఉద్యమాలను వ్యాపారస్తులు నిరసన భావంతో అంతకన్నా చూడకూడదు. అసలు వినియోగదార్లు, వ్యాపారస్తులు, ప్రభుత్వమూ కలిసి కట్టుగా కృషిచేసి నేడు ఏర్పడిన విషమ పరిస్థితుల నుంచి బయటపడేమార్గం వెతకాలి. అప్పుడే పెరుగుతున్న ధరలూ తగ్గుతాయి. నాణ్యతగల వస్తువులూ లభిస్తాయి; వినియోగదార్ల హక్కులు పరిరక్షింపబడతాయి. ☐

### గ్యారంటీ వ్యవహారం

ఒక కంపెనీ వాళ్లు కొత్తగా ప్రవేశపెట్టిన ఒక ఎలక్ట్రిక్ ఇస్త్రీపెట్టెను ఒకావిడ చూసి, ధరా అదీ అడిగింది. ధర, పెట్టె ఆకారం అదీ చూసి ముచ్చటపడి, "ఎన్నాళ్లు గ్యారంటీ ఇస్తారు?" అని అడిగింది. ఆ కంపెనీ అధికారి ఆ మాటకి నవ్వేసి—"గ్యారంటీయా! చెడిపోతుందన్న నమ్మకం వున్నవాళ్ళే 'గ్యారంటీ' అని పెట్టుకుంటారు. సంవత్సరం గ్యారంటీ అంటే, ఆ తర్వాత అది చెడిపోతుందన్నమాటే గదా—మనకి అలాంటి ప్రసక్తే లేదు గనక, గ్యారంటీ ప్రసక్తి అసలు లేనేలేదు" అన్నాడు బల్ల గుద్దేస్తూ. ఆవిడ మరోసారి ఇస్త్రీపెట్టె వంక ఆప్యాయతగా చూసి, డబ్బు చెల్లించేసి, ఇస్త్రీపెట్టె తీసుకుంది!

వన్నెలపువ్వులా అందంగా, గులాబిపువ్వులా సుకుమారంగా, జాజి తీగలా నాజూగ్గా కనిపించాలని, స్త్రీలందరూ అనుకుంటారు. నిజానికి, మగవారి కంటె స్త్రీలే, సౌందర్యారాధకులు, సౌందర్యాభిలాషులూ.

తొలిరోజుల్లో స్త్రీల అందం తమ 'సొమ్ము'గా భావించి కృషి చేశారు. మన పురాణాలూ, ఇతిహాసాలూ, చరిత్రలూ బట్టి చూస్తే, దాదాపు ఆనాటి స్త్రీ లందరూ సౌందర్యరాశులే.

ఇవాళ, కాలేజి చదువులు అభివృద్ధిచెందిన తర్వాత, స్త్రీలలో ఎక్కువమంది ఉద్యోగినులుగా మారిన తర్వాత, మళ్లీ సౌందర్యాపేక్ష పెరిగింది. దానికి బాగా దోహదం చేస్తున్నాయి-'బ్యూటీ పార్లర్స్' అనబడే, 'సౌందర్యశాల'లు.

ఎంత అందంగా వున్నవాళ్లైనా సరే, తీర్చి దిద్దుకుంటేనే, వారి అందం కనిపిస్తుంది. లేకపోతే, సానపెట్టని బంగారం లాగే కనిపిస్తారు. ముఖానికి తగ్గ రీతిలో తల దువ్వుకోడం, శరీరాకృతికీ, అంగ సౌష్టవానికి తగ్గట్టుగా దుస్తులు ధరించడం, అలంకారాలు చేసుకోడం-వింతేమీ కాదు.

కాకుండా, కాలేజీలు వున్న చిన్న పట్టణాల్లో కూడా ఇవాళ, నిదానంగా బ్యూటీపార్లర్స్ వెలుస్తున్నాయి.

బ్యూటీ పార్లర్స్‌లో, బ్యూటీ క్లినిక్స్‌లో బ్యూటీషియన్స్ దగ్గర శిక్షణ పొందినవారు, పని చేస్తారు. వాళ్లు ముఖానికి మేకప్ వేస్తారు; హెయిర్ కట్ చేస్తారు; ఫేషియల్ చేస్తారు; జుట్టుకు రంగు వేస్తారు; షాంపూ స్నానాలు, ఆవిరి స్నానాలూ చేయిస్తారు; కనుబొమలు అందంగా విల్లులా కనిపించేలా తీర్చిదిద్దుతారు; శరీరం మీద వుండే అనవసరమైన రోమాలను లాగేస్తారు. ఇలాంటివన్నీ నిదానంగా చక్కగా చెయ్యడానికీ, చేయించడానికీ వాళ్లకు ఎంతో శిక్షణ అవసరం. అందుకే, శిక్షణ పొందినవారే ఈ సెలూన్స్‌లో మనకి కనిపిస్తారు.

అయితే, 'బ్యూటీ పార్లర్స్ అనేవి, ధనికులకే కాని, మధ్యతరగతివాళ్లకి కావు' అనుకోనక్కర్లేదు. ఉద్యోగాలు చేసేవాళ్లంతా దాదాపు మధ్యతరగతివాళ్లే గదా. వీళ్లందర్నీ కాకపోయినా, వీళ్లలో కొందర్ని

టయింది. పెళ్లి తర్వాత జరిగే 'రిసెప్షన్'లో వధువు-అత్యంత అధునాతనమైన నవ వధువులా కనిపిస్తుంది. తలిదండ్రులు బ్యూటీ పార్లర్స్ తీసుకెళ్లి, అందంగా ముస్తాబు చేయిస్తారు. రెండు మూడు గంటలపాటు జరిగే ఈ తతంగంలో ముఖానికి మేకప్ వెయ్యడం, తల దువ్వి సిగ వెయ్యడం, లేదా జడ వెయ్యడం, కనుబొమలు, పెదవులు తీర్చిదిద్దడం, మొదలైనవెన్నో వుంటాయి. ఇలా రూపొందించడానికి పార్లర్, 50 నుంచి 60 రూపాయల వరకూ వసూలు చేస్తుంది.

ఫేషియల్స్ (15 రూ. నుంచి 40 రూ. వరకూ) క్రమప్రకారం చేసుకుంటే, (నెలకో, ఇరవై రోజులకో ఒకసారి - అర్ధగంట నుంచి రెండు గంటల వరకూ పని) ముఖం మీద ముడతలు పడవు; చర్మం 'తాజా'గా వుండి మెరుస్తుంది.

బ్యూటీషియన్స్, తరచు తమ పార్లర్స్‌కి వచ్చే వాళ్లకి ఎన్నో సూచనలు కూడా ఇస్తూ వుంటారు. ముఖానికి ఏమేం వాడాలి? ఎలా వాడాలి? - అని.

# సౌందర్య శాలలు

ఇవాళ, మన దేశంలో సౌందర్య సాధనాల ఉత్పత్తి బాగా పెరగడం-స్త్రీల సౌందర్యాపేక్ష పెరిగిందనడానికి పెద్ద నిదర్శనం. లిప్‌స్టిక్‌లూ, కాటుకలు, ఫేస్ పౌడర్లు, క్రీమ్‌లూ, గోళ్లరంగులు, మొదలైనవెన్నో, ఇవాళ వనితల దైనందిన జీవితంలో బాగా చోటు చేసుకున్నాయి. ఈ ఆధునిక వస్తువులు తయారుకాకముందు, చేతులనూ గోళ్లనూ గోరింటాకుతో ఎర్రగా చేసుకునేవారు. తాంబూలం వేసుకుని పెదవులు ఎర్రగా కనిపించేలా చేసుకునేవారు. వెంట్రుకలు తెల్లబడితే, కాటుకతోనో, జీడిగింజతోనో నలుపు చేసుకునేవారు. ఇవాళ్టి సౌందర్య విధానం, ఇవాళ్టిదే కాదు. ఆనాడూ వుంది; అంతకు ముందూ వుంది. అయితే వస్తువుల వాడకంలో మాత్రం కొత్తదనం వచ్చింది.

ఉద్యోగినులు, విద్యార్థినులూ ఎక్కువగా కనిపించే పట్టణాల్లో సౌందర్యశాలలు బాగా కనిపిస్తాయి. కలకత్తా, బొంబాయి, మద్రాసు, బెంగళూరు, ఢిల్లీ, హైద్రాబాదు, త్రివేండ్రమ్ మొదలైన నగరాల్లోనే

యినా, మనం ఈ పార్లర్స్‌లో తరచు చూస్తూ వుంటాము. నెలకు ఒకసారి కనుబొమలు దిద్దుకోడానికి, మూతి మీద కనిపించే వెంట్రుకల్ని తీసివేయించడానికి చాలామంది వస్తూ వుంటారు-తక్కిన ఫేషియల్స్ మొదలైనవాటి మాట ఎలా వున్నా. పెద్ద పట్టణాల్లో సాధారణంగా కనుబొమలు తీర్చిదిద్దడానికి, (పది నిమిషాల పని) 3 నుంచి 4 రూపాయల వరకూ పార్లర్ చార్జి చేస్తుంది. పెద్ద పెద్ద హోటల్స్‌లో వుండే పార్లర్స్ అయితే, 5, 6 రూపాయలు వసూలు చేస్తాయి. చైనీస్ హెయిర్ డ్రస్సింగ్ సెలూన్స్‌లో అయితే, చార్జీలు తక్కువగా వుంటాయి. సౌందర్యశాలల్లో శిక్షణ పొంది పనిచేసే వాళ్లలో చైనా అమ్మాయిలే ఎక్కువగా కనిపిస్తారు.

ఇవాళ పట్టణాల్లో ఎంతటి మధ్యతరగతి కుటుంబంలోని అమ్మాయికి వివాహం జరిగినా కూడా 'బ్రైడల్ మేకప్' చేయించడం అలవా

భోజనం, ఫలహారాల విషయాల్లో కూడా వీళ్లు తగిన సూచనలు ఇస్తూ, డాక్టర్స్‌లాగా పరీక్షిస్తూ వుంటారు.

కొన్ని పెద్ద పెద్ద పార్లర్స్ అయితే 'హెల్త్ క్లబ్స్' లాగా నడుస్తూ వుంటాయి. ఇక్కడ స్టీమ్ బాత్‌లూ, రకరకాల స్లిమ్మింగ్ ఎక్సర్‌సైజ్‌లూ కూడా వుంటాయి. కొన్నింటిలో 'బ్యూటీ కోర్స్'లో శిక్షణ కూడా ఇస్తారు. బ్యూటీ పార్లర్స్‌లో ఇవాళ 'పార్ట్ టైమ్'గా పనిచేసే కొందరు గృహిణులు, కాలేజి అమ్మాయిలూ ఇలా 'బ్యూటీ కోర్స్' అభ్యసించినవారే. దీనివల్ల వారికి తగిన ఆదాయం వుంటుంది. ఇందులో ఉత్సాహం వున్న వనితలు (కాస్త చదువుకున్నవారు) పెద్ద పట్నాల్లో వుండే పెద్ద పార్లర్స్‌లో శిక్షణపొందితే, తమ పట్టణాల్లో తామే చిన్న 'పార్లర్' ఆరంభించుకోవచ్చు. బ్యూటీ పార్లర్స్ సవ్యంగా నిర్వహించగలిగితే అది - లాభసాటి అయిన మంచి వ్యాపారం కూడా. □

# వ్యాయామ నాట్యం



# "కౌశికి"

లోకరక్షణ కోసం పరమశివుడు ఆనందతాండవం చేసి నటరాజు అయ్యాడు. శివతాండవ నృత్యం ఒకప్పుడు శారీరక మానసిక ఆరోగ్యాన్ని పెంపొందించే వ్యాయామంగా బాగా ప్రాచుర్యం పొందింది. అయితే కాలక్రమేణా ప్రజలు దానిని మరచి పోయారు. కాని ఇప్పుడిప్పుడు మళ్ళీ దానికి ప్రాచుర్యం కలిగించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. శివతాండవ నృత్యం పురుషుల శరీర తత్వానికి తగినదే కాని స్త్రీలకు అది సరిపడదు.

అమెరికాలో ఈ నృత్యం నేర్పించడానికి ప్రయత్నాలు జరిగినప్పుడు దీనిని నేర్చుకోడానికి కొందరు వనితలు కూడా ఎంతో ఉత్సాహం కనబరవారు. నేర్చుకోసాగారు. పర్యవసానంగా వారిలో చాలామందికి మీసం గడ్డం లాంటి పురుష లక్షణాలు పుట్టుకు రాసాగాయట. అందువల్ల తాండవ నృత్యానికి బదులుగా - దానికి సమానమైన మంచి ఫలితాలు కలిగించే కౌశికీనృత్యం స్త్రీలకు నేర్పబడుతోంది.

బాలికల నుంచి వయోధికులవరకు అన్ని ప్రాయాలవారూ దీనిని అభ్యసించవచ్చు. ఇది చేయడం కూడా చాలా సులభమే. యోగాసనాలు వెయ్యాలంటే కొన్ని కట్టుబాట్లు, నియమాలు విధిగా పాటించాలి. అయితే దీనికి అలా కాదు. భోజనం చేయడానికి ముందూ, భోజనం చేశాక రెండు గంటల తర్వాత ఏ సమయంలోనైనా విరామం ఉన్నప్పుడు చేస్తేచాలు.

ఈ నృత్యం క్రమం తప్పకుండా చేయడం








రెడి 1 ధిన్, 2 ధిన్, 3 ధిన్, 4 ధిన్, 5 ధిన్,

వల్ల బరువు పెరగడం తగ్గుతుంది. అందంగా, ఆకర్షణీయంగా దీర్ఘ యౌవనంతో వుండడానికి సాధ్యమవుతుంది. కామెర్లలాంటి వ్యాధులు వచ్చినప్పుడు – ఆ తర్వాత కాలేయం ఆరోగ్యం పుంజుకోడానికి ఈ నృత్యం ఔషధంలా పని చేస్తుంది. రోజూ ఉదయం, సాయంకాలం దీనిని అభ్యసించడం వల్ల గర్భిణీ స్త్రీలకు సుఖ ప్రసవం జరుగుతుంది.

చేసే విధానం :

ఆరంభం – ('రెడి' పొజిషన్)







6 ధిన్, 7 ధిన్, 8 ధిన్, 9 ధిన్, 10 ధిన్,



11 ధిన్, 12 ధిన్, 13 ధిన్, 14 ధిన్, 15 ధిన్, 16 ధిన్,

రెండు కాళ్ళ మధ్య ఒక అడుగు దూరం ఖాళీ వుండేట్టు నిలబడాలి. చేతులు పైకెత్తి తల పైకి నమస్కరించేటట్టుగా తీసుకు రావాలి. ఈ నాట్యంలో 'రెడి' అన్న తర్వాత 18 అడుగులు (స్టెప్స్) వున్నాయి. 1-16 ధిన్, ధిన్ అనీ 17, 18 తా తా అనీ అంటారు.

కుడివైపుగా వంగడం 1–5 ధిన్

1 వ ధిన్

నడుమును కుడివైపుగా వంచాలి. చేతులు, నడుము వంచడానికి అనువుగా నిదానంగా క్రిందికి రావాలి. ఇదే సమయంలో కుడి కాలును ఎడమ కాలు వెనుక వుంచాలి. ఆ తర్వాత మునుపటి స్థానానికి తీసుకురావాలి. (10 డిగ్రీలు వంచాలి.)

2 వ ధిన్

తల, చేతులు ఇంకా కొంచెం కుడివైపుకి వంచి ఎడమకాలు ముందు భాగాన్ని కుడి కాలు వెనుక వుంచి యథాస్థానానికి తీసుకురావాలి. (20° వంచాలి)

3 వ ధిన్

ఇంకా బాగా వంగి కుడి కాలును ఎడమ కాలు వెనుక వుంచి తర్వాత మునుపటి స్థానానికి తీసుకు రావాలి. (30° వంచాలి,)

4 వ ధిన్

వంగివున్నదానిలో సగం పైకి రావాలి. ఎడమ కాలిని కుడిపాదం వెనుక వుంచి మళ్ళీ నిటారుగా రావాలి. (15°).

5 వ ధిన్

ప్రారంభ భంగిమకు అంటే 'రెడీ' పొజిషన్‌కు రావాలన్నమాట. ఇప్పుడు కుడికాలు ఎడమకాలు వెనుకకువచ్చి యథాస్థానానికి వస్తుందన్నమాట.

కొంత అభ్యసించి ప్రావీణ్యం సంపాయించిన తర్వాత 20°, 40°, 60° అంటూ పెంచుకుంటూ వెళ్ళవచ్చు. పసిప్రాయంలోనివారికి ఇది చాలా సులభం.



17 తా, 18 తా.

ఎడమవైపుకి వంగడం 6–10 ధిన్

కుడివైపుకు వంగినవిధంగానే ఎడమవైపుకీ వంగాలి. అయితే ఒకే ఒక వ్యత్యాసం. ఎడమ కాలును కుడికాలు వెనుక వుంచి ప్రారంభించాలి. అంటే —

కుడివైపు అభ్యసించేటప్పుడు కుడికాలుతోనూ, ఎడమవైపు చేసేటప్పుడు ఎడమకాలుతోనూ ప్రారంభించాలన్నమాట.

ముందువైపుకు వంగడం 11–13 ధిన్



పాత్రల మీదా, వస్తువుల మీదా వుండే మరకలు—టొమెటో రసం కాస్త పూసి శుభ్రం చేసినట్లయితే సులభంగా పోతాయి.

11 వ ధిన్

కుడికాలును ఎడమకాలు వెనుక వుంచి రెండు చేతులను చాచినట్టు ముందుకు తీసుకువచ్చి ఒకటిగా చేర్చాలి.

12 వ ధిన్

రెండు చేతుల మునివేళ్ళు భూమిని తాకేవిధంగా ముందుకు వంగాలి. ఇప్పుడు మోకాళ్లు వంగకుండా చూసుకోవాలి. తర్వాత ఎడమకాలును కుడికాలి వెనుక వుంచి ముందుకుతేవాలి. దీనినే నామముద్ర అంటారు.

13 వ ధిన్

మళ్ళీ 'రెడి' పొజిషన్‌కు రావడం ఇది. కుడి కాలును ఎడమకాలు వెనుకవుంచి నిటారుగా నిలబడాలి.

14 వ ధిన్

ఎడమకాలితో ప్రారంభించాలి. చేతులు పైకెత్తి నడుమూ, తలా, చేతులూ వెనుకకు వంచాలి.

15 వ ధిన్

ఇంకా కొంచెం వెనుకకు వంగి కుడికాలును ఎడమకాలు వెనుకకు తేవాలి.

16 వ ధిన్

'రెడి' పొజిషన్‌కు రావడం. ఇంతటితో ఎడమకాలి నృత్యం పూర్తవుతుందన్నమాట.

17, 18 (స్టెప్స్) అడుగులు, తా, తా

మొదట కుడికాలితో ఆ తర్వాత ఎడమపాదం తోనూ నేల మీద బలంగా మోపాలి. పాదం మొత్తం నేలను ఆనాలి. దీనిని మార్చ్‌టైమ్ మార్చ్ విధంగా చెయ్యాలి. మోకాళ్ళు, మోచిప్పలు, తొడలు బలం పుంజుకోడానికీ, దృఢతరం కావడానికి ఇది దోహదం చేస్తుంది.

మొదట కాళ్లనృత్యం మాత్రం ప్రారంభించి ఆపైన చేతులూ కలిపి అభ్యసించవచ్చు. మొదటి ధిన్ కుడికాలుతో ప్రారంభించి కాళ్ళను మార్చుకుంటూ కుడి, ఎడమ అంటూ 16 వ ధిన్ వరకు చేయవచ్చు. ఆ తర్వాత 17, 18 తా, తా, అభ్యసించడం వల్ల వేగంగా నృత్యం చెయ్యడం సాధ్యమవుతుంది.

ఇందులోని చిత్రాలు న్యూయార్క్ నుంచి వెలువడే క్రిమ్సన్ డాన్ పత్రిక నుంచి తీసుకోబడ్డాయి.

—ఆండాళ్



# ముఖ్య ద్వారానికి అందమైన అలంకారం

కొన్నేళ్ళ క్రితం రంగు రంగుల గాజు పూసలు నిటారుగా దారంలోకి ఎక్కించి, గుమ్మాలకి వేలాడదీసేవారు. రాను రాను, గుమ్మాలకు 'కర్టెన్లు' వచ్చిన తర్వాత, ఆ ఫాషను వెళ్ళిపోయింది; గాజు పూసలూ నిష్క్రమించాయి.

ఇటీవల 'ప్లాస్టిక్ యుగం' ఆరంభమై రకరకాలైన ప్లాస్టిక్ వస్తువులు రావడంతో, పూసలు కూడా వచ్చాయి; పూసలతో ఎన్నో అల్లికలు, వస్తువులూ వచ్చాయి. ఆ రావడంలో గుమ్మాలకీ, కిటికీలకీ పూసలు, గవ్వలూ లాంటివి వేలాడ సలు ఎక్కువగా వేసుకోవాలి. అంతే!

ప్లాస్టిక్ పూసలు నూరు గ్రాముల కొలతల్లో ఇస్తారు. సాధారణంగా అవి 'పాక్' చెయ్యబడే వుంటాయి. మనకి కావలసిన సైజు "ఆరు". ఆ సైజు చెప్పి, ముదురు ఆకుపచ్చ (Dark green) 200 గ్రా; చిలక ఆకుపచ్చ (Light green) 100 గ్రా; నీలం 100 గ్రా; ఎరుపు 100 గ్రా; కాఫీ (Coffee or Brown) 200 గ్రా; తెలుపు 500 గ్రా; పసుపు పచ్చ 100 గ్రా; గులాబి (Pink) 100 గ్రాములూ - తీసుకోవాలి.

నికి కింద ముడి వెయ్యాలి. ఇక్కడ ఇచ్చిన పూసల జాబితా – ఎడమ వేపు నుంచి ఆరంభం చేసుకోవాలి. ఇచ్చిన లెక్క ప్రకారం పూసలు ఎక్కిస్తే, పూసలు కింద నుంచి పైకి వస్తాయి. అంటే—ఒకటవ వరసలో తె. 22 అని వుంది గదా, ఆ 22 పూసలూ ముందుగా ఎక్కిస్తే, (గొట్టాం పూసఎక్కించినతర్వాత) అవి కిందకి పోతాయి. వాటి పైన ము. ఆ 1; తె. 3—అలా వస్తాయన్న మాట. వరసలో వున్నట్టుగా అన్ని పూసలనూ దారంలోకి ఎక్కించిన తర్వాత, దారం పైభాగాన్ని, కర్ర ప్రతి వరసకి ముందు ఒక రంగు పూస, "గొట్టాం పూస ఎక్కించాలి" అని వేరుగా రాయలేదు.

[గమనిక: పూసలు ఎక్కించడంలో ఎక్కడైనా అనుమానం కలిగినా, తప్పు వచ్చినట్టు అనిపించినా, చిత్రాన్ని చూడండి. వరసలు రంధ్రంలో గుచ్చి, కడుతున్నప్పుడల్లా, చిత్రంలో వున్నట్టుగా ఆకారం వస్తోందో లేదో గమనించుకుంటూ వుంటే, ఇబ్బంది రాదు.]

వరసలో ఇచ్చిన అక్షరాల వివరాలు: తె: తెలుపు; నీ: నీలం; కా: కాఫీ రంగు; గు: గులాబి; ఎ: ఎరుపు; ప: పసుపు; చి. ఆ: చిలక ఆకుపచ్చ; ము. ఆ: ముదురు ఆకుపచ్చ.

దీయడం మళ్ళీ 'ఫాషన్' అయింది.

ఇందులోనే ఒకటి — పూసలతో చిలుకలూ నెమళ్ళూ చేసి, ముఖ్య ద్వారాన్ని 'శుక మయూర ద్వారం'గా మార్చుకోడం.

ప్లాస్టిక్ తీగలతోనూ, పూసలతోనూ సంచులు, వస్తువులూ చెయ్యడంలో ఇవాళ ఎందరో ఉత్సాహం చూపిస్తున్నారు. అలాంటి ఉత్సాహం గల వారు చేసుకోగలిగేదే—ఈ వర్ణ వర్ణ శుక, మయూరాలంకరణ.

అయితే, దీనికి ఓపిక బాగా కావాలి; శ్రద్ధ వుండాలి. రెండూ వుంటే 50, 55 రూపాయల ఖర్చుతో, ముఖ్యద్వారం అందంగా అలరారుతుంది.

ఇవాళ, ప్రతి వూళ్లోనూ ప్లాస్టిక్ పూసలు అమ్ముతున్నారు. వాటికి సైజులున్నాయి. ఇక్కడ వర్ణ చిత్రంలో చూపిన ద్వారాలంకరణకి ఏమేం కావాలంటే—

సాధారణంగా గుమ్మాల వెడల్పు 42 అంగుళాల నుంచి 46, 50 అంగుళాల వరకూ వుంటుంది. ఇప్పుడు ఇక్కడ ఇస్తున్న వివరాలు — 42 అంగుళాల వెడల్పు గల గుమ్మానికి సరిపోయేవి. గుమ్మం ఇంకా వెడల్పు వున్నా కూడా డిజైను పూర్తిగా ఇలాగే వేసుకోవచ్చు. ఏమీ తేడా వుండదు. అయితే, ఆ చివర, ఈ చివరా మాత్రం ఇష్టం వచ్చిన రంగుల్లో పూసలు పొడుగ్గా ఎక్కించుకుని, ఐదు, ఆరు వరవీటితోపాటు గొట్టాం పూసలు కూడా కావాలి. 3 అంగుళాల సైజులో వుండే గొట్టాం పూసల్లో-నీలం ఒక పాకెట్టు, (100 గ్రాములన్నమాట) చిలక ఆకుపచ్చ ఒక పాకెట్టూ తీసుకోవాలి. ఇవి తీసుకున్నాక, నైలాన్ దారం (పూసలో దూరేలా వుండాలి) ఒక పెద్ద ఉండ తీసుకోవాలి.

ఇవన్నీ తీసుకున్న తర్వాత, కార్పెంటర్ దగ్గరకి వెళ్ళి — $\frac{1}{2}'' \times \frac{1}{2}''$ మందంతో 42 అంగుళాల పొడుగు వుండే (గుమ్మం వెడల్పు ఎంత వుందో ఆ సైజు) కర్రను చెక్కి, దానికి పక్కపక్కనే రంధ్రాలు (Drilling) చేసి ఇమ్మని చెప్పాలి. ఈ రంధ్రాల గుండానే, పూసలదారం వేలాడుతుందన్న మాట. ఆ రంధ్రాలు 90 పడతాయి. రంధ్రానికి రంధ్రానికీ మధ్య దూరం ఎంత వీలైతే అంత తక్కువగా వుండాలి.




ఆ కర్రను తీసుకొచ్చి, కింద వున్న ప్రకారం పూసలని దారంలోకి ఎక్కించుకోవాలి. ముందుగా దారా

వర్ణచిత్రం : సత్యకుమార్

మొదటి రంధ్రంలోకి ఎక్కించి, దగ్గరగా లాగి, పైన ముడి వేసెయ్యాలి. మిగిలిన దారం ముక్క వుంటే, కత్తిరించెయ్యాలి. ఆ ప్రకారం, ఒక్కో వరసలోని దారానికి పూసలు ఎక్కిస్తూ, వరస పూర్తయిన తర్వాత, రంధ్రంలోకి ఎక్కించి ముడివేస్తూ వుండాలి. దారాన్ని 'ఇంత పొడుగుకి' అని ముందే కత్తిరించెయ్యకూడదు.

అలా అన్నీ కర్రకు ఎక్కించేసిన తర్వాత, ఆ అలంకారాన్ని అలాగే తీసుకెళ్ళి గుమ్మం పైన పెట్టి, అటూ ఇటూ మేకులువేసి కొట్టి, బిగించెయ్యాలి. మీ యింటి ద్వారం 'శుకమయూర ద్వారం'గా మారిపోయి, వచ్చిన వారిని శోభాయమానంగా ఆహ్వానిస్తుంది.

ఒక ముఖ్య విషయం: వరసలో ఇచ్చిన పూసలు ఎక్కించేముందు ప్రతి దారానికీ కింద ముడి వేసిన వెంటనే ఒక పసుపు పచ్చ పూసగాని ఎర్ర పూసగాని ఎక్కించాలి-తర్వాత నీలంది గాని, ము. ఆ. రంగులోది గాని పొడుగుపాటి గొట్టం పూస ఎక్కించాలి. (చిత్రంలో చూడండి)పొడుగు గొట్టాం పూస ఎక్కించిన తర్వాతనే కిందవున్న లెక్క ప్రకారం గుండ్రని పూసలు ఎక్కించాలి. అందుకనే

**ఒకటవ వరసలో :** తె-22, ము. ఆ-1, తె-3, ము. ఆ-2, తె-2, ఎ-1, తె-1; **రెండవ వరసలో :** తె-22, ము. ఆ-2, తె-2, ము. ఆ-1, గు-1, ము. ఆ-1, తె-2, ఎ-1, తె-1; **3 వ వరసలో :** తె-7, ము. ఆ-1, తె-14, ము. ఆ-4, తె-1, ము. ఆ-1, గు-1, ము. ఆ-1, తె-2, ఎ-1, తె-1; **4 వ వరసలో :** తె-8, ము. ఆ-3, తె-11, ము. ఆ-3, ప-1, ము. ఆ-1, తె-1, ము. ఆ-1, గు-1, ము. ఆ-1, తె-2, ఎ-1, తె-1; **5 వ వరసలో :** తె-9, ము. ఆ-4, తె-6, ము. ఆ-1, తె-3, ము. ఆ-2, ప-1, ము. ఆ-2, తె-1, ము. ఆ-3, తె-2, ఎ-1, తె-1; **6 వ వరసలో :** తె-10, ము. ఆ-4, తె-5, ము. ఆ-2, తె-3, ము. ఆ-1, ప-1, ము. ఆ-3, తె-1, ము. ఆ-3, తె-2, ఎ-1, తె-1; **7 వ వరసలో :** తె-11, ము. ఆ-3, తె-3, ము. ఆ-5, తె-3, ము. ఆ-4, తె-2, కా-1, తె-4, ఎ-1, తె-1; **8 వ వరసలో:** తె-6, ము. ఆ-1, తె-6, ము. ఆ-3, తె-2, ము. ఆ-3, ప-1, ము. ఆ-1, తె-3, కా-2, తె-3, కా-1, తె-5, ఎ-1, తె-1; **9 వ వరసలో :** తె-7, ము. ఆ-1, తె-1, ము. ఆ-4, తె-2, ము. ఆ-2, తె-2, ము. ఆ-2, ప-1, ము. ఆ-2, తె-2, కా-2, తె-3, కా-1, తె-6, ఎ-1, తె-1; **10 వ వరసలో:** తె-8, ము. ఆ-7, తె-2, కా-1, తె-2, ము. ఆ-1, ప-1, ము. ఆ-3, తె-2, కా-1, తె-3, కా-1, తె-2, ము. ఆ-4, తె-1, ఎ-1, తె-1; **11 వ వరసలో :** తె-9, ము. ఆ-1, గు-5, ము. ఆ-1, తె-2, కా-1, తె-2, కా-1, ము. ఆ-3, తె-3, కా-1, తె-1, కా-2, తె-2, ము. ఆ-4, తె-2, ఎ-1, తె-1; **12 వ వరసలో :** తె-7, ము.ఆ-2,

తె-2, ము. ఆ-6, కా-1, తె-1, కా-1, తె-1, కా-1, తె - 7, కా - 3, తె-2, ము. ఆ-2, గు-1, ము. ఆ-2, తె-2, ఎ-1, తె-1; **13 వ వరుసలో :** తె-7, ము. ఆ-4, తె-3, ము. ఆ-4, తె-2, కా-2, తె-7, కా-3, తె-3, ము. ఆ-2, గు-1, ము. ఆ-2, తె-2, ఎ-1, తె-1; **14 వ వరుసలో :** తె-5, ము. ఆ-7, తె-9, కా-2, తె-6, కా-3, తె-4, ము. ఆ-4, తె-3, ఎ-1, తె-1; **15 వ వరుసలో :** తె-5, ము. ఆ-4, ప-2, ము. ఆ-4, తె-7, కా-2, తె-5, కా-7, తె-2, కా-1, తె-5, ఎ-1, తె-1; **16 వ వరుసలో :** తె-6, ము. ఆ-4, గు-1, ప-1, ము. ఆ-6, తె-5, కా-2, తె-3, కా-4, తె-4, కా-3, తె-6, ఎ-1, తె-1 **17 వ వరుసలో :** తె-6, ము. ఆ-2, ప-2, ము. ఆ-6, ప-2, ము. ఆ-2, తె-4, కా-4, తె-1, కా-4, తె-8, కా-1, తె-6. ఎ-1, తె-1; **18 వ వరుసలో :** తె-8, ము. ఆ-1, గు-1, ప-1, ము. ఆ-3, ప-2, ము. ఆ-1, గు-1, ప-1, ము. ఆ-3, తె-3, కా-5, తె-11, కా-1, తె-5, ఎ-1, తె-1; **19 వ వరుసలో :** తె-9, ము. ఆ-3, ప-2, ము. ఆ-1, గు-1, ప-1, ము. ఆ-2, ప-2, ము. ఆ-3, తె-1, కా-4, తె-7, ము. ఆ-4, కా-3, తె-5, ఎ-1, తె-1; **20 వ వరుసలో :** తె-11, ము. ఆ-2, గు-1, ప-1, ము. ఆ-5, గు-1, ప-1, ము. ఆ-5, కా-3, తె-7, ము. ఆ-6, తె-2. ము. ఆ-1, తె-3, ఎ-1, తె-1; **21 వ వరుసలో :** తె-7, ము. ఆ 2, ము. ఆ 5, ప 2, ము. ఆ 4, ప 2, ము. ఆ 2, క-2, తె-8, ము. ఆ-2, గు-2, ము. ఆ 2, తె-2, కా-1, తె 3, ఎ-1, తె-1. **22వ వరుస :** తె-6, ము. ఆ 3, తె-3, గు-1, ప-1 ము. ఆ-4, గు 1, ప 1, ము. ఆ. 3, కా-1, ము. ఆ 1 తె-7, ము. ఆ-1, గు-1, ము. ఆ 3, తె 2, ము. ఆ 3, తె-2, ఎ-1, తె-1. **23వ వరుస :** తె-5, ము. ఆ 3, తె-5, ము. ఆ-4, ప-2, ము. ఆ 7, ఎ-2, తె-6, ము. ఆ-4, తె-2, ము. ఆ-2, గు-1, ము. ఆ-1, తె-2, ఎ-1, తె-1. **24వ వరుస :** తె-4, ము. ఆ-2, గు 1, ము. ఆ 1. తె 1, ము. ఆ 3, గు-1, ప, 1, ము. ఆ-2, ప-2, ము. ఆ 3, ఎ-1, ప-1, ఎ, 1, తె-5, ము. ఆ 1 తె-6, ము. ఆ 2, గు-1, ము. ఆ 1, తె 2, ఎ-1 తె-1. **25వ వరుస :** తె-3, ము. ఆ 2, గు 1, ము. ఆ 1, తె-7, ము. ఆ 5, గు 1, ప 1, ము. ఆ 3, ప 1 ఎ 1 ప-1 ఎ 1 తె-10, ము. ఆ 2, గు-1, ము. ఆ-1, తె-2, ఎ-1, తె-1. **26వ వరుస :** తె-4, ము. ఆ-3, తె-9, ము. ఆ 7, నీ-1, ప-1, ఎ-1, ప-1, ఎ-1, తె-10, ము. ఆ 2, గు-1, ము. ఆ-1, తె-2, ఎ-1, తె-1. **27వ వరుస :** తె-3, కా-2, తె 10, ము. ఆ-6, నీ-3, ప-1, ఎ-1, ప-1, ఎ-1, తె-9, ము. ఆ-3, తె-3, ఎ-1, తె-1. **28వ వరుస:** తె-5, కా-2, తె-14, నీ 1, ఎ 1, ప 1, ఎ 1, నీ-1, ప 1, ఎ-1, ప 1, ఎ 1, తె-9, ము. ఆ-1, తె-3, ఎ-1, తె-1. **29వ వరుస :** తె-6, కా-3, తె-9, కా-2, ఎ-2, నీ-1, ప-1, ఎ-1, ప-1, ఎ-1, నీ-1, ప-1, ఎ-1, ప-1, ఎ-1, తె-12, ఎ-1, తె-1. **30వ వరుస:** తె-8, కా-3, తె-8, కా-2, ఎ-3, నీ-1, ఎ-1, ప-1, ఎ-1, ప-1, నీ-1, ప-1, ఎ-1, ప-1, తె-12, ఎ-1, తె-1. **31వ వరుస :** తె-10, కా-3, తె-6, కా-2, ఎ-1, తె-2, నీ-2, ఎ-1, ప-1, ఎ-1, ప-1, ఎ-1, నీ-1, ఎ-1, ష-1, తె-3, నీ-5, తె-4, ఎ-1, తె-1. **32వ వరుస:** తె-2, ము. ఆ-1, తె-3, ము. ఆ-3, తె-3, కా-3, తె-5, కా-2, తె-1, ఎ-2, నీ-2, ప-1, ఎ-1, ప-1, ఎ-1, ప-1, ఎ-1, నీ-2, తె-2, నీ-7, తె-1, ఎ-1, తె-1, ఎ-1, తె-1. **33వ వరుస :** తె-3, ము. ఆ-2, తె-1, ము. ఆ-1, గు-3, ము. ఆ-1, తె-2, కా-3, తె-4, కా-3, ఎ-3 నీ-4, ఎ-1, ప-1, ఎ-1, ప-1, నీ-8, ఎ-1, నీ-2, ఎ-2, తె 1, ఎ-1, తె 1, **34 వ వరుస:** తె-2, ము. ఆ 1, గు 6, ము. ఆ. 2, తె-2, కా 3, తె-2, కా-4, ఎ-1, తె-3, నీ-4, ఎ-1, నీ-1, ఎ-1, నీ-5, తె-1, నీ-4, తె-1, ఎ-1, తె-1, ఎ-1, తె-1.

# ముఖ్యద్వారానికి అందమైన అలంకారం

**35 వ వరుస :** తె-1, ము. ఆ-1, గు-5, ము. ఆ-1, తె-1, కా-5, తె-1, కా-4, తె-5, నీ-12, తె-2, ఎ-2, నీ-1, తె-4, ఎ-1, తె-1; **36 వ వరుస :** తె-2, ము. ఆ-1, గు-4, ము. ఆ-1, తె-1, కా-5, తె-1, కా-3, తె-7, నీ-10, తె-3, ఎ-2, నీ-1, తె-4, ఎ-1, తె-1; **37 వ వరుస :** తె-2, ము. ఆ-4, తె-3, కా-8, కా-8, నీ-8, తె-4, ఎ-1, తె-6, ఎ-1, తె-1; **38 వ వరుస :** తె-8, కా-6, తె-11; నీ-5, తె-13, ఎ-1, తె-1; **39 వ వరుస :** తె-8, కా-6, తె-23, ము. ఆ-1, తె-4, ఎ-1, తె-1; **40 వ వరుస :** తె-9, కా-5, తె-12, ము. ఆ-3, తె-8, ము. ఆ-1, గు-1, ము. ఆ-1, తె-3, ఎ-1, తె-1; **41 వ వరుస :** తె-10, కా-4, తె-12, ము. ఆ-3, తె-2, ము. ఆ-1, తె-5, ము. ఆ-2, గు-1, ము. ఆ-2, తె-2, ఎ-1, తె-1; **42 వ వరుస :** తె-10, కా-9, తె-8, ము. ఆ-3, తె-2, ము. ఆ-3, తె-3, ము. ఆ-2, గు-1, ము. ఆ-2, తె-2, ఎ-1, తె-1; **43 వ వరుస :** తె-10, కా-13, తె-5, ము. ఆ-3, తె-2, ము. ఆ-1, ప-1, ము. ఆ-3, తె-1; ము. ఆ-2, గు-1, ము. ఆ-2, తె-2, ఎ-1, తె-1; **44 వ వరుస :** తె-12, కా-14, తె-3, ము. ఆ-3, తె-2, ము. ఆ-2, ప-1, ము. ఆ-2, తె-1, ము. ఆ-2, గు-1, ము. ఆ-2. తె-2, ఎ-1, తె-1; **45 వ వరుస :** తె-8, కా-10. తె-4, కా-8, ము. ఆ-1, తె-4, ము. ఆ-2, ప-1, ము. ఆ-1, తె-2, ము. ఆ-1, గు-1, ము. ఆ-1, తె-3, ఎ-1, తె-1; **46 వ వరుస :** తె-7, కా-13, తె-5, కా-5, తె-7, ము. ఆ-3, తె-3, ము. ఆ-1, తె-4, ఎ-1, తె-1; **47 వ వరుస :** తె-6, కా-9, తె-3, కా-3, తె-7, కా-4, తె-7, కా-1, తె-3, కా-1, తె-4, ఎ-1, తె-1; **48 వ వరుస:** తె-2, కా-10, తె-6, కా-2, తె-9, కా-3, తె-7, కా-1, తె-1, కా-2, తె-4, ఎ-1, తె-1; **49 వ వరుస :** తె-2. కా-8, తె-7, కా-2, తె-10, కా-3, తె-7, కా-3, తె-4, ఎ-1, తె-1; **50 వ వరుస:** తె-2, కా-5, తె-9, ము. ఆ-1, కా-2, తె-10, కా-3, తె-6, కా-2, తె-5, ఎ-1, తె-1; **51 వ వరుస :** తె-2, కా-2, తె-9, ము. ఆ-3, తె-1, కా-2, తె-9, కా-1, తె-1, కా-2, తె-4, కా-2, తె-5, ఎ-1, తె-1; **52 వ వరుస :** తె-11. ము.ఆ-2, గు-1, ము.ఆ-1, తె-1, కా-1, ము.ఆ-5, తె-5, కా-1, తె-2, కా-6, తె-7, ఎ-1, తె-1; **53 వ వరుస :** తె-9, ము. ఆ-2, గు-1, ము. ఆ-1, తె-2. కా-1, ము. ఆ-1, ప-1, ము. ఆ-4, తె-4, కా-1, తె-2, కా-3, తె-2, కా-2, ము. ఆ-2, తె-4, ఎ-1, తె-1; **54 వ వరుస :** తె-8, ము. ఆ-1, గు-1, ము. ఆ-2, తె-3, ము. ఆ-2, ప-3, ము. ఆ-2, తె-3, కా-1, తె-2, కా-1, తె-1, కా-2, తె-2, ము. ఆ-1, గు-1, ము. ఆ-2, తె-3, ఎ-1, తె-1; **55 వ వరుస :** తె-7, ము. ఆ-1, గు-1, ము. ఆ-1, తె-5, ము. ఆ-4, ప-1, ము. ఆ-2, తె-1, కా-2, తె-2, కా-1, తె-2; కా-2, తె 1, ము. ఆ-1, గు-1, ము. ఆ 2, ప 3, ఎ-1, తె-1; **56 వ వరుస :** తె 6, ము. ఆ 2, తె-7, ము. ఆ-5, తె 2, కా-2, తె 2, కా-1, తె 3, కా 1, తె 1, ము. ఆ 2, గు-1, ము. ఆ-1, తె-3, ఎ-1, తె-1, **57 వ వరుస :** తె-6, ము. ఆ 1, తె-13, కా-2, తె 3, కా-1, తె-3, కా-1, తె 2, ము. ఆ-1, గు-1, ము. ఆ-1, తె-3, ఎ 1, తె-1; **58 వ వరుస :** తె 18, కా-2, తె-4, కా-1, తె 4, కా-1, తె 2, ము. ఆ-3, తె-2, ఎ 1, తె 1; **59 వ వరుస :** తె 16. కా-2, తె 1, కా 1, తె 4, ము. ఆ 1, తె 3, కా-1, తె 7, ఎ 1, తె 1; **60 వ వరుస :** తె 10, ము.ఆ 5, కా-2, తె 2, ము. ఆ-2, తె 2, ము. ఆ-3, తె 2, ము. ఆ 4, తె 5, ఎ 1, తె-1; **61 వ వరుస :** తె 8, ము. ఆ 2, తె-2, ము. ఆ-2, తె 3, ము. ఆ 1, ప 1, ము. ఆ 1, తె 1, ము. ఆ 1, ప 1, ము. ఆ-2, తె 1, ము. ఆ-2, ప-1, ము. ఆ 2, తె 3, ఎ 1, తె-1; **62 వ వరుస :** తె 8, ము. ఆ-1, ప 1, ము. ఆ-3, తె 4, ము. ఆ-1, ప-1, ము. ఆ-1, తె-1, ము. ఆ-2, ప-1, ము. ఆ-1, తె-1, ము. ఆ 2, ప 1, ము. ఆ 2, తె 3, ఎ-1, తె 1; **63 వ వరుస :** తె-3, చి. ఆ-2, తె-1, ము. ఆ-5, తె-5, ము. ఆ-1, ప-1, ము. ఆ-1, తె-1, ము. ఆ-2, ప-1, ము. ఆ-1, తె-2, ము. ఆ-2, ప-1, ము. ఆ-1, తె-4, ఎ-1, తె-1. **64 వ వరుస:** తె-5, చి. ఆ-4, తె-10, ము. ఆ-3, తె-2, ము. ఆ-4, తె-2, ము. ఆ-3, తె-3, ఎ-1, తె-1. **65 వ వరుస :** తె-5, చి. ఆ-14, తె-15, ఎ-1, తె-1. **66 వ వరుస :** తె-6, చి. ఆ-7, ము. ఆ-9, తె-12, ఎ-1, తె-1. **67 వ వరుస :** తె-7, చి. ఆ-7, ము. ఆ-9, తె-11, ఎ-1, తె-1. **68 వ వరుస :** తె-8, చి. ఆ-6, ము. ఆ-9, చి. ఆ-1, తె-10, ఎ-1, తె-1. **69 వ వరుస :** తె-9, చి. ఆ-7, ము. ఆ-7, చి. ఆ-2, తె-4, ఎ-1, తె-4, ఎ-1, తె-1. **70 వ వరుస :** తె-10, చి. ఆ-7, ము. ఆ-6, చి. ఆ-3, తె-3, ఎ-2, తె-3, ఎ-1, తె-1. **71 వ వరుస :** తె-2, గు-3, తె-6, చి. ఆ-7, ము. ఆ-4, చి. ఆ-5, తె-2, ఎ-3, తె-2, ఎ-1, తె-1. **72 వ వరుస :** తె-1, గు-5, తె-5, చి ఆ-16, కా-1, చి. ఆ-5, తె-1, ఎ-1, తె-1. **73 వ వరుస :** తె-1, గు-2, నీ-1, గు-2, కా-1, తె-3, ఎ-2, చి. ఆ-15, కా-1, చి. ఆ-5, తె-1, ఎ-1, తె-1. **74 వ వరుస :** తె-1, గు-5, కా-2, తె-1, ఎ-2, తె-2, చి. ఆ-14, కా-1, చి. ఆ-2, ఎ-1, చి. ఆ-2, తె-1, ఎ-1, తె-1. **75 వ వరుస :** తె-2, గు-3, తె-2, కా-2, ఎ-1, తె-2, ఎ-2, చి. ఆ-13, కా-1, చి. ఆ-5, తె-1, ఎ-1, తె-1. **76 వ వరుస :** తె-3, కా-2, తె-1, ఎ-3, తె-2, చి. ఆ-11, కా-1, చి. ఆ-4, తె-2, ఎ-1, తె-1. **77 వ వరుస:** తె-9, కా-2, ఎ-2, తె-4, చి. ఆ-10, కా-1, చి. ఆ-3, తె-3, ఎ-1, తె-1. **78 వ వరుస :** తె-10, కా-2, తె-7, చి. ఆ-6, తె-9, ఎ-1, తె-1. **79 వ వరుస :** తె-11, కా-1, తె-7, చి. ఆ-4, తె-10, ఎ-1, తె-1. **80 వ వరుస :** తె-12, కా-2, తె-13, ము. ఆ-4, తె-3, ఎ-1, తె-1. **81 వ వరుస :** తె-13, కా-2, తె-3, ము. ఆ-5, తె-3, ము. ఆ-4, తె-5, ఎ-1, తె-1. **82 వ వరుస :** తె-1, ఎ-2, తె-3, ఎ-3, తె-3, ఎ-1, తె-1, కా-2, తె-3, ము. ఆ-4, తె-2, ము. ఆ-4, తె-5, ఎ-1, తె-1. **83 వ వరుస :** తె-1, ఎ-2, తె-2, ఎ-1, నీ-3, ఎ-1, తె-1, ఎ-2, తె-1, కా-1, తె-6, ము. ఆ-1, తె-3, ము. ఆ-1, తె-3, ప-3, తె-2, ఎ-1, తె-1. **84 వ వరుస :** తె-1, ఎ-4, నీ-4, ఎ-4, తె-7, ము. ఆ-1, తె-3, ము. ఆ-1, తె-3, ప-5, తె-1, ఎ-1, తె-1. **85 వ వరుస :** తె-1, ఎ-2, నీ-7, ఎ-3, ము. ఆ-14, ప-2, ఎ-1, ప-2, తె-1, ఎ 1, తె 1. **86 వ వరుస :** తె 1, ఎ-4, నీ 4, ఎ-4, తె-7, ము. ఆ-1, తె-3, ము. ఆ-1, తె-3, ప-5, తె 1, ఎ 1, తె-1. **87 వ వరుస :** తె 1, ఎ-2, తె 2, ఎ-1, నీ-3, ఎ 1, తె 1, ఎ-2, తె-1, కా-1, తె-6, ము. ఆ-1, తె-3, ము. ఆ-1, తె 3, ప-3, తె-2, ఎ-1, తె-1. **88 వ వరుస :** తె 1, ఎ-2, తె-3, ఎ 3, తె-3, ఎ 1, తె-1, కా-2, తె-3, ము. ఆ-4, తె-2, ము. ఆ-4, తె-5, ఎ-1, తె-1. **89 వ వరుస :** తె-13, కా-2, తె-3, ము. ఆ-5, తె-3, ము. ఆ-4, తె-4, ఎ-1, తె-1. **90 వ వరుస:** తె-12, కా-2. తె-13, ము. ఆ-4, తె-3, ఎ-1, తె-1.

—ఆర్. రామలక్ష్మి

# "సీత!"

## కాకాని కమల

సూర్యుడు నడినెత్తి మీద కొడుతున్నాడు.

నిప్పులుచెరిగే ఎండలో దాదాపు ఫర్లాంగు దూరం నడిచి వచ్చింది సీత. చెప్పులు లేని పాదాలు మంట పెడుతున్నాయి. నుదురంతా చిరుచెమటలు క్రమ్ముకుని వచ్చాయి.

సందు మలుపు తిరిగి రెండంతస్థుల ఆకుపచ్చ బిల్డింగు ముందు ఆగి దీర్ఘంగా వూపిరి తీసుకుంది సీత.

"హమ్మయ్య...." అనుకుంటూ చీరచెంగుతో నుదురు అద్దుకుంది.

తేలికపడ్డ మనస్సుతో గేటు తెరిచి లోపలికి వెళ్లబోయిన సీత ఒక్క క్షణం ఆగి చేతిలో నలుగుతున్న కాగితం మడత విప్పి అడ్రస్ సరిగా వుందో పరిశీలనగా చూసుకుంది. ఇంటి నెంబరు, పచ్చ బిల్డింగు, పేరు....అన్ని సరిగ్గానే వున్నాయి.



అర్ధగంట ఎండలో నడిచి వస్తే చివరికి గమ్యం చేరుకోగలిగింది.

స్థిమితంగా వూపిరి పీల్చుకుని గేటు తెరిచి లోపలికి అడుగుపెట్టింది. రెండంతస్థుల పచ్చ బిల్డింగు.... ఇంటి ముందు అందమైన పూలతోట.

గుమ్మంలో నిల్చుని నెమ్మదిగా కాలింగ్ బెల్ నొక్కింది.

మరునిమిషం తలుపు తెరుచుకుంది.

పనిపిల్ల కాబోలు....పది సంవత్సరాలు వుంటాయి. వచ్చి తలుపు తీసింది.

"ఏం కావాలి?" అంది నిలువునా చూస్తూ.

"చూడు....మీ అమ్మగారు వున్నారా?"

"వున్నారు...."

"నా పేరు సీత. వచ్చానని వెళ్లి ఆవిడతో చెప్పు"

"అమ్మగారు మంచం మీంచి లేవలేరు...."

సీత ప్రసన్నంగా చూసింది.

"నాకు తెలుసు. నేను వచ్చానని వెళ్లి చెప్పు. ఆవిడ అనుమతిస్తే లోపలికి వస్తాను...." అంది.

పనిపిల్ల లోపలికి వెళ్లింది.

సీత ఇంటిని పరిశీలనగా చూస్తూ వుండిపోయింది.

ఖరీదయిన ఫర్నిచరుతో ఆధునికంగా అందంగా అడుగు అడుగునా ఐశ్వర్యం తొణికిసలాడుతూ వుంది ఇల్లు!

రెండు నిమిషాలు గడిచాయి.

పనిపిల్ల వచ్చింది.

"అమ్మగారు లోపలికి రమ్మన్నారు.." అంది.

సీతకి సంతోషంతో మొఖం విప్పారింది.

విశాలమైన హాలు, రెండు గదులు-దాటి లోపలికి వచ్చింది.

జానకీదేవి మంచం మీద విశ్రాంతిగా పడుకుని వుంది. ఖరీదయిన చీర, ఒంటిమీద విలువయిన ఆభరణాలు. పెద్ద బిజినెస్ మాగ్నట్ భార్య అని చెప్పకనే తెలుస్తూంది.

గది చల్లగా ప్రశాంతంగా వుంది.

సీత రెండు చేతులూ జోడించి నమస్కారం చేసింది.

"నా పేరు సీతండి! మీకు 'గవర్నెస్' కావాలని తెలిసి మీ ఇంట్లో పని కోసం వచ్చాను...."




1. స్త్రీలలో మొట్టమొదట నోబెల్ బహుమతి ఎవరికి, ఎప్పుడు లభించింది ?

2. ఈ సంవత్సరం నోబెల్ శాంతి బహుమతి మదర్ తెరెసాకి లభించినట్టు మీకు తెలుసు. గత సంవత్సరం ఈ 'శాంతి బహుమతి' ఎవరికి లభించిందో చెప్పగలరా ?

3. భారత దేశపు స్త్రీల క్రికెట్ జట్టుకి కెప్టెన్‌గా వున్న ఒక వనితని 'వనిత' ముఖచిత్రంపై మీరు చూశారు. ఆమె ఎవరు ?

4. ఇంతవరకు నలుగురు స్త్రీలు వివిధ దేశాలకు ప్రధాన మంత్రులుగా వున్నారన్నది మీకు తెలుసు. వారిలో ఇద్దరు పొరుగు దేశాలతో యుద్ధాలను కూడా ఎదుర్కొన్నారు. ఒకరు ఇందిరా గాంధి అయితే మరొకరెవరు ?

5. ప్రపంచ టెన్నిస్ పోటీలలో అత్యధికమైన ఛాంపియన్‌షిప్‌లు గెల్చుకున్న వనిత బిల్లీ జీన్ కింగ్ అని మీకందరికీ తెలుసు. మరి పిన్నవయసులోనే వింబుల్డన్ ఛాంపియన్‌షిప్ పొందిన వనిత ఎవరో చెప్పగలరా ?

6. అత్యధిక సంఖ్యలో. పాటలు పాడినందుకు, గ్రామఫోను రికార్డుల అమ్మకంలో నూతన రికార్డు సృష్టించినందుకు, సంగీత ప్రపంచానికి చేసిన సేవకు ఇటీవల మన దేశంలో ఒక వ్యక్తికి 'ప్లాటినమ్ డిస్క్' బహూకరించ బడింది. ఆ వ్యక్తి ఎవరు ?

7. అత్యధిక సంఖ్యలో భక్తి శ్లోకాలు (Hymns) రాసిన పాశ్చాత్య వనిత ఎవరు ?

8. ప్రపంచంలోకల్లా అత్యధిక సంఖ్యలో ప్రతులు అమ్ముడుపోయిన నవల ఏది ? ఆ రచయిత్రి పేరేమిటి ?

9. అమెరికాకు చెందిన 'అకాడెమీ ఆఫ్ మోషన్ పిక్చర్స్ ఆర్ట్స్ అండ్ సైన్సెస్' ప్రతి సంవత్సరం చలన చిత్రాలలోని ఉత్తమ నటీనటులకూ యితర శాఖలకూ 'ఆస్కార్' అవార్డు లని యిస్తుంది. నటీనటులలో ఎక్కువ సార్లు ఈ బహుమతిని పొందిన వారెవరు ?

10. 'మాతాహరి' ఎవరు ?

[సమాధానాలు ఈ సంచికలోనే వున్నాయి. వెతికి మీ సమాధానాలతో సరిపోతాయేమో పోల్చి చూసుకోండి]

అంది ఆశగా.

"ఓహో...." గంభీరంగా తల పంకించింది జానకీదేవి.

"ఏం పన్లు వచ్చు ?"

"ఇంటిపని వంటపని అన్నీ చూసుకోగల్ను.... కొద్దిగా చదువుకున్నాను కూడా! తెలుగు-ఇంగ్లీషు పుస్తకాలు చదివి వినిపించగల్ను...."

"జీతం ఎంతకావాలి ?"

"రెండుపూటలా భోజనం పెట్టి వసతి కల్పిస్తారని, నెలకి కొద్దిగా జీతం కూడా ఇస్తారని జగన్నాథం గారు చెప్పారు. మీరు బెడ్ పేషంటని పగలు రాత్రి మిమ్మల్ని చూసుకోవాలని కూడా తెల్సింది. మూడురోజుల క్రితం మీవారు స్వయంగా ఈ అడ్రస్ వ్రాసి ఇచ్చారు....చాలా దూరం నుంచి ఆశతో వచ్చాను...." రాజారావు చేతివ్రాతతో వున్న కాగితం చూపిస్తూ నమ్రతగా అంది సీత.

జానకి కనుబొమ్మలు ముడుచుకున్నాయ్.

"మావారా? ఆయన నీ కెలా తెల్సు ?"

"రిటైర్డ్ తాహసిల్‌దార్ జగన్నాథంగారి కుటుంబంతో నాకు కొద్దిగా పరిచయం వుంది. ఆయన నాకు ఎక్కడైనా పని వుంటే చూపించగలరేమోనని వాళ్ల ఇంటికి వెళ్లాను. ఆ సమయంలో రాజారావుగారు అక్కడే వున్నారు. జగన్నాథంగారు నా గురించి చెప్పారు. మీ ఆరోగ్యం బాగుండలేదని, వంటపని ఇంటిపని చూసుకుందుకు మనిషి కోసం వెతుకుతున్నట్లుగా ఆయన చెప్పారు. ఈ అడ్రస్ ఇచ్చి మిమ్మల్ని కల్సుకుని మిగతా విషయాలు అన్నీ మాట్లాడుకోమన్నారు...."

"అంతేనా !"

"అంతేనండి."

జానకీదేవి కళ్లల్లో అనుమానం లీలగా కదిలింది. దిండు మీద అలవోకగా ఒరిగి కళ్లెత్తి సీత కేసి పరిశీలనగా చూసింది.

తెల్లటి శరీరం. పోషణ లేక చిక్కినా అందంగా కనుపించే ముఖం. ఇరవైకి పాతిక్కీ మధ్య వయసు. తీర్చిదిద్ది అలంకారం చెయ్యకుండా వుంచిన ప్రతిమలా వుంది సీత.

"హుం....ఎంత డబ్బు హోదా వుండి ఏమి లాభం? ఆ అందం, ఆరోగ్యం తనకి రమ్మన్నా వస్తాయా ?" జానకి మనసు ఈర్ష్యతో మూల్గింది.

పరిశీలనగా నఖశిఖ పర్యంతం చూస్తున్న జానకి కళ్లు సీత మెడని తడిమాయ్! పచ్చటి పసుపుతాడు కనుపించింది.

"ఊం....నీకు పెళ్లి అయిందనుకుంటాను."

"అయ్యిందండి...." సీత కంఠం కొద్దిగా ఒణికింది.

"మీ ఆయనేం చేస్తాడు ?"

సీత దీనంగా తల ఎత్తింది.

"ఆ....ఆయన లేరండి!"

"అంటే?" జానకి కంఠంలో కాస్త తీవ్రత కనిపించింది.

"..........." సీతకి సంశయంతో కంఠం పెగలలేదు.

"..........."

ఇద్దరి మధ్య కొద్దినిమిషాలు నిశ్శబ్దంగా దొర్లాయ్. జానకి విసుగ్గా అంది :

"చూడు అమ్మాయ్! నీకు పని ఇచ్చేముందు నీ మంచి చెడ్డ తెల్సుకోవటం నాకు ముఖ్యం. అనవసరంగా నసగక వున్నది వున్నట్లు నిజం

చెప్పు. అబద్దాలు చెప్పేవాళ్లంటే నాకు అసహ్యం! ఇంతకీ అతను ఎక్కడ వున్నాడు?''

"తెలియదండి"

"ఊఁ....అంటే....ఒదిలేశావా?"

సీత కంగారుగా తల ఎత్తింది.

"లేదండి. ఆయనే నన్ను ఒదిలేశారు...."

"ప్చ్....ప్చ్....ఏం పాపం?" జానకి కంఠంలో కించిత్ వ్యంగ్యం కదిలింది.

సీత నెమ్మదిగా అంది:

"రెండుసంవత్సరాల క్రితం మేము ఇద్దరం పెద్దల అనుమతి లేకుండా ఇంట్లోంచి వచ్చేసి గుళ్లో పెళ్లిచేసుకున్నామండి! ఒక ఏడాదిపాటు నా జీవితం ఆనందంగానే గడిచింది. ఆ తరువాత...ఆయన....న....న్ను..నన్ను ఒదిలి వాళ్ల ఇంటికి వెళ్లిపొయ్యారు. వాళ్ల తల్లి తండ్రి ఆయనకి మళ్లీ పెళ్లిచేశారని తెల్సింది. నాకు ఈ జీవితం మిగిలింది...."

ఆ మాటతో జానకి వదనం కమిలిన పండు లాగ అయ్యింది.

మళ్లి ఇద్దరి మధ్య కొద్దిక్షణాలు నిశ్శబ్దం.

"ఊఁ....ఇప్పుడు ఎక్కడ వుంటున్నావ్?"

"రత్నమ్మ అని కూరగాయలు అమ్ముతుంది. ప్రస్తుతం ఆమె ఇంట్లోనే వుంటున్నాను...."

"ఓ!...." దీర్ఘం తీసింది జానకిదేవి.

"..........."

"..........."

నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ అంది సీత—

"పనిలోకి ఎప్పుడు రమ్మంటారండి?"

"అవసరంలేదు." జానకి సూటిగా చెప్పేసింది.

సీతకి నెత్తి మీద పిడుగు పడినట్లు అయ్యింది.

"అమ్మగారూ....దయచేసి...."

"ఇక్కడ దయ కంటె నా సంసారం ముఖ్యం. నీ లాంటి దానికి పని ఇచ్చి ఇంట్లో పెట్టుకుంటే తలకి కొరివి పెట్టుకున్నట్లే...."

నిష్కర్షగ వున్న ఆ మాటలకి సీత మొఖం వెలా తెలా బోయింది. సీతకి అట్లాంటి అవమానం కొత్త కాదు. అయినా ఎప్పటికప్పుడు బాధని దిగ మింగుకుంటోంది. ఇందరి ముందు తల దించుకుని జీవితం గడపాలి అనుకుంటే ఆవేశం వస్తుంది. కాని....తప్పదు! తనని చూసిన ఎవ్వరూ పని ఇవ్వటంలేదు. ఎందుకు?

ఎలాగో అవమానాన్ని దిగమింగి గొంతుక పెగల్చుకున్నట్లుగ అంది సీత ..."నేను ...నేను.... అలాంటిదాన్ని కాదండి"

వ్యంగ్యంగా నవ్వింది జానకి.

"అలాంటిదానివి కాకపోతే....ఈ రోజు ఇలాంటి పరిస్థితిలో వుండవు."

సీత వ్యధగా అంది—

"నిజమేనండి! కాని ఒకసారి తెలియక చేసిన తప్పుకి ఇప్పుడు ఎంతో శిక్ష అనుభవిస్తున్నాను. ఇంక తెలిసి తెలిసి మళ్లీ అలాంటి తప్పుచేస్తానా చెప్పండి? నా భర్త నన్ను ఒదిలేసిన తరువాత మెడలోంచి ఈ పసుపుతాడు తీసెయ్యాలి అనుకున్నాను. కాని తీసేస్తే నాకు పెళ్లికాలేదని, వయసులో వున్నానని సందేహించి పని ఇచ్చేవారు కాదు. అలాగని ఈ తాడు మెడలో అలంకరించుకుంటే భర్త ఒదిలేసిన ఆడదాన్నని ఎంతకయినా తెగిస్తానని అనేవారు. తెలిసో తెలియకో ఒకసారి చేసిన తప్పుకి జీవితాంతం శిక్ష పడింది. కనీసం ఇప్పటికయినా నా తప్పుని సరిదిద్దుకునే అవకాశం

## కుందేళ్ల ముగ్గు

ముందుగా 17 చుక్కల చొప్పున 7 వరుసలు పెట్టాలి. తర్వాత ఇరువైపులా ఒక్కొక్క చుక్క చొప్పున తగ్గిస్తూ 7 చుక్కలు వచ్చేదాకా చుక్కలు పెట్టుకోవాలి. చిత్రంలో చూపినట్లుగా కలుపుకుంటూ పోతే దరహాసం చేస్తున్న కుందేళ్ళు ముగ్గుతోపాటు కనిపిస్తాయి.

—చింతలచెరువు నాగలక్ష్మి





మీలాంటి సహృదయులు కల్పిస్తే ఇకనైనా సక్రమంగా జీవించాలని ఆశపడుతున్నాను. నిజానికి నేను ఇంతవరకు నీతి తప్పలేదండి. నాలుగు నెల్ల నుంచి ఏ పని దొరక్క నా పొట్ట నేను నింపుకోలేక చాలా బాధపడుతున్నాను. మీలాంటి వారు పని ఇవ్వకపోతే నేను నిజంగానే అవినీతికి పాల్పడాల్సిన దుస్థితి ఏర్పడుతుంది. నేను నిజం చెప్పినందుకా నాకీ శిక్ష ? నాలో మీకు అవినీతి ఏం కనుపించింది చెప్పండి ? నా మీద మీకు ఎందుకు నమ్మకం కలగటం లేదు ? దయచేసి చెప్పండి....'' రుద్ధమైన కంఠంతో దీనంగా అడిగింది సీత. ఆమె కళ్లనుంచి చుక్కలు చుక్కలుగా కన్నీళ్లు జారుతున్నాయి.

జానకి స్థిమితంగా అంది.

''చూడమ్మాయ్ ! నీ జీవితం మంచి చెడ్డ నువ్వు ఆలోచించుకుంటున్నావ్. నా సంసారం బాగోగులు నేను చూసుకుంటున్నాను. నేనా రోగిష్టిదాన్ని. నాకా పిల్లలు ! నమ్మకంలేంది నీ మీద కాదు. మా ఆయన మీద ! తెల్సిందా ? అదీ సంగతి....'' అంది విరుపుగా.

సీతకి తలకొట్టేసినట్లు అయ్యింది. చాలాసేపు నిశ్శబ్దంగా అలాగే వుండిపోయింది.

ఇంతలో గడప దగ్గర బూట్ల శబ్దం అయ్యింది.

అప్పుడే బయటినుంచి వచ్చిన రాజారావు హడావుడిగా లోపలికి రాబోయి సీతని చూసి గడప దగ్గరే ఆగిపొయ్యాడు. అతని వదనం సంతోషంతో విరిసింది.

''చూడు జానీ ! నేను చెప్పటం మరిచాను. నువ్వు మనిషి కోసం చూస్తున్నావుగా ! ఈ అమ్మాయిని జగన్నాథంగారు రికమెండ్ చేశారు. చూడు సీతా ! మా ఆవిడ చాలా ఇబ్బంది పడుతోంది. పనిలోకి ఎప్పట్నుంచి వస్తున్నావ్ ?....'' అన్నాడు అభిమానంగా.

జానకి భర్త కేసి చురచురా చూసింది.

''అవసరంలేదు ..'' అంది ఖరాకండిగా.

రాజారావ్ ఆశ్చర్యపొయ్యాడు.

''అదేం ?'' విస్మయంతో అడిగాడు.

''ఈ మనిషి మీ కోసమా ? నా కోసమా ?''

ఛెళ్లున కొరడా ఝళిపించినట్లు అయ్యింది.

ఆ విసురుకి రాజారావు నిర్ఘాంతపడిపొయాడు. కత్తివేటుకి నెత్తురుచుక్క రాలనంతగా మొఖం తెల్లగా పాలిపోయింది.

జగన్నాథంగారు సీత గురించి చెప్పినప్పుడు విచారించాడు. మంచి కుటుంబంలోంచి వచ్చిన పిల్ల అయివుండి సీత జీవితం చివరికి ఇలాగ అయ్యింది కదా అని ఎంతో బాధపడ్డాడు. తమకి మనిషి అవసరం వుంది. అందుచే సహృదయంతో ఆమెకి సహాయం చెయ్యాలని ఆశించాడు. కాని....

'స్త్రీకి స్త్రీ నుంచి సరిఅయిన సానుభూతి దొరికితే అది ఔదార్యం. అదే ఔదార్యం పురుషుడి నుంచి లభిస్తే అది అవినీతి కింద చూస్తారు జనం ! ఒంటరి స్త్రీకి సమాజంలో సరిఅయిన స్థానం లేదు. రక్షణ లేదు. స్త్రీని స్త్రీయే సరిగా అవగాహన చేసుకోలేదు. పతనం అయిన స్త్రీని అవహేళన చెయ్యటం, చిన్నచూపు చూడడం ఎంత అవివేకం ?....'

నెమ్మదిగా 'షాక్' నుంచి తేరుకుని తల ఎత్తాడు రాజారావు.

కాని అప్పటికే సీత అక్కడ లేదు ! □

# వంటలు



## సాబూదాన్ కిచిడీ

**కావలసిన పదార్థాలు: సగ్గుబియ్యం – $\frac{1}{4}$ కిలో, వేరుశనగపప్పు. పచ్చిమిరపకాయలు, నూనె, పోపు సామాను తగినంత.**

తయారుచేయు విధానం: ఇది తయారు చేసుకునేందుకు నాలుగుగంటల ముందుగా సగ్గుబియ్యం నీళ్ళల్లో నానబెట్టాలి. పచ్చిమిరపకాయలు నూరి వుంచుకోవాలి. వేరుశనగపప్పు దంచి విడిగా వుంచాలి. బాణలిలో నెయ్యిగానీ, నూనెగానీ వేసి అందులో పోపుసామగ్రి వేసి అది వేగాక నూరి వుంచుకున్న పచ్చిమిరపకాయల ముద్ద వేసి, సగ్గుబియ్యం దానికి చేర్చాలి. ఆ తరువాత బాణలిలో ఉప్పు వేసి కలియదిప్పాలి. ఇది వేగాక వేరుశనగ పొడి వేసి బాగా కలిపి స్టవ్ మీద నుంచి దింపాలి. వేడివేడిగా తింటే ఈ సాబూదాన్ కిచిడీ రుచిగా వుంటుంది. మహారాష్ట్ర ప్రాంతంలోనివారు ఉపవాస దినాలలో ఈ వంటకం చేసుకుంటూ వుంటారు.

—జి. విజయలత

## రెండురకాల "గొజ్జులు"

కర్ణాటక ప్రాంతీయులు "గొజ్జు" అని చేసుకుంటారు. వాటిలో రెండు రకాలు వివరిస్తాను.

మొదటి రకం:

ఈ 'గొజ్జు' కాకరకాయలతోనైనా, బెండకాయలతోనైనా తయారు చేసుకోవచ్చు. మొదట కాయలను శుభ్రంగా కడిగి, ముక్కలుగా తరిగి, ఉడికించి ఉంచుకోవాలి.

కావలసిన పదార్థాలు: చింతపండు గజ నిమ్మకాయంత, నువ్వులు అరపావు, ఎండుమిరపకాయలు ఏడు లేక ఎనిమిది (కావలసినవారు ఎక్కువ వేసుకోవచ్చు) బెల్లం నాలుగు ఉండలు, ధనియాలు ఒక టీ స్పూను, మెంతులు ఒక చిన్న స్పూను, కొబ్బెర ఒక పెద్ద ముక్క; ఉప్పు తగినంత.

తయారు చేసే విధానం: మిరపకాయలు, నువ్వులు, ధనియాలు, మెంతులు వేయించి, దంచి పొడి చేసుకోవాలి. వాటితోపాటు, కొబ్బెర, బెల్లం కూడా దంచుకోవాలి. చింతపండు పులుసు తయారు చేసి అందులో ఈ పొడిని కలిపి, ఉప్పు కూడా వేయాలి. పొయ్యి మీద పెట్టాలి. కొంచెం మరిగాక, ముక్కలు వేయాలి. బాగా మరిగాక దించి పోపు వేయాలి.

రెండోరకం:

ఇందులో 'నువ్వులు, కొబ్బెర'కు బదులు, "వేరుసెనగపప్పు" వేయించి, ధనియాలు, మెంతులు, మిరపకాయలు, బెల్లంతోపాటు దంచి పులుసులో కలపాలి. కొంచెం మరిగాక కూర ముక్కలు వేసి మరిగించి దించి పోపు వేయాలి. ఇది ఇంకోరకంగా కూడా చేయొచ్చు. ముక్కలు లేకుండా చేసుకోవచ్చు. పులుసుని ఉప్పువేసి బాగా మరిగించి, దించేసి పై వేరుసెనగపప్పు పొడిని (మిశ్రమం) కలపాలి. తిరగమోత వేయాలి. (వేరుసెనగపప్పు అరపావు ఉండాలి)

## హసిమజ్జిగె లేక రాయిత

ఇది తీయగుమ్మడికాయముక్కలతోనూ, లేక సీమ వంకాయముక్కలతోను, చేసుకోవచ్చు. ముక్కలు లేకుండ ఉత్తది కూడా చేయవచ్చు. మొదట ముక్కలను బాగా ఉడికించి ఉంచుకోవాలి.

కావలసిన పదార్థాలు: పెరుగు పావు, ఆవాలు 2 టీ స్పూన్లు, కొత్తిమీర ఒక కట్ట, పచ్చికొబ్బెర ఒక చిప్ప, పచ్చిమిరపకాయలు నాలుగు లేక ఐదు, ఉప్పు తగినంత.

ముందుగా ఆవాలు బాగా దంచాలి. అది పొడిగా అయ్యాక, అందులో, కొత్తిమీర, పచ్చికొబ్బెర, మిరపకాయలు, ఉప్పు వేసి బాగా దంచి, ఆ ముద్దను పెరుగులో కలపాలి. తరువాత ఉడికించిన ముక్కలను కలిపి, పోపు వేయాలి.

—యం. ఉషారాణి

## శనగపప్పు–మటన్ కలిపి కుర్మా

కావలసిన వస్తువులు: మటన్ $\frac{1}{4}$ కేజీ; శనగపప్పు 250 గ్రా. ఉల్లిపాయలు 2 పెద్దవి అల్లం చిన్నముక్క; వెల్లుల్లి వలచినవి 10 రేకులు; గసగసాలు 1 టేబుల్ స్పూను; లవంగాలు 6; యాలకులు 4; దాల్చినిచెక్క చిన్నముక్కలు 2; కారం $1\frac{1}{2}$ టేబుల్ స్పూనులు; పసుపు 1 టేబుల్ స్పూను; నూనె 6 టేబుల్ స్పూనులు; మసాలా ఆకులు 4; గరం మసాలా పొడి 1 టీస్పూను; నెయ్యి 1 టీస్పూను; కొత్తిమీర సన్నగా తరిగినది 1 కట్ట; ఉప్పు తగినంత; పచ్చి మిర్చీలు 4

తయారు చేసే విధానం: మటన్ శుభ్రపరచి ముక్కలుకోసి ఉంచుకోవాలి. శనగపప్పు శుభ్రపరచి మెత్తగా ఉడికించి ముద్దగా చేసి ఉంచుకోవాలి ధనియాలు, లవంగాలు, యాలకులు, దాల్చిని, గసగసాలు, పచ్చిమిర్చీలు కలిపి మెత్తగా ముద్దగా చేయాలి. అల్లం, వుల్లిపాయలతరుగు, వెల్లుల్లి కలిపి మెత్తగా ముద్దగా నూరుకోవాలి. స్టవ్ మీద గిన్నెలో నూనె మరిగించి అందులో మసాలా ఆకులు వేసి వేపాలి. తరువాత మటన్, మసాలా ముద్ద, అల్లం, వెల్లుల్లి, ఉల్లి కలిపిన ముద్ద వేసి కమ్మనివాసన వచ్చేవరకు వేపాలి. తరువాత కారం, పసుపు, ఉప్పువేసి కాసేపు వేపి తగినంత నీరు పోయాలి. మాంసం ఉడికి మెత్తపడ్డాక పప్పువేసి గ్లాసున్నర నీరుపోసి ఉడకనివ్వాలి. ముద్దగా గాక కాస్త పలుచగా ఉన్నప్పుడు మసాలాపొడి వేసి కలపాలి. దించేముందు నెయ్యి, కొత్తిమిర వేసి దించాలి. ఉప్పు, కారం ఎవరి ఇష్టాన్నిబట్టి వేసుకోవచ్చును. ఈ కుర్మా రొట్టెలలోకి కూడా చాలా రుచిగా వుంటుంది.

—ఎన్. అనసూయారావు

## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు-54' చందమామ బిల్డింగ్స్, మద్రాసు - 600 026 చిరునామాకు డిసెంబర్ 29వ తేదీలోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1980 ఫిబ్రవరి సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు - అడ్డము

1. అష్టాక్షరాల ఆనతి
2. చీటికి జతమాట తారుమారైంది.
3. కాస్త...
4. పాతర
5. గులువె
6. కారణం చేత—అన్న మాట
7. నూనె ఇచ్చేది—అలా ఇలా అయింది.
8. మదర్ తెరెసాకు వున్న ప్రథమ గుణం
9. ఎక్కువ
10. ముడి ఊట్టుట !
11. జిహ్వ సహించని రుచి
12. వంటకీ భుజించడానికీ మధ్య తతంగం
13. అయిష్టం; కోపించడం

### ఆధారములు - నిలువు

1. పదిమంది చెప్పుకోడం ద్వారా వినికిడి కావడం.
6. కారణం చెప్పిన తర్వాత చెప్పే మాట
8. కక్షతో వున్న కోపం
11. నాశము
14. స్త్రీ పిశాచం !
15. భూగర్భంలో కలవడం
16. అభినేత్రికి చిన్న మాట !
17. ఆ తర్వాత—
18. "ఈతకొట్టేవాడని కాదీతడు
19. కంటె ఒక—
20. గర్భము
21. అడ్డంలోని 11 లాంటిదే గానీ, ఇది ఎదురు తిరిగింది
22. ఇంపైనది—అన్నమాట.
23. తనక—

# వనిత మాటల కొలువు- 54

## రూ 150లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 14 | 15 | 16 | | ■ | 17 |
| | ■ | 2 | | | ■ | 3 | |
| | ■ | 4 | | ■ | 18 | ■ | |
| 5 | | ■ | ■ | 6 | | 19 | ■ |
| ■ | ■ | 20 | ■ | 7 | | | ■ |
| 8 | 21 | | ■ | 9 | | ■ | 22 |
| 10 | | ■ | 23 | ■ | ■ | 11 | |
| ■ | 12 | | | ■ | 13 | | |

పేరు ..........................................................................

చిరునామా ....................................................................

..................................................................................

..................................................................................




## గిరిజా కల్యాణం

(నవల)

[రచన : యద్దనపూడి సులోచనారాణి; ప్రచురణ: యమ్. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు-1 పేజీలు : 336 ; వెల : రూ. 12]

శిల్పచాతుర్యానికీ, రచనా చమత్కృతికీ, పదును గల సంభాషణలకీ ఏమాత్రం చోటివ్వకపోయినా - ఎక్కడా విసుగు రానివ్వకుండా, కాలక్షేపానికి అడ్డం కలగనివ్వకుండా – పుస్తకం ప్రారంభిస్తే అంతు చూడవలసిందేనన్న ఉత్సాహం కలిగించేలా రాయడంలో య. సు. రాణి ప్రసిద్ధ హస్తురాలు! అందులో సందేహం లేదు. అలాగే, 'గిరిజా కల్యాణం' కూడా నడిపించారు ఆమె. కాకపోతే, ఆమె ఎక్కువ నవలల్లో కనిపించే 'ధనిక నాయకుడు' ఇందులోనూ కనిపిస్తాడు; అందర్నీ ఆకర్షించే ఆ అందగాడు – ఇందులోనూ కనిపిస్తాడు. ఆడపిల్లలతో తిరగడం, స్నేహితులతో విందులూ, విహారాలూ-జల్సాలూ చెయ్యడం వంటి సలక్షణాలు గల 'చెందూ'కి సులక్షణాలు కూడా వున్నాయి. 'పాపం' అనిపించి, అతను చేసిన దానం - అతన్నే కట్టేస్తుంది. బీద పిల్ల గిరిజతో వివాహం జరుగుతుంది. గిరిజను అతను వాంఛించకపోయినా, ఆమెను లక్ష్యపెట్టకపోయినా, ఆమె అతన్ని ఎలా లొంగదీసుకుని తన వేపు తిప్పుకున్నదీ - కథ. కథాగమనంలో ఎన్నో పాత్రలు; సన్నివేశాలు. ఐతే ఇందులో వున్న 'రోజీ ఉదంతం' కధకు పెద్దగా ఉపకరించదు. అది లేకపోతే, కధ మరింత జోరుగా కూడా సాగేదేమో! అలాగే, గిరిజ స్నేహితుడు మధుమూర్తిని అకస్మాత్తుగా చంపేయకుండా వుంటే బాగుండేది. అతను చచ్చిపోవడంవల్ల కధకు జరిగిన 'న్యాయం' ఏమీలేదు. నవల పెద్దగా ఎక్కువ పేజీలలో రాయాలనుకోడంలో మామూలుగా కొన్ని ఇబ్బందులు ఎదురవుతాయి. అందులోని ఒక ఇబ్బంది - ముందు భాగం వున్నంత రక్తిగా రెండో భాగం వుండకపోవడం. ఆ ఇబ్బంది ఈ నవల్లోనూ కొంత వుంది. ఉన్నా కూడా, ఈ పన్నెండు రూపాయల మూడు వందల ముప్పై ఆరు పేజీల పుస్తకం ఉత్సాహంగానే సాగిపోయే చక్కని కాలక్షేపం!

## ఈ జీవిత సంధ్యా సమయంలో

(నవల)

[రచన : పవని నిర్మల ప్రభావతి; ప్రచురణ : ఎమ్. శేషాచలం అండ్ కో. మద్రాసు; వెల : రూ. 3-50; పేజీలు : 160]

పాశ్చాత్య దేశాలలో లాగా మనదేశంలో కూడా వృద్ధ సేవాశ్రమాలు నెలకొల్పబడుతున్నాయి. చాలా మంది అవి కావాలని కోరుకుంటున్నారు కూడా. అయితే ముసలితనంలో తమ ఇంటిని, సంతతిని వదిలి ఈ ఆశ్రమాల్లో ఎందుకు చేరాల్సి వస్తున్నది?

వృద్ధాప్యాన్ని శాపంలాకాక వరంలా మార్చుకుంటే, అలా మార్చుకోగల్గితే, ఇంటిల్లిపాదికి మనశ్శాంతిగా వుంటుంది. నేటి యువతరం, రేపటి పెద్దతరంగా మారుతుంది. ఆ పెద్దతనంలో, తన వాళ్ల దగ్గర నిశ్చింతగా శేష జీవితాన్ని గడపాలని ప్రతిమనిషి కోరుకుంటాడు. ఆ కోరిక తీరాలంటే, రెండు తరాల మధ్య స్పష్టమైన అవగాహన, అభిమానం సర్దుకుపోయేతత్వం వుండాలి. అదీ— ఇతివృత్తం.

ఈ రచయిత్రి ప్రతిభకు చక్కటి నిదర్శనం ఈ నవల. అందరూ తప్పక చదవదగ్గది. అన్ని నవలల్లాగా చదివి వదిలేయకుండా, ప్రతివారూ వృద్ధాప్యంలో జ్ఞాపకం చేసుకోవాల్సిన మంచి పుస్తకం కూడా.

## కర్మభూమి

(నవల)

[రచన : వసుంధర; ప్రచురణ: ఎమ్. శేషాచలం అండ్ కో; మద్రాసు; వెల: రూ. 3-50; పేజీలు : 160]

"యోగికి సంబంధించినంతవరకు ఇది ఒక వ్యాపారం లాంటిది. అతను తన పాత్రను సమర్ధవంతంగా నిర్వహిస్తూనే, తన భావి జీవితం సుఖంగా గడిచి పోవటానికి అవసరమైనంత డబ్బు పోగు చేసుకుని దివ్యాశ్రమాన్ని విడిచి వెడతాడు."

"యోగికి ప్రజలలో పలుకుబడి వుండాలంటే అతనికి కొన్ని మహిమలు తెలియాలి. గాలి లోంచి విభూది, ఫలమో, పుష్పమో, సృష్టించి ఇవ్వటమూ, ఎదుటివారి మనసులోని మాట చెప్పగలగటమూ, చాలా ముఖ్యమైనవి."

ఆత్మహత్యల కొండ దగ్గర ఆత్మహత్యకు సిద్ధపడ్డ గోపాలం, శివయోగి బోధలవల్ల, దివ్యాశ్రమ యోగిగా మారి, ఆ అయిదేళ్ళ కాలంలోనూ కొన్ని లక్షలను తన స్వంతం చేసుకుంటాడు. ఆ తరువాత ఆత్మహత్య చేసుకోబోతున్న ఆనందరావుని ఆనందయోగిగా మార్చి, తను బయటి ప్రపంచంలోకి వచ్చి, భార్యాబిడ్డల్ని కలుసుకుంటాడు.

"ఈ యోగి ఎవడు? ఎక్కడ్నించి వచ్చాడు? ఎలా వచ్చాడు? తాము చేస్తున్న సత్కార్యాలకు ఇతనెంతవరకూ అర్హుడు?" అనే విచక్షణ ప్రజలలో అదే – భక్తులలో ఏ ఒక్కరికీ వున్నట్టు లేదు. ప్రజలలో అలాంటి ఆలోచనలే వస్తే, ఇన్ని ఆశ్రమాలు వెలుస్తాయా? అందుకే మనది కర్మభూమి అయింది.

రచన ఎక్కడా విసుగనిపించలేదు. చదివిస్తుంది. ఆ తరువాత ఆలోచింప చేస్తుంది. ఐతే, "ఏ అస్తీ, ఉద్యోగమూ లేనివాడు అయిదేళ్ళల్లో లక్షాధికారైతే, ఇన్‌కమ్‌ట్యాక్స్‌వాళ్ళు, గవర్నమెంటువాళ్ళు వూరుకుంటారా? అతనిపై ఎటువంటి దర్యాప్తు, చర్యా తీసుకోరా?" అనే అనవసరమైన ఆలోచనలు మాత్రం పాఠకులకు రాకూడదు మరి!

## బిందుపథం

(నవల)

[రచన : మాదిరెడ్డి సులోచన; ప్రచురణ : యం. శేషాచలం అండ్ కంపెనీ, సుంకురామచెట్టి వీధి, మద్రాసు-1; పేజీలు: 176; వెల: రూ. 6 లు]

మంచి నవలలు, మంచి కథలూ రాసి మంచి పేరు తెచ్చుకున్న రచయిత్రి మాదిరెడ్డి సులోచన. అయితే, ఈ మధ్య పుంఖాను పుంఖంగా వస్తున్న 'నవలా సాహిత్యం' పోటీతో నిలబడాలని కాబోలు, మంచి పేరున్న రచయిత్రులు కూడా 'ఏదో' రాసేసి, తామూ 'రాశాం' అనిపించుకుంటున్నారు. కాకపోతే, మాదిరెడ్డి సులోచన వంటి రచయిత్రి 'బిందు పథం' రాయడం ఏమిటి?- పెళ్ళికాకుండా 'గర్భవతి' కావడం అన్న ఒక 'పాయింట్'ను తీసుకుని నవలగా రాయాలి కాబట్టి, రాయడం ఏమిటి? - ఈ పెద్ద కథ లాంటి నవలలో, ఏ పాత్రా కూడా సమగ్రంగా కనిపించ లేదు; ఏ సన్నివేశమూ కూడా సహజంగా కనిపించ లేదు! ఇలా మరీ, 'దారుణం'గా విమర్శించవలసి రావడం నిజంగా విచారించదగ్గ విషయమే. కాని, ఈ విమర్శలోనే ఒక 'బాధ' వుంది. బాగా రాయగల, రాసి ఎందర్నో ఆకట్టుకున్న రచయిత్రులే ఇలా రాస్తే ఎవరికయినా బాధ కలగదా? గొప్ప రచయిత్రులు విమర్శలను అర్థం చేసుకోగలరు; చేసుకుని, తమ అభిమానులను మళ్ళీ నిరుత్సాహ పరచలేరు. అందుకే ఈ ఆవేదన!



# పెరటితోట పెంపకం

**-లలితకుమారి**

భాగ్య, బెంగళూరు

మాకు పళ్ళమొక్కలు, పువ్వుల మొక్కలు పెంచడం అంటే ఎంతో సరదా. కాని వాటికి కావలసిన విత్తనాలు అవీ పోస్ట్ ద్వారా - ఎవరి ద్వారా లభిస్తాయి? అలాంటి వాటికి మేం మా వూరిలో ఎవరిని సంప్రదించాలి?

విత్తనాలకి, మొక్కలకి మన దేశంలో కల్లా ప్రసిద్ధిగాంచినది బెంగళూరేనండి. అక్కడి లాల్‌బాగ్, రామ్‌సన్ నర్సరీలలో మీకు కావలసిన వెరైటీ మొక్కలన్నీ, లభిస్తాయి. లాల్‌బాగ్‌లో అయితే గేటుబయటే విత్తనాలు, మొక్కలు కొందరు అమ్ముతారు. అవిమాత్రం కాస్త జాగ్రత్తగా పరిశీలించి మరీ కొనండి. లేకపోతే మోసపోయే ప్రమాదముంది.

శ్రీమతి గురురాజు, బనవాసి

మా ఇంట్లో నూల్‌కోల్, వంకాయ, కాలిఫ్లవర్ మొదలైన కూరలు వేశాము. కాని వాటన్నిటినీ పురుగులు తినేస్తున్నాయి. దానికి మేం తీసుకోవలసిన జాగ్రత్తలేమిటి?

ఆ మొక్కలని పరీక్షించి చూస్తే తప్ప ఏ మందు వేస్తే పురుగు పోతుంది—అన్నది చెప్పడం కష్టం. మనుష్యులకి రకరకాల జబ్బులు చేసినట్లే చెట్లకీ అనేక రకాల జబ్బులున్నాయి. కాబట్టి మీకు సమీపంలోని వ్యవసాయ శాఖవారికి ఆ మొక్కలని చూపించండి. వారు తగిన మందు యిస్తారు.

ఎమ్. డి. షకీలా, గూడూరు

మా పెరటిలో దవనం చెట్లు వేశాము. కాని అవి వేసిన రెండు మూడు నెలలకి ఆకు మొదట ఎండి తరువాత చెట్లు ఎండిపోతున్నాయి. అవి ఎలా పెంచాలి? ఏఏ ఎరువులు వెయ్యాలి?

ఉష్ణప్రదేశాలలో దవనం మొక్కలు పెరగడం కష్టం. బెంగళూరు వంటి శీతలప్రదేశాలలోనే అవి బాగా పెరుగుతాయి. కాబట్టి మీరు ఆ మొక్క మీద వినియోగించే ఖర్చు, శ్రమ మరో మొక్క మీద వినియోగించడం మంచిది.

వి. పద్మజ, కొత్తరెడ్డిపాలెం

గత సెప్టెంబర్‌లో గులాబి అంటు నాటాము. అది చక్కగా పెరిగి జనవరి ఆఖరు దాకా బాగా పువ్వులు పూసింది. అయితే ఆకులు తెగులు సోకి ముడుచుకు పోతున్నాయి. ఆకులు ఎండి పోవడంతో కొమ్మ చివరకి తెగులు పాకి ఆ భాగం కూడా ఎండి పోతున్నది. ఆ తెగులు పోవడానికి ఏదైనా మందు చెప్పండి.

మీ మొక్కకి పట్టిన తెగులు 'ఆఫిస్' అనే చీడపురుగు. తెగులు ప్రారంభదశలో వుండగానే కనిపెట్టినట్లయితే 'మెలతియాన్' మందు చల్లితే ఫలితం వుండివుండేది. జబ్బు ముదిరిపోయింది కాబట్టి పురుగుపట్టిన మేర కత్తిరించి కాల్చెయ్యడం మంచిది. పక్కనున్న మొక్కలకి సోకకుండా ఆ తరువాత ఆ మందు కాస్త చల్లినట్లయితే పురుగేదైనా మిగిలివుంటే పోతుంది.

ఆర్. ఇందిర, కోరగుంటపల్లె

మా పెరటిలో నీడ ఎక్కువగా వుంటుంది. అందు

## కూరలు-పోషకపదార్థాలు



ముల్లంగి: ఇందులో మూడు రకాలు వున్నాయి. దీనికి దుంపే ప్రధానం. ఆకులు పొడవుగా వుంటాయి. లేత ముల్లంగి కారపు రుచి కలిగి వుంటుంది.

ప్రతి 100 గ్రాముల ముల్లంగిలోనూ-94.4 గ్రాముల తేమ, 0.7 గ్రాముల ప్రొటీన్లు, 0.1 గ్రాముల క్రొవ్వు పదార్థం, 0.6 గ్రాముల ఖనిజ పదార్థం, 4.2 గ్రాముల పిండిపదార్థం, 0.5 గ్రాముల కాల్షియం, 0.03 గ్రాముల భాస్వరం, 0.4 మిల్లిగ్రాముల ఇనుము, 0.06 మిల్లిగ్రాముల విటమిన్ బి, 0.4 మిల్లిగ్రాముల నికోటనిక్ ఆమ్లము, 0.02 మిల్లిగ్రాముల రిబోఫ్లోవిన్, 15 మిల్లిగ్రాముల విటమిన్ సి, 13.6 మిల్లిగ్రాముల ఆక్సాలిక్ ఆమ్లము వుంటాయి. వీటి కెలోరి విలువ—21.

ఈ దుంపలను సాంబారులోనూ, పులుసులోనూ, కూరగానూ ఉపయోగిస్తారు. లేత ముల్లంగి జ్వరం, కంఠరోగం, నేత్ర రోగాలను హరింపజేస్తుంది. హృద్రోగము గలవారికి కూడా యిది బాగా పని చేస్తుంది. ముల్లంగి వాతం, పిత్తం మొదలైన గుణాలను నశింపజేస్తుంది. ముల్లంగి రసం కొంగ రాకుండా ఆపుతుంది. దగ్గు, శ్లేష్మ సంబంధమైన జబ్బులను పోగొడుతుంది. ఎండిన ముల్లంగి దుంప వాపును పోగొడుతుంది. ఉష్ణవీర్యం కలది అయినప్పటికీ ముల్లంగి దుంప, ఆకులు మాత్ర రోగములను హరింపజేస్తాయి. కాని మానెలో నానించిన ముల్లంగి కఫమును వృద్ధి చేస్తుంది-అని చెబుతుంది ఆయుర్వేదశాస్త్రం.

వల్ల చెట్లు బాగా పెరగడం లేదు. నీడలో ఏ ఏ మొక్కలు పెరుగుతాయి?

నీడనే పువ్వుపూసే మొక్క ఏదీ బతకదు. అంతగా మీకు నీడపట్టునే మొక్కలు పెంచాలని వుంటే పూల మొక్కలకి బదులుగా అందమైన ఆకులుగల మొక్కలు చాలా వున్నాయి. అవి పెంచవచ్చు. ఈ కోవకు చెందినవే పిలియా, ఆరేలియా, డ్రెడిష్కానియా మొదలైనవి.

మా ఇంట్లో కనకాంబరాలు ఆరంజి, ఆకుపచ్చ రంగులు గల మొక్కలు వున్నాయి. వాటిల్లో యింకా ఏ ఏ రంగులు వున్నాయో చెబుతారా?

లేత గులాబిరంగు కనకాంబరాలు కూడా వున్నాయి. విత్తనాలు నర్సరీల్లో లభిస్తాయి. వీటిని చాలా సులువుగా పెంచవచ్చును.

జాజి, మల్లె చెట్లకు ఆకు తీసి వేయాలి అంటారు కదా. మరి ఏ సీజన్‌లో ఆకు తీసి వేయాలో తెలియజేస్తారా?

పూత అయిన తర్వాత ఆకు తీసివెయ్యాలి. అయితే ఆకు తీసివేసేందుకు పదిహేను రోజుల ముందు నుంచే చెట్టుకి నీరుపోయడం ఆపెయ్యాలి. అంటే చెట్టుని బాగా ఎండ నివ్వాలన్న మాట. ఆ తరువాత ఆకు తీసి వెయ్యాలి.

పి. ఉమ, ఏలూరు

ఒక రంగు గులాబి మొక్కకు యింకొక రంగు గల గులాబి కొమ్మతో అంటు కట్టవచ్చునా? అలా కడితే ఆ మొక్కకే వున్న ఆ కొమ్మకు ఆ రంగు పువ్వులు పూస్తాయా? ఇలాంటప్పుడు ఎలా అంటు కడతారో చెబుతారా? గులాబి మొక్కలకి రసాయనిక ఎరువులు వేయవచ్చా?

ఒకే చెట్టుకి అనేక రంగుల కొమ్మలు అంటు కడితే ఆ అంటుకట్టిన రంగులన్నీ వస్తాయి. అంటుకట్టే విధానంలో రెండు రకాలున్నాయి. ఒకటి బడ్డింగ్, రెండవది గ్రాఫ్టింగ్. బడ్డింగ్ శీతలప్రదేశాలలో మాత్రమే ఫలితాన్నియిస్తుంది. గ్రాఫ్టింగ్ మన ప్రాంతాల్లో చెయ్యవచ్చు. అంటుకట్టదలచుకున్న మొక్క



కొమ్మ మధ్యలో ఏటవాలుగా కోసి రెండూ కలిపి కట్టడాన్నే గ్రాఫ్టింగ్ అంటారు. అలా మనం తీసుకున్న చెట్టుకి ఎన్ని కొమ్మలు అంటుకడితే అన్ని రంగుల పువ్వులూ పూస్తాయి. గులాబిమొక్కలకి రసాయనిక ఎరువులు వెయ్యచ్చు. కాని వాటి వాడకం. పాళ్లు ఈ వివరాలు తెలియకుండా మాత్రం వెయ్యడం మంచిది కాదు.

ఎల్. రాధారమణి, గూడూరు

మా పెరటిలో మల్లె చెట్టు వేసి రెండు సంవత్సరాలైంది. అది పువ్వులు పుయ్యడం లేదు. పై పెచ్చు ఆకులకు పురుగు పట్టి ముడుచుకు పోతున్నాయి. దీనికి నివారణ ఏమిటి? మొగ్గ రావడానికి ఏం చెయ్యాలి?

ఆకుపురుగులలో చాలా రకాలు వున్నాయి. సాధారణంగా వీటన్నిటికీ మెలతియాన్ మందు పని చేస్తుంది. కాని విడిగా ఒక్కొక్క పురుగువల్ల చెట్టుకి వచ్చిన జబ్బుకీ ఒక్కొక్క రకం మందు వుంది. అందువల్ల ఆకు శాంపిల్ తీసుకుని వ్యవసాయశాఖవారికి చూపించండి. వారు తగిన మందు యిస్తారు.

తల్లాప్రగడ సురేఖ, పెంటపాడు

మా పెరటిలో ఒక నిమ్మ చెట్టు వుంది. అది ఐదారు సంవత్సరాల నుంచి బాగానే కాస్తోంది. కాని ఈ మధ్య ఒక్కొక్క కొమ్మ ఎండి పోతున్నది. వ్యవసాయశాఖవారు చెప్పిన మందులు పైకి చల్లినా ఫలితం కనిపించడం లేదు. ఒక కొమ్మ ఎండిపోతే కొట్టివేశాము. మిగతా కొమ్మలు ఎండి పోకుండా వుండాలంటే ఏం చెయ్యాలి?

'బోరర్' అని ఒక పురుగు వుంది. ఇది సాధారణంగా చెట్టు కొమ్మలలోకి చేరుతుంది. క్రమక్రమంగా కొమ్మల్ని తినడం ప్రారంభించి చెట్టంతా ఆక్రమించుకుంటుంది. అంచేత 'బార్డోమిక్స్చర్' అన్న మందు బజార్లో అమ్ముతారు. ఆ మందు తీసుకు వచ్చి ఈ పురుగు పట్టిన కొమ్మకి రాస్తే పురుగు చచ్చిపోతుంది. ఐతే, ఈ పని మీరు మొదట కనిపెట్టగానే చెయ్యాల్సింది. ఇప్పుడైనా మించిపోయిందిలేదు. ఎండిన కొమ్మల్ని కట్ చేసి ఈ మిక్స్చర్‌తో ఆ భాగం నింపండి. తక్కిన కొమ్మలకి పురుగు పాకకుండా వుంటుంది. ఆ కొమ్మలకి పట్టిన పురుగూ చచ్చిపోతుంది.

సరోజ, బెంగళూరు

మా ఇంట్లో కుండీలో పెంచిన గులాబీ క్రోటన్ మొక్కలకి నల్లచీమలు పట్టాయి. గులాబీ మొక్క పూర్తిగా బూడిదరంగులో వుంది. ఆకులు పాలిపోయి వున్నాయి. వీటికి ఏ మందు వాడాలి? గులాబి మొక్కలకు ఎలాంటి ఎరువు వాడాలి? నెలకొకసారి నూనె తీయబడిన నువ్వుల పిండి వాడుతున్నాము. అలా చేయవచ్చునా?

మీ యింట్లోని గులాబి, క్రోటన్ మొక్కలకి ఆఫిస్ అనే పురుగు పట్టింది. అది చాలా ప్రమాదకరమైనది. ఒక చెట్టుకి పడితే తోటంతా పడుతుంది. చీమలు చేరడానికి కారణం ఏమిటంటే — ఆ పురుగు మలము తియ్యగా వుంటుంది. అందువల్ల చీమలు చేరతాయి. ప్రాథమికదశలో వున్నట్లయితే అది పట్టినంత వరకు కొమ్మ కత్తిరించి కాల్చివేయాలి. కాస్త ముదిరినట్లయితే మెలతియాన్ అనే మందు కాస్త ఘాటుగా చెట్టుకి చల్లితే చాలు. ఇక ఎరువంటారా — గానుగపిండి మంచిదే. గులాబి మొక్కలకి బాగా మగ్గిన గుర్రపుపెంట మంచిది. పశుపెంట కూడా వెయ్యవచ్చు. ఎర్రమన్ను (కాలవమన్ను) చాలా ముఖ్యం. నీటివసతి బాగా వుండాలి. మూడుపాళ్లు ఎరువు, ఒకపాలు ఎర్రమన్ను, రెండుపాళ్లు ఇసుకపాలు వేస్తే గులాబిచెట్లు బాగా పువ్వులు పూస్తాయి. □




మనిషి విజ్ఞానపరిధిని, వివేకపరిణామాన్ని, పరిపక్వతను అనుసరించి వుంటుంది జీవిత వికాసం. అందువల్లే మనిషిలోని విజ్ఞానదాహం నిరంతరాయంగా సాగుతూ వుంటుంది. ఈ జిజ్ఞాసే-మనిషి ప్రగతి పథ సోపానం అవుతుంది.

జీవితం ప్రశాంతసాగరంలో వీచే ఆనంద తరంగంలా హాయిగా సాగాలంటే మనిషి పెంచుకోవలసిన మంచి మన [illegible] గురించీ; నడవవలసిన సత్యమార్గం గురించీ మన సనాతన ఋషులు నాటి ప్రశాంతమైన వాతావరణంలో ప్రగాఢంగా ఆలోచించారు. అన్వేషణలెన్నో జరిపారు. తమ అన్వేషణ ఫలితాలను, అనుభవ సత్యాలను, ఋక్కులలో, మంత్రాలలో పొందుపరిచారు. అవే మన సనాతన విజ్ఞాన మూలకందాలని చెప్పబడే వేదాలు! వేదాల సందేశ ప్రాముఖ్యతను చాటే దేవాలయమే నాగలాపురం వేదనారాయణస్వామి ఆలయం.

మద్రాసు - తిరుపతి మార్గంలో మద్రాసు నుంచి యాభైమైళ్ళ దూరంలో చిత్తూరుజిల్లాలో నాగలాపురం వుంది. ఊరికి తూర్పువేపున ప్రశాంతమైన వాతావరణంలో ఎత్తైన మూడు ప్రాకారాలతో పశ్చిమాభిముఖంగా వుండే గుడి చాలా విశాలంగా వుంటుంది. నాలుగు వేపులా వున్న శిథిలద్వారగోపురాలు ఒకనాటి సమగ్రమైన గోపురాలు - కాలం సమ్మెటదెబ్బలకు ఇలా తయారయ్యాయా? లేక వీటి నిర్మాణమే అటూ ఇటుగా కాకుండా ఆగిపోయాయా? అని తేల్చుకోలేని స్థితిలో వున్నాయి.

రాయలసీమకు అలంకారప్రాయమైన ఈ ఆలయ నిర్మాణం కృష్ణదేవరాయల కాలంలో జరిగిందట. రాయల పరిపాలనలో తెలుగు నేల మాత్రమే గాక – దాదాపు దక్షిణదేశమంతా సుఖశాంతులతో వర్థిల్లేదని చరిత్రకారులు చెబుతారు. పర్యవసానంగా సంగీత సాహిత్యాది కళామందారాలు కోకొల్లలుగా వికసించాయి. లలితకళలకు అద్భుత రూపాలు దిద్దిన నాటి ప్రజల దైవభక్తి, మతాభిమానం-దేశం నాలుగు చెరగులా మూడు గుళ్ళూ, ఆరు గోపురాలుగా వెల్లివిరిసాయి. అలా నాడు నిర్మింపబడిన ఆలయాలలో బ్రహ్మాండమైన వేదనారాయణస్వామి గుడి కూడా ఒకటి!

ఇలవేల్పయిన తిరుపతి వేంకటేశ్వరుని సందర్శించి దక్షిణాదికి పయనమైన కృష్ణదేవరాయలు-దేవరాయకుప్పం అన్న ఈ గ్రామంలో ఓ రాత్రి బసచేశారట. అప్పుడు గ్రామాధికారి వేదనదీతీరంలో విష్ణు ఆలయం నిర్మించవలసిన అవసరం గురించి విన్నవించగా - రాయలు సంతోషంగా అంగీకరించి. ఆలయ నిర్మాణానికి కావలసిన ధన, ధాన్య వస్తువాహనసామగ్రిని, శిల్పాచార్యులను, మాన్యాలనూ సమకూర్చారట. నాటినుంచి ఆ గ్రామానికి తన తల్లి నాగలాంబ పేరుతో నాగలాంబాపురం అని నామకరణం చేశారనీ-అదే కాలక్రమేణా నాగలాపురం అయిందనీ అంటారు.

ఇది కేవలం కర్ణపరంపరగా వస్తున్న కథ మాత్రమే కాదు. దీనికి సంబంధించిన శిలాశాసనాలు కూడా కొన్ని ఆలయప్రాంగణంలో వున్నాయి.

సాధారణంగా వూరూరావుండే వినాయక విగ్రహాలు కూర్చున్న భంగిమలోనే వుంటాయి. అయితే ఈ ఆలయంలో ప్రవేశించగానే మన దృష్టిని ఆకర్షించేది - ఎడమవేపున గదాధరుడై నిల్చున్న పెద్ద ద్వారపాలక వినాయక విగ్రహం. దీనికి దక్షిణదిశగా విష్ణుదుర్గ ఆలయం వుంది.

రెండో ప్రాకారం నైరుతీదిశలో వేదవల్లి తాయారు ఆలయం; వాయవ్యదిశగా సీతాలక్ష్మణ సమేత శ్రీరామ మందిరం; ప్రక్కనే భక్త ఆంజనేయ విగ్రహం; రామ మందిరానికి దక్షిణంగా లక్ష్మీనృసింహ వీరాంజనేయ విగ్రహాలూ వున్నాయి.

గర్భగృహ ఉత్తరదిశ కుడ్యంలో విష్ణు, దుర్గ, బ్రహ్మ విగ్రహాలూ; తూర్పుదిశగా లక్ష్మీసమేత భూవరాహమూర్తి విగ్రహం; దక్షిణ దిశగా వీణాపాణియైన దక్షిణామూర్తి; నాగబంధన గణపతి విగ్రహాలూ వున్నాయి.

ఈ విగ్రహాల మీది మకర తోరణాలన్నిటిలోనూ వివిధ భంగిమలలో సుందర మురళీకృష్ణ శిల్పాలు వున్నాయి.

ప్రతి ప్రాణీ జన్మిస్తుంది, మరణిస్తుంది. జనన మరణాల మధ్య విరామకాలమే జీవితం. ప్రపంచంలోని ప్రతి ప్రాణికీ-కాదు కాదు ప్రతి వస్తువుకీ ఈ మూడు మార్పులు తప్పనిసరి. ఈ అనుక్షణ పరివర్తనాన్నే-సృష్టి, స్థితి లయాలు అన్నారు మన పెద్దలు. ఈ మూడు మార్పులకూ మూలకారణం మార్పులేని శాశ్వతమైన దివ్యశక్తి - సృష్టి, స్థితి లయాలకు - కర్త, భర్త, హర్తలైన త్రిమూర్తి స్వరూపుడైన పరమాత్మ అనీ పెద్దల విశ్వాసం. ఈ సత్యాన్ని చాటడానికి ముమ్మూర్తులను ఒకే మూర్తిగా చూపే నాలుగున్నర అడుగుల ఎత్తు త్రిమూర్తి విగ్రహం ఈ గుడికి చెందినదే!

జీవితంలో ఎదురయ్యే సుఖ దుఃఖాలకు, తారసపడే వింతవింత అనుభూతులకూ సంకేతాలా అన్నట్టు - ఈ విగ్రహాన్ని ఒక్కోచోట తడితే ఒక్కోనాదం ప్రకారం సప్తస్వరాలు వినిపిస్తాయి. శిలల నుంచి సుందర శిల్పాలనేకాదు; సప్తస్వరాలను కూడా వినిపించగల ప్రతిభావంతులు మన

ముమ్మూర్తులను ఒకే మూర్తిగా చూపే
త్రిమూర్తి విగ్రహం



# నాగలాపురం



శిల్పాచార్యులు-అని చాటే ఈ అపూర్వ శిల్పకళా ఖండాన్ని - మరికొన్ని శిలావిగ్రహాలతోపాటు తిరుమల తిరుపతి దేవస్థానం మ్యూజియంలో భద్ర పరిచారు.

ప్రజలలో భక్తిభావాన్ని - పాపభీతిని, నైతిక స్పృహను-తట్టిలేపిన ఆళ్వార్ల విగ్రహాలు గర్భ గుడికి ఇరువైపులా వరుసగా వున్నాయి.

గర్భగృహంలో శ్రీదేవి భూదేవి సమేతంగా దక్షిణహస్తంలో ప్రయోగచక్రం, వామహస్తంలో శంఖం ధరించి పశ్చిమాభిముఖంగా మూలవిరాట్టు వేదనారాయణస్వామి విగ్రహం వుంది.

ఏటా మార్చి - ఏప్రిల్ మాసాలలో మూడు రోజులపాటు 'సూర్యపూజ' ఉత్సవాలు జరుగు తాయి. ఆ మూడు రోజులలోనూ క్రమంగా స్వామి పాదాలు, నాభి, శిరస్సు మీద అస్తమయ సూర్య కిరణాలు పడడం విశేషంగా చెప్పుకుంటారు.

వేదనారాయణస్వామి పాదాలు మత్స్యరూపంలో వున్నాయి.

సత్యవ్రతుడనే వైవస్వతమనువు అర్ఘ్యం ఇవ్వ డానికి దోసిలితో నీళ్ళు తీసుకోగా అందులో ఒక చేపపిల్ల కనబడిందట. ఆ నీళ్ళు వదిలేసి మరో దోసిలిపట్టాట. అందులోనూ అదే చేప కనబడిందట. ఇలా పలుసార్లు తన దోసిలిని వదలని చేపను చూసి ఆశ్చర్యపడిన రాజుతో "సత్యవ్రతా! నన్ను అలక్ష్యం చెయ్యొద్దు. ఇవాళ నన్ను కాపాడావంటే తగిన సమయంలో నేను నిన్ను రక్షిస్తాను." అందట చేప. రాజు దానిని ఒక పాత్రలో వదలగా కొద్దిసేపట్లో పాత్రనిండుగా పెరిగిందట. తన్ను మరో చోటికి మార్చమని ప్రాధేయపడ్డదట. రాజు దానిని ఒక తటాకానికి చేర్చగా ఒక్క రోజులోనే అది తటాకం అంత అయిందట. గంగకు చేర్చగా గంగ అంత పెరగసాగిందట. ఇక లాభం లేదని సముద్రానికి మార్చాడట. పూటకోరీతిగా రోజుకో కళతో పెరిగి పెద్దది కాసాగిందట చేప ఆ సముద్రంలో.

ఎలా వుందో చూసివద్దామని ఓ రోజు సముద్ర తీరానికి చేరిన సత్యవ్రతుని చూసి "ఏదో రోజున జలప్రళయం రానున్నది. ఒక పడవ తయారు చేసి అందులో నువ్వూ, నీ సహచరులతోపాటు జీవ రాశుల్లో ఒక్కొ దానిని సేకరించి వుంచుకో. మిమ్మల్ని జలప్రళయం నుంచి రక్షిస్తాను" అందట-మత్స్యం! అదేప్రకారం జలప్రళయం జరిగి భూవలయమంతా జలమయం అయిందట. కొండలు, కోనలు, పర్వతాగ్రాలతో సహా మునిగి పోయినా - సత్యవ్రతుని మాత్రం సపరివారంతో సురక్షితంగా కాపాడాడట మత్స్యరూపంలోని విష్ణుమూర్తి!

ఈ విలయ తమిస్రవేళను అదనుగా తీసుకుని సోమకుడు అనే రాక్షసుడు బ్రహ్మ నుంచి వేదాలను అపహరించుకుని పాతాళానికి పారిపోగా - బ్రహ్మ ప్రార్థనమేరకు మత్స్యావతారమూర్తి అయిన మహా విష్ణువు-సోమకుని సంహరించి వేదాలను రక్షించి బ్రహ్మకు ఇచ్చాడట. యుగసంధిలో కాపాడిన వైవస్వతమనువునూ, సపరివార జీవరాశుల్ని బ్రహ్మకు అప్పగించి - అదే రీతిలో జగత్ సృష్టిగావించమని శ్రీమహావిష్ణువు బ్రహ్మకు ఆజ్ఞాపించాడట.

ధర్మాన్ని మనం కాపాడితే అది మనల్ని కాపాడుతుంది - అన్న ఉదాత్త వేదసూక్తిని సూక్ష్మంగా సూచించే ఈ మత్స్యావతార గాథను-పదహారువేల శ్లోకాలలో మత్స్యపురాణం వివరిస్తుంది. మహావిష్ణువు తొలి అవతారమని వైష్ణవులు విశ్వసించే మత్స్యావతారానికి సంబంధించినదే-వేదనారాయణస్వామి ఆలయం-పురాణం!

ఇలాంటి గాథే క్రైస్తవమత గ్రంథమైన Old Testament లోనూ వుండడం విశేషం!

'ఆదాము' వంశంలో తొమ్మిదో తరానికి చెందిన నోవా, ధర్మవర్తనుడు, సత్యశీలి. అయితే ఆయన కాలంలో పాపం పెచ్చుపెరిగిపోగా ప్రపంచాన్ని నాశనం చెయ్యాలని దేవుడు సంకల్పించాడట. జలప్రళయం జరిగింది. నోవా కుటుంబం, సకల జీవరాశుల్లో ఒక్కో ప్రాణి ఒక నౌకలో కాపాడబడ్డాయట. ప్రళయానంతరం ఆ జీవరాసుల నుంచే ప్రపంచసృష్టి జరిగిందని బైబిల్ చెబుతుంది!

రోమనులు ఆరాధించే నీరస్ మీనరూపంలో వుండడం గమనించదగ్గ విషయం. నీరస్ కూడా సత్యశీలురను, ధర్మవర్తనుల్నీ కాపాడే దేవుడని రోమన్ల విశ్వాసం!

దేశం వేరైనా - మతం మరేదైనా - మంచిని పరిరక్షించడంలోనే మనిషి మంచీ, మనుగడా ఇమిడివుంటాయన్న విశ్వాసం ప్రపంచవ్యాప్తంగా వుందన్నడానికి ఇది ఒక ఉదాహరణ! అందుకే-ధర్మోద్ధరణకు దైవసహాయం సర్వవేళలా వుంటుందని అన్ని మతాలూ ఉద్బోధిస్తాయి! □

# సంస్కృత పాఠమాల 12

సంస్కృతభాష నేర్చుకొనుటకు ప్రయత్నము చేయు వారందరు మిక్కిలి శ్రద్ధ కలిగి యుండవలెను. సాధారణముగా పెక్కు శ్లోకములను కంఠస్థము చేసి వాటిని విశ్లేషించి శ్లోకార్థమును తెలిసి కొందురు. శ్లోకార్థముల నెరిగిన తరువాత శబ్దములను కలుపు సంధుల నియమముల నెరుగవలెను. సామాన్యముగా సంస్కృతమున సంధులు చేయుట కూడా తెలుగున సంస్కృత పదములను చేసినట్లే యుండును.

వ్యాకరణము తెలియనిది భాష తెలియుట కష్టము. కాబట్టి వ్యాకరణము యొక్క ముఖ్యాంశములను ఈ పాఠమున ప్రారంభించుచున్నాము.

**बालक: गणेशम् नमति**
బాలకః గణేశమ్ నమతి } బాలుడు గణేశుని నమస్కరించును. ఈ వాక్యమున **बालक:** కర్త **गणेशम्** కర్మ **नमति** క్రియాపదము. ఇందు **बालक:** ప్రథమావిభక్తియందున్నది. **प्रथमा विभक्ति** **गणेशम्** అను కర్మపదము ద్వితీయావిభక్తి యందున్నది. **द्वितोयाविभक्ति** తెలుగు భాషలో కర్త పదము యొక్క విభక్తి ప్రథమావిభక్తి. కర్మ పదము యొక్క విభక్తి ద్వితీయావిభక్తి. సంస్కృతము నందు కూడనిదేవిధముగా నుండును. **बालक, गणेश,** ఈ రెండు శబ్దములకు చివర **'अ'** (అ) ఉన్నది. అందుచేత వీటికి **अकारान्त** (అకారాన్త) శబ్దములని పేరు.

సంస్కృతమున ఏకవచనము, ద్వివచనము, బహువచనము అను మూడు వచనములున్నవని ముందే తెలిసికొంటిమి.

ఈ బాలకః **बालक:** శబ్దము మూడు వచనములలో భిన్నభిన్న విభక్తులెంటెట్లుండునో గమనింపుడు.

| ఏకవచనమ్ | ద్వి వచనమ్ | బహువచనమ్ | |
|---|---|---|---|
| **एकवचनम्** | **द्विवचनम्** | **बहुवचनम्** | |
| **बालक:** | **बालकौ** | **बालका:** | **प्रथमा** |
| బాలకః | బాలకౌ | బాలకాః | (ప్రథమా) |
| **बालकम्** | **बालकौ** | **बलकान्** | **द्वितीय** |
| బాలకమ్ | బాలకౌ | బాలకాన్ | ద్వితీయా |
| **बालकेन** | **बालकाभ्याम्** | **बालकै:** | **तृतीया** |
| బాలకేన | బాలకాభ్యామ్ | బాలకైః | తృతీయా |
| **बालकाय** | **बालकाभ्याम्** | **बालकेभ्य:** | **चतुर्थी** |
| బాలకాయ | బాలకాభ్యామ్ | బాలకేభ్యః | చతుర్థ |
| **बालकात्** | **बालकाभ्याम्** | **बालकेभ्य:** | **पञ्चमी** |
| బాలకాత్ | బాలకాభ్యామ్ | బాలకేభ్యః | పంచమీ |
| **बालकस्य** | **बालकयो:** | **बालकानाम्** | **षष्ठी** |
| బాలకస్య | బాలకయోః | బాలకానామ్ | షష్ఠీ |
| **बालके** | **बालकयो:** | **बालकेषु** | **सप्तमी** |
| బాలకే | బాలకయోః | బాలకేషు | సప్తమీ |
| **हे बालक** | **हे बालकौ** | **हे बालका:** | **संबोधनम** |
| హేబాలక | హేబాలకౌ | హేబాలకాః | సంబోధనమ్ |

ఇదే విధముగా అకారాంతములైన **राम:** రామః **राक्षस:** రాక్షసః **अश्व:** అశ్వః మొదలగు శబ్దముల విషయమున.

మాతృత్వం అన్నది స్త్రీకి ప్రత్యేకంగా లభించిన వరప్రసాదం. గర్భధారణ కాలం నుంచి సహజ సిద్ధంగా పల్లవించి పరిమళించే వాత్సల్యానికి పునాది మాతృత్వం.

పాప భవిష్యత్తు కోసం, జీవన వికాసం కోసం తన యౌవనాన్ని త్యాగం చేస్తుంది తల్లి. మన దేశానికి సంబంధించినంతవరకు స్త్రీ కేవలం సంసార నాయిక మాత్రమే కాదు. భావి సంతతిని రూపొందించే మాతృమూర్తి కూడా!

శరీర ఆరోగ్యం చెడి, మానసికంగా పతనమైన చంటిపిల్లలను భుజాల మీద ఎత్తుకుని ఏనాటికైనా నయం కాక పోతుందా? – అన్న పుట్టెడు నమ్మకంతో ఏళ్ళ తరబడి ఆస్పత్రులకు నడిచే తల్లులు ఎందరో వున్నారు. సంపాదనలో సగానికి పైగా ఆస్పత్రులకే ధారపోసే వారూ వున్నారు. అందుకేనేమో ప్రపంచంలో ఏ సమాజంలోగాని తల్లికి సమున్నత స్థానం ఇస్తారు.

అలాంటి తల్లి మీద పాప పెంచుకునే వాత్సల్య బంధం కూడా ఇంతా అంత కాదు.

అప్పుడే పుట్టిన శిశువు – చాలామంది తల్లులు అనుకునేలా చిన్నారి దేవత (Little Angel) కాదు. అదో చిన్న ప్రాణితో సమానమైనదే. ఆ సమయంలో పసికందుకు కావలసిందల్లా – ఆకలికి ఆహారం; ప్రేమతో నిండిన వెచ్చని ఆదరణ. అంతే.

అదే పాప మూడు నెలల నుంచి ఆరు నెలల వరకు పాలిచ్చే తల్లిని, ఆయాను కేవలం తన అవసరాలు సమకూర్చే వారిగా మాత్రమే చూడడం లేదు. వారిని ప్రత్యేకమైన గుణాతిశయాలుగల వ్యక్తులుగా గుర్తిస్తుంది.

ప్రేమతో తల్లి రాకకు ఎదురు చూస్తుంది. అమ్మను చూడగానే ఆనందంతో నిండిన వింత వెలుగుతో ప్రకాశిస్తాయి పాప కళ్ళు. రోజు రోజుకు ఆ ప్రేమ బాగా అభివృద్ధి చెంది సంవత్సరం నిండే లోపల గాఢమైన వాత్సల్య బంధం పెనవేసుకుంటుంది.

ఒకటిన్నర సంవత్సరం నుంచి రెండేళ్ళు నిండే వరకు కన్నవారి వాత్సల్యం అమితంగా ఎదురు చూస్తుంది. ఈ సమయంలోనే పాపకు ప్రత్యేకమైన తల్లి ప్రేమ అవసరమౌతుంది.

తల్లి తప్ప తక్కిన వారెవ్వరు ఆహారం తినిపించినా, కావలసిన అవసరాలు సమకూర్చి ప్రేమతో చూసినప్పటికీ పాప తల్లి ప్రేమకు తహతహలాడి పోతుంది. అప్పుడు ఆ శిశువు, ప్రేమ, సంతోషం, తృప్తి, జ్ఞాపకాలు మొదలైనవన్నీ తల్లి మీదే కేంద్రీకరింపబడతాయి. ఒక్క మాటలో చెప్పాలంటే తల్లే ఆ పాపాయికి లోకం. ఎంచేతంటే తన అవసరాలన్నిటినీ తీర్చి సకల విధాల రక్షణను కల్పించేది తల్లే అన్న విశ్వాసం పాప హృదయంలో వేళ్ళూనుతుంది. అమ్మ ప్రేమ, ఆదరణ అంతా తనకు మాత్రమే సొంతం అన్న స్వార్థభావం బాగా ఏర్పడుతుంది.

తల్లి తనకు మాత్రమే సొంతం అని భావించే ఈ ప్రాయంలో తల్లి కొంచెం దూరమైనా, పాప ప్రేమ, ఆదరణ, అన్నీ పోగొట్టుకున్నట్లు తపించి పోతుంది. ఆపలేని విషాదంలో మునిగిపోతుంది.

ఒక్కోసారి తల్లి దూరమైనప్పుడు మొదట కొన్ని గంటలసేపూ ఆ తర్వాత ఏడెనిమిది రోజులు కనబడకుండా వున్నప్పటికీ – తల్లి తనపట్ల చూపిన ప్రేమను తలచుకుంటూ ఆమె ఇప్పుడు తన దగ్గర లేదన్న బాధను తన యేడ్పు స్వరంతో బయట పెడుతుంది.

అమ్మ కనబడలేదే అన్న దిగులుతో సతమతమయ్యే శిశువు తల్లి పోలికలు కలవారు కనబడినా, లేదా తల్లి కంఠస్వరంలాంటిది వినబడినా అక్కడికి చేరుకోవడానికి చూపే ఉత్సాహం స్పష్టంగా కనబడుతుంది.

అమ్మ కనబడదన్న అపనమ్మకం ఏర్పడినప్పుడు తట్టుకోలేని దుఃఖంతో ఆగి, ఆగి, లేదా ఒకే మాపున ఏడ్చి ఏడ్చి తన అసహాయతను వ్యక్తం చేస్తుంది.

ఎంతటి సుందర వాతావరణంలో వున్నా వాటి నన్నిటినీ ఏమీ పట్టించుకోకుండా మహత్తరమైన దానిని పోగొట్టుకున్నట్టు అమ్మ లేదన్న ఆవేదన పాపలో బాగా ఏర్పడుతుంది.

అలాంటప్పుడు పాప జ్ఞాపకాలను మరిపించడానికి, దృష్టిని మరోవైపు మళ్ళించడానికి ఎవరైనా దగ్గరికి వచ్చి మచ్చిక చేశారంటే – వారి దగ్గరికి పోకుండా ఏడుస్తూ ఒంటరితనాన్నే కోరుకుంటుంది.

శిశువు జ్ఞాపకాలను, ఆశలను సొంత భావాలను ఆటవస్తువుల మీదికి, తినుబండారాల మీదికి మళ్ళించడానికి ప్రయత్నిస్తాము. అలాంటప్పుడు తల్లి నుంచి తన్ను విడదీశారు అన్న దుఃఖం అనుభవించడంవల్ల – ఆ పాప మానసిక స్థితి ఒక సమస్యగా పరిణమించి.... అది తర్వాత ఆ పాప మానసిక అభివృద్ధికి హాని కలిగిస్తుంది.



# పిల్లలు – మానసికస్థితి

— డాక్టర్





ప్రవేశపెడుతున్నాం

స్టాన్‌రోజ్

30 ఏళ్ళకుపైగా పేరెన్నికగన్న నాణ్యతగల బట్టలకు కొత్తపేరు

ROSE

everest/79/SM/290-tl

మన వీధుల్ని
కాంతివంతంచేయాల్సిన
వేళయిందిగనక...

అందంచిందే అద్భుతాలు. మా వద్దనుండి
మీరు ఆశించవచ్చు. ప్రతిసారీ.
మరి నాణ్యతను కూడా ఆశించవచ్చు.
అందులో ఆశ్చర్యమేమీ లేదు.
మీరు 80 ఏళ్ళకుపైగాగల మా నైపుణ్యం
గురించి ఆలోచించి చూస్తే మరి.

సమర్పిస్తున్నవారు :




స్టాండర్డ్ మిల్స్



సూరత్ కాటన్ మిల్స్

# అదొక రకం మనస్తత్వం!

పాల నురుగులాంటి తెల్లటి చీరతో మిలమిలా మెరిసిపోతోంది గౌతమి. ''కొత్త చీర కట్టుకుని కాఫీ అయినా ఇవ్వకపోతే ఒప్పుకోం'' అంటూ గోల చేసాం. చిరునవ్వుతో అంగీకరించి తెప్పించింది కాఫీలు. సీత ముఖంలో చిన్న బాధ దోబూచులాడుతోంది. కాఫీ లొచ్చాయి. సీత ఎంతో ఆప్యాయంగా అందరికీ స్వయంగా కాఫీ లిస్తోంది. గౌతమి తెస్తోంటే చెయ్యి తొణికింది. మల్లెపూవులాంటి చీర మీద కాఫీ మరకలు! 'వెరీ సారీ గౌతమీ' సీత నొచ్చుకుంది. చప్పున ఆమె ముఖం చూసాను. ఆ కళ్లలో క్షణంసేపు రవంత ఆనందం తళుక్కుమంది. 'ఫరవాలేదు సీతా' అదే చిరునవ్వుతో చెయ్యి మృదువుగా నొక్కింది గౌతమి. మనస్సు చివుక్కుమనే వుంటుంది పాపం!

కాఫీ పొరపాటున తొణకలేదు. కావాలనే చేసింది సీత. అందమైన గౌతమి తెల్లటి చీరలో అందరి కళ్ళనూ ఆకట్టుకునేసరికి రవంత బాధ సీతలో. మళ్ళీ సీత, గౌతమి ప్రాణ స్నేహితులు. నిజానికి ఆ రోజున గౌతమిని అలా చూస్తే చాల ముచ్చటగా అనిపించింది అందరికీ. అందాన్ని చూసి ఆనందించడం కూడా కళే.

సీత దుర్మార్గురాలు కాదు. శాడిస్టు అంతే. తెల్లచీర రవంత మలినమవడంతో ఆమె మనసు శాంతించింది. అదొకరకం (సహించలేని ఒక విధమైన మనస్తత్వం) శాడిజమ్. వీళ్ళు ఎవరికీ అపకారం చెయ్యరు తమంత తాముగా. కాని అవతలవాళ్లు ఆనందంగా వుంటే ఓర్వలేరు. అవతలి వాళ్ళ మీద అసూయ కాదు. అదే శాడిస్టుల బలహీనత. తెల్లచీర కాస్త పాడవడంవల్ల గౌతమికేం నష్టంలేదు. కడిగేస్తే పోతుంది. కాని ఆ ఒక్క క్షణం గౌతమికీ వాళ్ళ ఆనందానికి బ్రేకు పడిన ఆ ఒక్క క్షణం చాలు సీతకి.

శాడిస్టులు వాళ్లు సుఖపడలేరు. ఇతరులని సుఖపెట్టలేరు. ఎదుటివారి ఆనందం చూస్తే అకారణంగా వాళ్ల మనసు ముకుళించుకుపోతుంది. మా వదిన మేనమామ కొడుకు ఒకడున్నాడు, ఇదే రకం. ఆ రోజు మా వదిన పుట్టిన రోజు. నిజంగా ఎంత సంతోషంతో కళకళ్లాడిపోతోందో చెప్పలేను. నిజంగా నాకెంతో ముచ్చటేసింది. అంత ఆనందంగా వుండగా నేనెప్పుడూ చూళ్ళేదు. అన్నయ్య కూడా కేంపుకి వెళ్ళకుండా ఇంట్లోనే ఉన్నాడు. ఇక వదినకి పట్టపగ్గాలేవు. అంతటి ఆనందం చిన్న విష బిందువుతో కలుషితమైపోయింది. ''అత్తయ్య లేని లోటు కొట్టవచ్చినట్లు కనిపించడంలేదూ వసంతా! ఎంత సంతోషించేదో కదా'' అన్నాడు బాధగా ముఖం పెట్టి ఆ ప్రబుద్ధుడు.

వదిన కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి. వదిన వాళ్ళ అమ్మ పోయాక వదినని మరపించడానికి 2 సం॥ పట్టింది. అంత విపరీతమైన అభిమానం వాళ్ళమ్మంటే. మానుతున్న గాయం కావాలని రేపాడు. అభిమానంతో అన్నమాట కాదది. అంతటి సంతోషాన్ని చూసి భరించలేక.

ఈ శాడిస్టులకు తన పర భేదంలేదు. మా యింటి ప్రక్కనే ఒక మాస్టారున్నారు. ఆయనొక శాడిస్టు. గలగలా కిలకిలా చిలకల్లా నవ్వే తన పిల్లల్ని చూసి దుఃఖంతో మెలి తిరిగిపోతాడు. అనవసరంగా పిల్లల్ని చితక బాదేస్తుంటాడు. ఆయన ఇంట్లో ఉండగా పిల్లలు నవ్వరు, భార్య నవ్వదు. పొరబాటున నవ్వారో ఇక చూడాల్సిందే నాటకం.



వంట చేస్తున్నప్పుడు ఎంత జాగ్రత్తగా వున్నప్పటికీ ఒక్కోసారి కాగుతున్న పెనం మీద నుంచి నూనె చెదిరి, చేతులమీద పడుతూ వుంటుంది. అలాంటప్పుడు వెంటనే కాస్త తేనె తీసి పూసినట్లయితే నూనె పడినచోట బొబ్బలు ఏర్పడి పుండు అయ్యే బాధ తప్పుతుంది.

మా వదిన అంటూంటుంది ''అలాంటి వాళ్ళని చూసి జాలి పడాలి శేషూ—అసహ్యించుకోకూడదు. అది ఒక బలహీనత'' అని. కాని అకారణంగా ఇతరుల ఆనందాన్ని పాడు చేసే వాళ్లని చూస్తే నిజం చెప్పాలంటే చెప్పలేనంత రోత పుడుతుంది.

ఇక మా అన్నయ్యవాళ్ల హెడ్‌మిస్ట్రెస్ ఉంది. ఆవిడ తను సెలవు పెట్టదు. ఎవళ్లకీ సెలవివ్వదు. సెలవడిగితే వాళ్ళింట్లో ఎవరో ప్రియమైనవాళ్లు చచ్చిపోయినంత బాధగా ముఖం పెడుతుందిట ''వారం రోజులు అన్నం సయించదు తరువాత'' అంటాడన్నయ్య. ఎంతో అవసరమై ప్రాణం మీదికొచ్చినా తను సెలవివ్వక పోయినప్పుడు ఇవతలి వాళ్ల ముఖంలో కదలాడే బాధ చూస్తే ఆవిడలో కనీకనిపించని సంతోషం. ఏదైనా దుఃఖ వార్త చెప్తూన్నప్పుడు ఆమె ముఖంలో చిన్న వెలుగు—పైకెంత సానుభూతి ఒలకబోస్తున్నా. అన్నయ్య ఫ్రెండు ఒకాయన భార్య చనిపోయింది. ఆ విషయం చెప్తూ సెలవడిగినపుడు ''అయ్యో పాపం! తీసుకోండి'' అంటున్నపుడు ఆమె ముఖం చూడాలి. "మతిపోతుంది మనకి" అన్నాడన్నయ్య. అది పైశాచికానందం. రోజూ ఆమె గురించి క్లాసులు తీసేసుకుంటాడు అన్నయ్య. అదొక టాపిక్ అయిపోయింది మాకు రోజూ.

కాని అలాంటి మనస్తత్వాలు తల్చుకుంటే భయం కూడా వేస్తుంది నాకు. ఎంత బలహీనతైనా మానవత్వం మాట.

అకారణంగా దెబ్బలు తినే మాస్టారి పిల్లలు, చెంప దెబ్బలు తినే మాస్టారి భార్య, సంస్కారవంతురాలిగా కనిపించే సీత, అన్నయ్య బాస్ - వీళ్ళని చూస్తేనే నాకు మతిపోతుంది. అన్నయ్య చెప్పే శాడిస్టుల గురించిన వింతలు వింటూంటే హత్యలు చేసినవాళ్లున్నారట అకారణంగా ఈ శాడిస్టుల్లో ఆపకుండా నవ్వుతున్న కన్నకూతుర్ని పీక పిసికి చంపేసాట్ట ఒక మహానుభావుడు.

కొన్ని కేసులంత ప్రమాదం లేదు. కేవలం ఎదుటివాళ్ళ ఆనందాన్ని కలుషితం చేసి వదిలిపెడతారు. వాళ్ళని క్షమించవచ్చు. కాని వాళ్ళ బలహీనత గురించి, నవ్వులు చూస్తే మనశ్శాంతి కోల్పోయి రోగపీడితులయిపోయేవారి మానసిక వేదన గురించి తీవ్రంగా ఆలోచిస్తూంటే వదినన్నట్లు నాకూ రవంత జాలి కలుగుతుంది మరి.

—ఏ. వి. శేషారత్నం



యం. జి. ఎస్. ప్రవీణ్ (వెల్లూరు) పుట్టిన తేది : 28-12-76 తల్లి పేరు : యం. అనూరాధరత్నం



కె. సుమంత్ (అవనిగడ్డ) పుట్టిన తేది : 15-12-78 తల్లి పేరు : కె. సీత



బి. హిమబిందు (చల్లకెర) పుట్టిన తేది : 28-12-77 తల్లి పేరు : బి. ఉషాసత్యం




ఈ నెల పుట్టిన రోజులు గల శిశువుల్లో - ఏడాది పిల్లల గ్రూపులో కె. సుమంత్ ; రెండేళ్ల గ్రూపులో బి. హిమబిందు ; మూడేళ్ల గ్రూపులో యం. జి. ఎస్. ప్రవీణ్ 'పుట్టినరోజు బహుమతుల'కు ఎన్నికైనారు. నిర్ణయింపబడిన పై ముగ్గురితోపాటు, మొత్తం మీద మూడు గ్రూపులలోనూ ఆరోగ్యంగా కనిపిస్తున్న మరో ఇద్దర్ని ఎన్నిక చేసి విడిగా ప్రచురిస్తున్నాము. జనవరి సంచికలోని ఈ శీర్షికకు ఫొటోలు పంపే వారు - వివరాలతో సహా (ఫొటో తీయించిన తేదీ ముఖ్యంగా వుండాలి. ఫొటో వెనుక పెన్సిల్‌తో వివరాలు రాయాలి. ఫొటోలు 'క్వార్టర్' సైజుకు తక్కువ సైజులో వుండకూడదు. తిప్పి పంపడానికి తగినన్ని తపాలా బిళ్లలు గల కవరు జతపరచాలి.) డిసెంబర్ 5 వ తేదీలోగా మాకు చేరేలా పంప గోరుతున్నాము.

వి. ప్రశాంత్ (మహబూబాబాద్) పుట్టిన తేది : 31-12-78 తల్లి పేరు : వి. ధనమ్మ



పి. ధీరేంద్ర (వెల్లూరు) పుట్టిన తేది : 2-12-78 తల్లి పేరు : పి. సరయు



మిరమిట్లు గొల్పే తెలుపు
చూడగానే అందరి నోట ఒకే మాట...

ఇది తప్పక

# డెట్

డిటర్జెంట్ బిళ్ల వుతుకే




Shilpi DM 35A/78 Tel



# బామ్మగారి పేజీ

చేతిలో వుండే రేఖలు చూసి, ఆ వ్యక్తి గుణగణాలూ, మంచిచెడ్డలూ ఎలా చెబుతారు? అవి ఎలా తెలుస్తాయి? అని చాలామందిమి ఆశ్చర్యపోతూ వుంటాము. అయితే, అవన్నీ నిజంగా జరుగుతాయా, జరగవా అన్న ఆలోచన అలా వుంచి— అసలు చేతిలో వున్న రేఖలు చూస్తే ఎలా తెలుస్తుంది? అన్నది వింతే గదర్రా.

ఇలా, చేతిరేఖల్ని చూసి చెప్పడం అన్నది శాస్త్రం. అతి పురాతనమైన శాస్త్రం. ఈ శాస్త్రాన్ని చాలామంది చదువుకున్నారు; ఆ శాస్త్ర ప్రకారం, జోస్యం చెబుతూ వుంటారు. అయితే, ఈ శాస్త్రం ఎంతవరకూ నిజం? దానికి ఆధారాలు ఏమిటి? అని ప్రశ్న వేస్తే - నేనేం సమాధానం చెప్పలేనుగాని, జరుగుతున్నవి జరుగుతూనే వున్నాయి; నమ్మకం వున్నవాళ్ళు నమ్ముతూనే వున్నారు. ఈ హస్త సాముద్రికాలూ, జాతక చక్రాలూ చూడడం, చూపించుకోడం అన్నది మన జీవితాల్లో బాగా పరిపాటయిపోయింది.

ఏదైనా నమ్మకం మీదనే ఆధారపడి వుంటుందర్రా. పెళ్ళికి ముహూర్తాలు పెడుతున్నారు సిద్ధాంతులు. మనం నమ్మి ఆ గడియల్లో పెళ్ళి జరిపిస్తున్నామా లేదా? 'ఫలానా రోజు మంచి రోజు' అంటే నమ్ముతున్నామా లేదా? బిడ్డ పుట్టగానే 'జాతకం' రాయిస్తున్నామా లేదా? నమ్మని వాళ్ళకి ఏమీలేదు. నమ్మితేనే ఏదయినానూ. దేవుడిని నమ్మేవాళ్ళు కొందరైతే, నమ్మనివాళ్ళు కొందరుంటారు చూశారా – అలాగే, జాతకాల్నీ జోస్యాల్నీ నమ్మనివాళ్ళు కూడా వుంటారు. నమ్మడం, నమ్మకపోవడం మీద చర్చకాదు గాని, అసలు ఈ శాస్త్రం ఏమిటి? ఎలా వుంటుంది? తెలుసుకోవాలని ఎవరికైనా వుంటుంది గదా. అదే చెబుదామని.

హస్త సాముద్రికం లాగే, అంగ సాముద్రికం అని కూడా వుంది. అంటే, శరీరంలోని అంగాల్ని, వాటి మీద వుండే రేఖల్నీ చూసి, చెప్పడం అన్న మాట....'సాముద్రికం' అంటే ఏమిటి? లక్షణాలను చెప్పడం.

మామూలుగా మనం – చక్కని అమ్మాయిని చూశాం అనుకోండి, ''ఆహా! చక్కగా వుంది. లక్ష్మీ కళ వుట్టిపడుతోంది'' అంటాం. అంటే, 'ఆమె మంచిజాతకురాలవుతుంది; హాయిగా జీవిస్తుంది' అని మనమే చెప్పగలుగుతున్నాం అన్న మాట. ''వాడిమొహం చూస్తే తెలియడం లేదూ? దౌర్భాగ్యుడు!'' అని కొందరు పెద్దవాళ్ళు ఒక్కొక్కళ్ళ గురించి, విసుక్కుంటూ వుంటారు. అలా - ముఖ లక్షణాలే, వారి వారి మంచి చెడ్డల్ని చెబుతాయి.

మరి వాటిలోనే వివరాలున్నాయి. వాటిని శాస్త్రం చెబుతుంది. 'చంద్రుడిలాంటి ముఖం, తామరరేకుల లాంటి కళ్ళు, దొండపండులాంటి పెదవులు....' అంటూ 'ఉత్తమ స్త్రీ'ని కవులు వర్ణిస్తారు. అలా అన్నీ తీర్చిదిద్దినట్టు వున్న స్త్రీ - చాలా చాలా గొప్పది అవుతుందనీ, ఉత్తమురాలవుతుందనీ అంటారు. అలాగే, లక్షణాలు సరిగ్గా లేకపోతే, తొందరగా విధవ అవుతుందనో, జారిణి అవుతుందనో, గయ్యాళి అవుతుందనో చెబుతారు. వాటి వివరాల గురించి కావాలంటే - అవి ఇంకోసారి ఎప్పుడైనా చెబుతాను.

శాస్త్ర ప్రకారం - పురుషులకు కుడిచేతిని, స్త్రీలకి ఎడమ చేతినీ చూస్తారు; చూడాలి. చేతిలో వుండే రేఖలకి, రేఖలనిబట్టి పేర్లున్నాయి.

బొటన వేలికి, చేతికి మధ్య - బొటనవేలి మూల నుంచి, చూపుడు వేలు కిందవరకూ పొడవుగా ఒక రేఖ వుంటుంది. పేన్ని 'పురుషరేఖ' అంటారు. దాని కింద చేతి మూల నుంచి, అరచేతి నిండా వుంటూ, వాయవ్య మూలనుంచి, ఆగ్నేయ మూలవరకూ - 'స్త్రీ సీమాంతరేఖ' అన్నది వ్యాపించి వుంటుంది. ఈ రేఖ భార్యకి చెందిన రేఖ. ఈ రేఖల రెండు కొనలూ, బొటనవేలికీ, చూపుడు వేలికీ మధ్యగా చేరి వుంటాయి. ఇలా గనక - ఆ రేఖలు వుంటే, వాళ్ల దాంపత్యం 'అనుకూలమైన దాంపత్యం' అని శాస్త్రం. ఆ రెండు రేఖలూ విడివిడిగా వుండిపోతే, భార్యా భర్తల మధ్య అనుకూలత వుండదన్నమాట. ఇంకోటుంది - పురుష రేఖ కొస, స్త్రీ రేఖ కొసతో కలిసి – ముందుకు మరింత పొడుగ్గా వెళ్ళి వున్నట్టయితే - వాళ్ళకి పురుష సంతానం ఎక్కువగా వుంటుంది.

ఇక చేతిలో ఆయుష్య రేఖ, ధన రేఖ అని మరో ముఖ్యమైన రెండు రేఖలుంటాయి. ఎడమ చెయ్యి పిడికిలి మూస్తే - చేతికి కుడివేపు నుంచి ఒక రేఖ అడ్డంగా బయల్దేరి, మధ్య వేలుకీ, చూపుడు వేలుకీ మధ్యలో ఆగుతుంది. అది ఆయుష్య రేఖ. ఈ రేఖ మధ్యలో 'కోత'లు లేకుండా, సక్రమంగా వున్నట్టయితే - పూర్ణాయుర్దాయం గల వాళ్ళవుతారు. అంటే, నూరు సంవత్సరాల వరకూ జీవిస్తారని చెబుతారు. సగానికి పైగా వెళ్ళి ఆగిపోతే, అరవై ఏళ్ళు, చిటికెన వేలుకి సమంగా వుంటూ – ముక్కలయినట్టుగా వుంటే ఆయువు 15, 16 ఏళ్లు మాత్రమేనని - చెబుతారు. ఆ రేఖ పొడుగ్గా వున్నా సరే, మధ్యలో ఖండాలు వుంటే - రోగాలు ఎక్కువగా వస్తాయనీ, ప్రాణగండాలు కలుగుతాయనీ అర్థం. అరచేతి మధ్యలో- మణికట్టు ప్రాంతాల నుంచి బయల్దేరి ఒక రేఖ - చూపుడు వేలికీ, మధ్య వేలుకీ మధ్యలో ఆగుతుంది. ఇది - ధనరేఖ. ఈ రేఖ నిండుగా, పొడుగ్గా వున్నట్టయితే ఆ వ్యక్తి ధనవంతురాలవుతుంది. ఆ రేఖను చీలుస్తూ, అడ్డంగా 'కత్తెర రేఖలు' గనక వున్నట్టయితే - డబ్బు వస్తున్నా - పోతూ వుంటుంది. ఈ రేఖ మరీ చిన్నదిగా వున్నా - లేకపోయినా – అలాంటి వాళ్ళకి జీవనమే చాలా కష్టమవుతుంది.

ఈ రేఖలు ముఖ్యమైన రేఖలు. ఇవి కాకుండా మరికొన్ని రేఖల కూడా వుంటాయి. వాటికి వేరే పేర్లు, ఫలితాలూ వున్నాయి. అయితే, కొన్ని రేఖలు మొదట్లో వుంటాయి - వయసు వస్తున్న కొద్దీ పోతాయి; కొన్ని మధ్యకాలంలో పుడతాయి; కొంతకాలానికి మాసిపోతాయి. కొన్ని రేఖలు మధ్య కాలంలో పుట్టి - బ్రతికి వున్నంతవరకూ వుంటాయి. ఈ రేఖలన్నీ స్పష్టంగా వుంటే - పూర్ణఫలం, లేకపోతే స్వల్ప ఫలం అని భావించుకుంటూ వుండాలి.

మరి, వీటిమీద మీకేమైనా సందేహాలుంటే అడగండి - చెబుతాను. ఇంకా మరికొన్ని విశేషాలున్నాయి — అవి తర్వాత మరోసారి చెబుతానర్రా. □

# నేరస్థుల కథలు





గౌరాపంత్ శివాని

1

నేరస్థుల కథలు సేకరించడానికి నేను లక్నో వెళ్లి అక్కడ బసచేసినప్పుడు_నాకు రెండు ఆహ్వానాలు వచ్చాయి.

మొదటి ఆహ్వానం_ఒక క్లబ్‌లో జరిగిన ఘనమైన పార్టీ. ఆ పార్టీ ఏర్పాటు చేసినవారు, ఆహ్వానితులు....అందరూ మహిళలే.

ఖరీదైన చీరెలు, చిత్ర విచిత్రమైన అలంకరణలతో వాళ్లు నవ్వుతూ, తుళ్లుతూ, హడావుడిగా అటూ యిటూ తిరుగుతున్నారు. మధ్య మధ్య కొందరు తాము కొత్తగా కొన్న వస్తువులను గురించి ముచ్చటించుకుంటూ, కొనబోయే వస్తువులను గురించి చర్చిస్తూ, తమ భర్తల గొప్పదనం గురించి చెప్పుకుంటూ_ఆనందిస్తున్నారు.

రంగురంగుల దీపాలలో, తారల్లా మెరుస్తున్న ఆ వనితలను చూస్తున్నప్పుడు, మత్తెక్కించే సుగంధద్రవ్యాల పరిమళం వాళ్ల దగ్గరనుంచి వచ్చి నన్ను తాకినప్పుడు, దిగులు భాష తెలియని ఆ చిలుకలు నా చేత మాట్లాడించినప్పుడు – నేను ఎక్కడో మరో లోకంలో వున్న అనుభూతి కలిగింది!

ఇక రెండో ఆహ్వానం....ఆ రోజు....ఈ పార్టీ వాతావరణానికి పూర్తిగా భిన్నమైన వాతావరణంలోకి అడుగుపెట్టాను.

నగరానికి దూరంగా, అరణ్యంలో వున్న ఒక కోటలా వుంది ఆ జైలు. మధ్యమధ్య పక్షుల అరుపులే తప్ప యింకేమీ వినిపించడం లేదు.

ఎత్తైన ఆ ఇనుప తలుపులు దాటి, జైలు లోపలికి వెళ్తున్నప్పుడు....జైలు దుస్తులలో వున్న కొందరు స్త్రీ నేరస్థులు ఏవో చిల్లరమల్లర పనులు చేస్తూ వుండడం చూశాను.

వాళ్లలో ఏ ఒక్కరి ముఖంలోను వెలుగురేఖలు కనిపించలేదు. అందరూ శోకదేవతల్లా, దారి తప్పి, చీకటిలోంచి, చీకటి వైపుగా పయనిస్తున్న బాటసారుల్లా వున్నారు.

జైలుకు సంబంధించిన అధికారులతో మాట్లాడి, జైలు సూపర్నెంటును, అక్కడే వున్న ఒక లేడీ డాక్టరును కలుసుకున్నాను. మాటల సందర్భంలో ఆ జైలు సూపర్నెంటు రచయిత్రి అన్న సంగతి తెలుసుకుని సంతోషించాను. లేడీ డాక్టరు "మనుష్యులలో నేరప్రవృత్తి ఎలా ఏర్పడుతోంది?" అన్న విషయంపై 'రీసెర్చి' చేస్తున్నారట. ఆమెకు ప్రతి ఖైదీ జీవిత చరిత్రా క్షుణ్ణంగా తెలుసు. ఈ యిద్దరి సహకారంతో అక్కడి నేరస్థులను పరిచయం చేసుకోవడం తేలికే అయింది.

ఆ నేరస్థులలో_సాధారణ నేరాలు చేసినవాళ్లు ఎవరూ లేరు. తీవ్రమైన నేరాలు చేసి, యావజ్జీవ కారాగార శిక్షలు అనుభవిస్తున్నవారే ఎక్కువమంది వున్నారు.

మొట్టమొదట ఆ జైలంతా ఒకసారి తిరిగి చూశాను. ఎక్కడ చూసినా భయంకరమైన నిస్తబ్దత....జీవచ్ఛవాలలా తిరిగే నేరస్థులు.... వయసులో వున్న స్త్రీలలో వృద్ధాప్యపు ఛాయలు కనిపిస్తున్నాయి. వాళ్లు పరిశుభ్రంగా వుండడానికి అవకాశాలు వున్నాయేకాని ఎలాంటి అలంకరణ చేసుకోడానికి అక్కడ సదుపాయాలు లేవు.

ఆఖరుకు ముఖం చూసుకోడానికి అద్దం కూడా లేదు. అద్దం లేకపోవడం కూడా నేరస్థులకు కఠినమైన శిక్షల్లో ఒక భాగమేనని అనిపించింది. ఐతే, స్త్రీకి సహజంగా అలంకరణపై వుండే ఆసక్తి వాళ్లలో పూర్తిగా చావలేదు. అందువల్లే కాలిన కట్టెలు, బొగ్గుల మసిని వాళ్లు కాటుకగా పెట్టుకున్నారు. తోటలో పూచే గులాబీ రేకులను నలిపి, ముద్దగా చేసి, దాన్ని ఎర్ర బొట్టుగా పెట్టుకుంటున్నారు. కుండలు, బకెట్లలో నీళ్లు పట్టి, అందులో కనిపించే తమ ప్రతిబింబాలను అద్దాలుగా చేసుకుంటున్నారు.

నేను ఒక వంటగదిలోకి వెళ్లేసరికి ఒక యువతి బకెట్ నీళ్లలో తన ప్రతిబింబాన్ని చూసుకుంటోంది. నన్ను చూడగానే, బకెట్ అక్కడ పడేసి, మరో పక్కకు పరుగుతీసింది.

ఆ ఖైదీల అమాయకమైన ముఖాలు చూసినప్పుడు, అక్కడి క్రమశిక్షణకు తలవగ్గి, యాంత్రికంగా జీవితభారాన్ని కొనసాగిస్తున్న వాళ్ల జీవిత విధానాన్ని చూసినప్పుడు ఎంతో జాలి కలుగుతుంది. 'వీళ్లు నిజంగా అంత ఘోరమైన నేరాలు చేసి వుంటారా?' అన్న అనుమానం కూడా ఏర్పడుతుంది.

కాని, నిజాలను ఎలా కాదనగలం....! ప్రియుడి కోసం భర్తను హత్యచేసినవాళ్లు, కోడళ్లను వున్న పళంగా మంటలపాలు చేసిన అత్తలు, భ్రూణ హత్యలు చేసినవాళ్లు, అమాయకమైన వనితలను మోసంచేసి ఎక్కడికో తీసుకుపోయి అమ్మేసిన వాళ్లు, భయంకరమైన దోపిడీలు చేసినవాళ్లు....ఇలా ఎంతోమంది వాళ్లలో వున్నారు.

వాళ్లగురించి, వాళ్ల నేరాలు గురించి వింటుంటే, నా ఒళ్లు గగుర్పొడిచింది.

అక్కడక్కడా గోడలపైన 'రఘుపతి రాఘవ రాజారాం....పతిత పావన సీతారాం' అని రాసి వుంది. బహుశా ఆ మాటలే వాళ్లకు కాస్త మానసిక ప్రశాంతతను కలిగిస్తాయేమో!

నేను అక్కడికి వచ్చిన సందర్భంగా ఆ రోజు ప్రత్యేకమైన వంటలు చేసి, భోజనాలు ఏర్పాటు చేశారు. నేను వాళ్లతోపాటే, భోజనం చేశాను. అక్కడున్న ఆడఖైదీలే వంట చేసినట్లు లేడీ డాక్టరు చెప్పారు. పదార్థాలన్నీ ఎంత రుచికరంగా వున్నాయంటే, భయంకరమైన హత్యలు చేసిన వాళ్లు ఇంత మధురంగా వంటలు చేయగలగడం నా కెంతో విస్మయాన్ని కలిగించింది.

నేను భోజనం చేస్తుంటే, ఒక ఖైదీ విసనకర్ర పట్టుకుని, కొంతసేపు విసిరింది. ఆమె పేరు హీరా. వయసు 58 సంవత్సరాలట.

"మొన్న ఆగస్టు 15న మా జైల్లో కొన్ని ప్రోగ్రామ్స్ జరిగాయి. వాటిలో హీరా డాన్సు ఒకటి. ఇరవైయేళ్ల అమ్మాయిలా ఎంత అద్భుతంగా నాట్యం చేసిందనుకున్నారు. మీరు చూసి వుంటే, దిగ్భ్రమ చెందివుండేవారు!" అన్నారు లేడీ డాక్టరు. ఆమె 'ఎంబ్రాయిడరీ' కూడా చాలా అద్భుతంగా చేస్తుందని చెప్పారు. ఆమె చేసిన అల్లికపని చూసిన తర్వాత, ఆమెలోని కళా హృదయాన్ని ప్రశంసించకుండా వుండలేక పోయాను.

హీరా నన్నెంతో పూజ్యభావంతో చూసింది. వద్దంటున్నకొద్దీ నాకు మరిన్ని పూరీలు వేసి, బలవంతంగా నా చేత తినిపించింది. ఆమె ధోరణి చాలా అమాయకంగా వుంది. ముడతలు పడ్డ ఆమె మొహంలో ఒక విచిత్రమైన కాంతి నన్ను విశేషంగా ఆకర్షించింది.

హీరా అక్కడున్న వారందరి ఆదరాభిమానాలు చూరగొన్న ఖైదీ అన్న సంగతి కొద్దిసేపట్లోనే నాకు అర్థమైంది.



సాహిణీ మధులత

పదమూడు సంవత్సరాల సాహిణీ మధులత- శ్రీకాకుళంలో తొమ్మిదో తరగతి చదువుతున్నది. మధులత భరతనాట్యం, జానపద నృత్యాలూ నేర్చుకుని, ప్రావీణ్యత సంపాదించి, ప్రదర్శనలు కూడా ఇస్తున్నది. పాట పాడడంలో కూడా ఆమెకు ఉత్సాహం వున్నది; చక్కగా పాడుతుంది. ఆంధ్రప్రదేశ్ బాలల అకాడెమీ ఈ మధ్య రాష్ట్ర స్థాయిలో జరిపిన నాట్య ప్రదర్శన పోటీలలో (హైద్రాబాదు) మధులత పాల్గొని, జానపద నృత్యం సీనియర్ విభాగంలో-ప్రథమ స్థానం పొందింది! ప్రతిభాపాటవ పోటీలలో కూడా పాల్గొని, 'ప్రతిభా పత్రం' కూడా అందుకున్నది. మధులత భారత్ స్కౌట్స్ అండ్ గైడ్స్‌లో కూడా పాల్గొంటుంది - ఆ మధ్య జరిగిన 'జంబూరీ'లో, ఆమెకు ప్రశంసా పత్రం లభించింది! మధులత తండ్రిగారు ఎస్. భాస్కర రావు శ్రీకాకుళంలో న్యాయవాదిగా వుంటున్నారు.

—టి.వి

భోజనం అయిన తర్వాత నేను చిన్నపిల్లనైనట్లు, పంపు దగ్గర నా చేతులు తనే కడిగింది. అలా కడుగుతూ, వున్నట్టుండి, ఆ నీళ్లు తాగేసింది. నేను నివ్వెరపోయి "ఛీ....ఛీ....ఇదేమిటి?" అన్నాను మందలిస్తున్న ధోరణిలో....

"అమ్మా....నా తలపై ఒక పెద్ద పాపపుమూట వుంది. నీ వంటి ఉత్తముల ఎంగిలినీళ్లు నా వంటి వాళ్లకు గంగాజలంలా పవిత్రతను చేకూర్చుతాయి. అందుకే తాగాను. మరేమీ అనుకోకమ్మా" అన్నది హీరా.

ఆ తర్వాత లేడీ డాక్టరు-హీరా గురించి చెప్పింది.

ఆమెకు ఒక కొడుకు. పెళ్లయిన కొన్నాళ్లకు కోడలి ప్రవర్తన సరిగ్గా లేదన్న అనుమానం వచ్చింది. దాంతో కొడుకు సహాయంతో, కోడలిని సజీవ దహనానికి గురిచేసింది.

కొడుక్కి వురిశిక్ష పడింది. హీరాకు అంతకంటే భయంకరమైనది-యావజ్జీవ కారాగారవాసం!

తన ఒక్కగానొక్క కొడుకును తనే వురి తీసి చంపినట్లుగా ఆ జ్ఞాపకాలు ఆమెను అనుక్షణం చిత్రవధ చేస్తుంటాయి. ఆమె ఎన్ని సంవత్సరాలు అలా ఆ శిక్షను అనుభవించాలో....

"బందిపోటు దొంగతనాలు, దారుణమైన హత్యలు చేయించిన ఒక నేరస్థురాలి దగ్గరకు మనం ఇప్పుడు వెళ్తున్నాము...." అన్నారు లేడీ డాక్టరు-ఒక 'సెల్' వైపుగా నన్ను తీసుకు వెళ్తూ. నేను మౌనంగా ఆమెను అనుసరించాను.

ఆమెకు వయసు 40 సంవత్సరాలు వుంటుంది. చూడ్డానికి చాలా అందంగా వుంది. 'వయసులో వున్నప్పుడు ఇంకా అందంగా వుండివుంటుంది' అని అనిపించేలా వుంది ఆమె సౌందర్యం.

మమ్మల్ని చూడగానే మొహం చిట్లించుకుని, తల తిప్పుకుంది. ఆమె చూపులు చాలా వాడిగా వున్నాయి. కోపంతో ఉన్న పెద్దపులిలా వుంది ఆమె వాలకం!

"ఈమెకు పెద్ద పెద్ద బందిపోటు దొంగలతో సంబంధం వుంది. తన అందాన్ని ఎరగా చూపి, వాళ్లచేత ఎన్నో దొంగతనాలు, దోపిడీలు చేయించింది. తను స్వయంగా కొన్ని దోపిడీలు చేసింది. ఎన్నో కుటుంబాలు ఈమె వల్ల సర్వనాశనం అయ్యాయి. ఇప్పుడు యావజ్జీవ కారాగారవాస శిక్ష అనుభవిస్తున్నా ఈమె అందాన్ని ఆరాధించేవారు యింకా కొందరు వున్నారు. ఈ మధ్యనే సుదర్శన్ ఠాకూర్ అనే యువకుడు ఈమెను కలుసుకోడానికి వచ్చి, రకరకాల స్వీట్స్ దగ్గరుండి తినిపించి మరీ వెళ్లాడు. అలా అప్పుడప్పుడు కొందరు వస్తుంటారు" అన్నారు లేడీ డాక్టరు.

ఆ సౌందర్యం వెనుక ఇంతటి క్రూరత్వం వుండడం నాకు దిగ్భ్రమ కలిగించింది. ఆమె చేసిన అత్యాచారాలు వింటుంటే, ఒక పఠాను చేసిన ఘాతుకం జ్ఞాపకం వచ్చింది. ఈ సంఘటన ఇటీవలే జరిగింది.

సాధారణంగా కొందరు పఠానుల దగ్గర ఒక లాఠీ లాంటి చేతికర్ర వుంటుంది. దానిలోపల ఒక

కత్తి కూడా వుంటుంది. ఈ పఠాను దగ్గర అటువంటిదే ఒకటి వుంది. అతను రైల్లో ప్రయాణం చేస్తున్నప్పుడు, టిక్కెట్టు ఎక్జామినర్ అందరినీ అడిగినట్లే, అతన్నీ టిక్కెట్టు చూపించమని అడిగాడట. "నన్ను టిక్కెట్టు చూపించమని అడగడానికి నీ కెంత ధైర్యం" అని కత్తి తీసి, అలాగే అతన్ని పొడిచి, చంపి, రైలు ఆగగానే దిగి వెళ్లిపోయాడట. ఈ దొంగలరాణిని చూసినప్పుడు ఆ పఠాను సంగతే నాకు జ్ఞాపకం వచ్చింది!

"ఇలాంటి క్రూరమైన నేరస్థులను యిక్కడ విడిగా వుంచినా, ఏదో ఒక సందర్భంలో ఒకరికొకరు ఎదురౌతూనే కలిసి వుంటారు కదా.... అప్పుడు వాళ్లు సఖ్యంగానే వుంటారా లేక వాళ్లలోని నేర ప్రవృత్తి కారణంగా ఘర్షణపడడం అదీ జరుగుతూ వుంటుందా?" అని లేడీ డాక్టర్‌ను అడిగాను.

"చాలామంది నేరస్థులు-తాము చేసిన ఘోరాలకు పశ్చాత్తాపంతో బాధపడుతూ వుంటారు. ఘర్షణపడే సంఘటనలు చాలా అరుదుగా జరుగుతూ వుంటాయి. ఈ మధ్యే యిద్దరు నేరస్థులు ఒకరినొకరు చంపుకునేంత పనిచేశారు. దాంతో ఆ యిద్దరిలో ఒకరిని-వేరే జైలుకు మార్పించవలసి వచ్చింది. అది చాలా విషాదకరమైన కథ" అంటూ-వాళ్ల గురించి చెప్పిందామె.

ఆ కుటుంబంలో ఇద్దరు అన్నదమ్ములు. అన్న చేసే ఉద్యోగానికి ఎక్కువ రాబడి వచ్చేదికాదు. అంచేత రోజు గడవడమే కష్టంగా వుండేది. అతని భార్యకు మరదిని చూసినా, అతని భార్యను చూసినా ఈర్ష్యగా వుండేది. కారణం-మరదికి ఎక్కువ ఆదాయం లభించేది. దాంతో అతను, అతని భార్యా ఎప్పుడూ కులాసాగా, దర్జాగా కాలం వెళ్లబుచ్చుతూ వుండేవారు.

మరది భార్య సంతోషంగా వుండడం చూసినప్పుడల్లా, తనను తన పేదరికాన్ని ఆమె హేళన చేస్తున్నట్లుగా వూహించుకునేది పెద్ద కోడలు. ఆమె పేదరికానికి తోడుగా ఒక మగపిల్లవాడు పుట్టాడు. భర్త కుటుంబాన్ని గురించి ఎక్కువగా పట్టించుకునేవాడు కాదు.

రోజురోజుకూ ఆమెకు తన తోటికోడలు పట్ల ఈర్ష్య ఎక్కువవుతూనే వచ్చింది. తనకు దక్కని సుఖసంతోషాలు ఆమెకు ఎందుకు దక్కాలన్న ఉక్రోషంతో ఒకరోజు ఏదో వంకతో పోట్లాట పెట్టుకుని, ఆమెను ఘోరంగా చంపేసింది. ఆమెకు వురిశిక్ష పడివుండేదేకాని, పసిపిల్లవాడి తల్లిగా ఆమె ఆ శిక్షను తప్పించుకుని, కఠిన కారాగారశిక్ష అనుభవించసాగింది.

జైలు నిబంధనల ప్రకారం ఆరేళ్ల తర్వాత ఆమె పిల్లవాణ్ణి తల్లి దగ్గర్నుంచి వాళ్ల ఇంటికి పంపించివేశారు. కొన్నాళ్ల తర్వాత మరది చనిపోయిన తన భార్య చెల్లెలినే పెళ్లి చేసుకున్నాడు. వదిన జైల్లో వుండడంతో, ఆమె కొడుకు సంరక్షణ భారాన్ని తన భార్యకే వప్పగించాడు.

ఆమె కూడా తల్లిలేని కొడుకని ఎంతో ప్రేమగా చూసుకొనేది. ఆ పసివాడు పినతల్లి ఆదరణలో తల్లిలేని లోటును పూర్తిగా మరచిపోయాడు.

కొంతకాలానికి భర్తను, పిల్లవాణ్ణి చూడడానికి 'పెరోల్' మీద ఆమె జైలు నుంచి యింటికి వచ్చింది. అప్పుడు ఆమె భర్త ఇంట్లో లేడు. మరదీ ఇంట్లో లేడు.

తోటికోడలు స్థానంలో తను హత్యచేసిన ఆమె చెల్లెలే కనిపించింది. ఆమె దగ్గరున్న తన కొడుకును-రమ్మని పిలిచింది. వాడు 'నువ్వెవరు?' అన్నట్లు చూశాడు. ఎంత బ్రతిమిలాడినా వాడు దగ్గరకు రాలేదు. కనీసం 'అమ్మా' అనైనా పిలవలేదు. దాంతో ఆమె హృదయం భగ్గుమంది.

"మిఠాయిలు....మందు....మాకూ పెట్టి లోబరచుకుని, నా కొడుకును నాకు కాకుండా చెయ్యాలనుకున్నావటే....జైలు నుంచి రాగానే చూడు....నిన్నేం చేస్తానో....నీ అక్కకు పట్టిన గతే నీకూ పడుతుంది!" అని కేకలు వేసి, బెదిరించి-వెళ్లిపోయింది.

'వీడుంటే, తనను చంపేస్తుంది. వీడు పోతే, ఆమె పీడ విరగడవుతుందని' ముందూ వెనుకా ఆలోచించకుండా, అంతకాలం ప్రేమగా పెంచిన ఆ కుర్రవాణ్ణి, ఆ చిన్న కోడలే దారుణంగా హత్య చేసింది. ఎంత దాచడానికి ప్రయత్నించినా, ఆమె నేరం దాగలేదు. ఫలితంగా ఆమెకూ యావజ్జీవ కారాగారవాస శిక్ష పడింది.

విధి ఎంత బలీయమైనదంటే, పిల్లవాణ్ణి చంపిన చిన్నకోడలు, ఆమె అక్కను చంపి యావజ్జీవ కారాగారవాసం అనుభవిస్తున్న పెద్దకోడలు-ఇద్దరూ ఒకే జైల్లో వుండవలసి వచ్చింది.

పిల్లవాణ్ణి హత్యచేస్తుంటే, వాడు ఎలా బాధపడ్డాడో ఏమో....అర్ధరాత్రి ఆమె గభాలున లేచి "బాబూ....బాబూ..." అని అరుస్తూ వుంటుంది. "నాకు వురిశిక్ష వెయ్యండీ....నన్ను చంపెయ్యండి" అని కేకలు పెడుతుంది.

వీళ్లిద్దరు ఒకరికొకరు ఎదురైనప్పుడు-తాము చేసిన నేరాలు మళ్లీ మళ్లీ జ్ఞాపకానికి వచ్చేవి. అంతే....ఇద్దరూ ఒకరినొకరు తిట్టుకొని, కొట్టుకోడానికి ప్రయత్నించేవారు. ఒకరోజు పరిస్థితి విషమించేసరికి, పెద్దకోడలిని 'నైనీ' జైలుకు పంపించివేశారు.

ఇదీ ఆ లేడీ డాక్టరు చెప్పిన కథ. హృదయవిదారకమైన ఆ కథ విన్నతర్వాత నా మెదడు మొద్దుబారినట్లయిపోయింది!

"మీ ప్రాంతానికి చెందిన నేరస్థురాలు ఒకామె వున్నారు. ఆమె దగ్గరకు వెళ్దాం పదండి" అన్నారు ఆ లేడీ డాక్టరు.

ఏదో ఆలోచిస్తూ అలాగే ఉండిపోయిన నేను ఆమె మాటలకు ఉలిక్కిపడి, నా మనసులో చెలరేగిన కల్లోలాన్ని అణచుకుంటూ ఆమెను అనుసరించాను.





ఈ మధ్య గోవాలో ఒక ఇరవైనాలుగేళ్ళ యువతి ఒక వింత శిక్షకు గురైంది. ఆమె భర్త ఒక నావికుడు. అప్పుడప్పుడు సంవత్సరాల తరబడి ఓడలలో తిరుగుతూ వుంటాడు. అతను పని చేస్తున్న కంపెనీవారు అతని జీతంలో చాలామటుకు స్థానిక బ్యాంకులో జమ చేస్తున్నారు. ఆ ఎక్కవుంట్ అతని భార్య పేరు మీద కూడా వుంది. ఆ నావికుడు సెలవు మీద యింటికి వచ్చాడు. డబ్బు మంచినీళ్ళ ప్రాయంగా ఖర్చు పెడుతున్న భార్యని చూసి గుండెలు బాదుకుంటూ బ్యాంకుకి పరుగెత్తాడు. ఏముంది....అందులో అతను మొదట ఎక్కవుంట్ ప్రారంభించిన ఐదు రూపాయలు మాత్రమే వుంది. వేలకివేలు హరించుకుపోయాయి. దాంతో కోపం పట్టలేని ఆ నావికుడు తన భార్య రెండు చేతులూ వెనక్కి మడిచి కట్టి గోవా మార్కెట్‌లోని వీధులలో నడిపించాడట.

"మేడమ్ కల్పనా! మీరు ఏమంటున్నారో నాకు అర్థంకావడంలేదు. విడమర్చి చెప్పండి.''

"ఇంతకాలంగా నా మనసును కప్పేసిన మబ్బులు విడిపోయాయి. నీ వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోలేకపోయాను. నన్ను ఉంపుడుగత్తె అని ఎందుకు అన్నావో, నీ మనసు ఎంత లోతుగా గాయపడడం వల్ల అన్నావో నాకు అర్థం అవుతున్నది. ఇప్పుడు నువ్వు నాకిచ్చిన స్థానాన్ని పొందడానికి ప్రయత్నిస్తున్నాను.''

సిద్ధార్థ ఘొల్లున నవ్వాడు.

"అలా నవ్వకు. నీకు మన మొదటి రాత్రి గుర్తుందా?''

"లేదు.'' ఖచ్చితంగా అన్నాడు.

"కాని నాకు గుర్తుంది. ఆ రోజు నువ్వు...."

"నాకు వినాలని లేదు.''

"నాకు చెప్పాలని ఉంది.''

"ఆడవాళ్లు గతంలో బ్రతుకుతారు.''

"రెండేళ్లు చాలా త్వరగా గడిచిపోయాయి గదూ?''

"సుఖస్వప్నంలాగానా?'' వ్యంగ్యంగా అన్నాడు.

"అవును.''

"నాకు మాత్రం దుఃస్వప్నంలాగా గడిచాయి. ఈ రెండేళ్ళూ రెండువందల ఏళ్ళలా గడిచాయి.''

భర్త ముఖంలోకి కల్పన జాలిగా చూసింది.

"నన్ను చూసి జాలిపడుతున్నావా?'' వ్యంగ్యంగా అన్నాడు.

"నువ్వు అనేవాడివి....'' ఆలోచిస్తూ శూన్యంలోకి చూస్తూ ఆగిపోయింది.

"ఏమని?''

"నేను అందని ఆకాశం కేసి చూస్తూ, ఎగరడానికి ప్రయత్నిస్తున్నానని....''

"అయితే ఇప్పుడు ఏమంటావ్? నువ్వూ నాలాగే నేల మీద బతికే అతి మామూలు మనిషిని అని అంగీకరిస్తున్నావా? నువ్వు కవయిత్రివి. రచయిత్రివి. అవకాశం ఉంటే గొప్ప నటీమణివి కాగలవు. హిమాలయం అంత ఎత్తయిన ప్రేమను ప్రేమించినదానివి.''

"అందని ఆకాశం కేసి ఎగరడానికి ప్రయత్నించి కింద పడ్డాను. రెక్కలు తెగిన పక్షిలా నేల మీద పడ్డాను. గాయపడ్డాను.''

"రవీంద్ర నీ రెక్కల్ని విరిచేశాడా?''

"ఒకరు విరిచేది ఏమిటి? నా తెలివితక్కువ వల్ల నా రెక్కల్ని నేనే విరుచుకున్నాను. నన్ను నేనే గాయపర్చుకున్నాను.''

"చాలా పెద్ద జ్ఞానోదయమే అయింది.''

"ప్లీజ్! ఈ రాత్రికి నన్ను టీజ్ చెయ్యకు.''

"ఇంతకాలం నన్ను టీజ్ చేశావ్? ఈ రాత్రి గడిస్తే నువ్వు ఎవరో నేను ఎవర్నో. ఆ తర్వాత నిన్ను టీజ్ చేసే అవకాశం ఉండదు."

"ఈ రాత్రి మీతో అర్థంలేని వాదనతో కాలం గడపడం నాకు ఇష్టంలేదు.''

"కర్మకాలి శోభనం రోజులా మంచం అలంకరించబోతున్నావా?''

"ప్లీజ్! సిద్ధార్థా! అలా మాట్లాడకు. ఈ ఒక్క రాత్రికి అలా మాట్లాడకు! నేను భరించలేను.''

సిద్ధార్థ గడియారం చూసుకున్నాడు.

"నేను జరిగినదానికి సిగ్గుపడుతున్నాను.''

"అందుకు నన్నేంచెయ్యమంటావ్?"

"క్షమించమంటాను.''

"అది నేను చెయ్యలేని పని.''

# నింగినుండి నేలకు

## వాసిరెడ్డి సీతాదేవి

"నన్ను క్షమించలేవా?''

"ఊఁ హూ!''

"అంత క్షమించరాని అపరాధం చేశానా?"

"నువ్వేం చేశావో నీకు ఇంకా తెలియలేదంటే నీకు పూర్తి జ్ఞానోదయం కలగలేదన్న మాట.''

"నేను కులటను కాదే!''

"అలాగని నేనూ అనలేదే!''

"మరి! క్షమించలేను అంటున్నావు!''

"ఆ మాట ఒక్కసారి కాదు. వందసార్లు అడిగినా అదేమాట అంటాను.''

కల్పన కళ్లలో నీరు తిరిగింది.

ఇతనిలో ఇంత కాఠిన్యం ఉన్నదా? నిజంగానే అంటున్నాడా? రేపు నిజంగా తనను లాయర్ దగ్గరకు తీసుకెళ్తాడా? అంతపని చెయ్యడు! ఊరికే తనను టీజ్ చేస్తున్నాడు. అంతే! అంతే! జారిపోతున్న గుండె ధైర్యాన్ని ఎగదోసుకోసాగింది.

"నేను ఆరునెలల క్రితమే స్పష్టంగా చెప్పాను.''

"ఏమని?''

"ఇంతవరకూ నా ప్రేమనే చూశావు. ఇక నా ద్వేషాన్ని చవిచూడబోతున్నావని.''

"నన్ను అంతగా ద్వేషిస్తున్నావా?''

సిద్ధార్థ సమాధానం ఇవ్వలేదు.

"మనం విడిపోతున్నందుకు నీకు బాధగా లేదా? నేను లేని లోటు నిన్ను బాధించదా?''

"నేను నీలా సెంటిమెంటల్ ఫూల్‌ను కాదు.''

"మా నాన్న అనేవారు.''

"ఏమని?''

"నాకు అజ్ఞానంతో కూడిన అహంకారం ఎక్కువని. అదే ఒకనాడు నా జీవితానికి గుదిబండగా మారుతుందని.''

"అలాగా?''

"ఇహ వాదన వద్దు. నేను భరించలేను. నన్ను సినిమాకు తీసుకెళ్ళు.''

"సరే! పద!''

## 20

సినిమా హాల్లో సిద్ధార్థ ఉత్సాహంగా కన్పించాడు. భార్య వద్దు అంటున్నా కూల్‌డ్రింక్స్ ఇప్పించాడు. సినిమా చూస్తూ హీరోయిన్ మీద జోక్స్ విసిరాడు.

కల్పనకు రిలీఫ్‌గా ఉన్నది.

పీడకల నుంచి మెలుకువ వచ్చినట్టు అనిపించసాగింది.

ఇద్దరూ కలిసి భోజనం చేశారు.

సిద్ధార్థ సినిమా గురించే మాట్లాడుతున్నాడు.

"నువ్వూ ఆ హీరోయిన్ కష్టాలు చూసి ఏడ్చావా?'' నవ్వుతూ అడిగాడు.

కల్పన నవ్వింది. ఆ నవ్వు హాయిగా ఉన్నది.

"మీ ఆడవాళ్ళకు ఎంతగా ఏడ్పిస్తే ఆ సినిమా అంత సక్సెస్‌ఫుల్ అవుతుందటగా ?"

"అలాగే అంటారు."

"హీరో హీరోయిన్‌ను అన్ని బాధలు పెట్టాడు గదా ? మరి హీరోయిన్‌ను హీరో క్షమించమని అడిగితే "యావండీ ! అంత మాట అనకండీ ! నన్నే క్షమించండి" అంటుందేం ? పిచ్చిముండ!" సిద్ధార్థ కల్పన ముఖంలోకి చూస్తూ అడిగాడు.

కల్పన మాట్లాడలేదు.

"మీ ఆడవాళ్ళకు నార్మల్‌గా ఉండటం రాదనుకుంటాను. అన్నీ ఎక్స్ట్రీమిటీసే ! ఉంటే పూర్తి బానిసత్వంలో లేకపోతే స్వతంత్రం పేరుతో విశృంఖలత్వంలో...."

కల్పన ఉలకలేదు పలకలేదు.

కల్పనకు భర్తతో పేచీ పడాలని లేదు. వాదించాలని అసలే లేదు.

"శేఖర్ బాగా యాక్టు చేశాడుకదూ ?"

"వాడి మొహం వాడికి అసలు యాక్టింగ్ అంటేనే తెలియదు."

కల్పన నవ్వింది.

మరోసారి అయితే భర్తతో వాదనకు దిగి ఉండేది.

ఇద్దరూ భోజనం చేశారు.

కల్పన వంటిల్లు సర్దుకుంటున్నది.

గదిలోకి వచ్చేసరికి సిద్ధార్థ ఏదో పుస్తకం చదువుతున్నాడు.

"ఏమిటా పుస్తకం ?"

"ఎయిర్‌పోర్టు చదివావా ?"

"లేదు."

"నువ్వు రచయిత్రివి. మంచి పుస్తకాలు చదవకపోతే ఎలా ?"

కాని ఈ రోజు ముఖ్యంగా సినిమాకు బయలుదేరినప్పటినుంచీ గాయపరచే మాట ఒక్కటి కూడా ఒక్కటి కూడా అనలేదు.

సిద్ధార్థ పుస్తకం మడిచి పక్కన పెట్టాడు.

లైటు తీశాడు.

భార్య కోసం చేతులు చాచాడు.

సిద్ధార్థ మంచి నిద్రలో ఉన్నాడు.

కల్పనకు నిద్ర రావడం లేదు. మనిషికి అతి దుఃఖంలో నిద్ర రాదు. ఆనందం అధికమైనా నిద్రరాదు.

కల్పన గతాన్ని గురించి ఆలోచించ సాగింది.

తను నిజంగానే చాలా ఫూలిష్‌గా ప్రవర్తించింది.

సిద్ధార్థ లాంటి వ్యక్తి తన భర్త కావడం తన అదృష్టం. అతని వ్యక్తిత్వం ఎంతమందికి ఉంటుంది ? రవీంద్ర ! వట్టి పరికిపంద ! రవీంద్రను నిన్న చూశాక తనెంత ఫూలో తనకు అర్థం అయింది. సిద్ధార్థ లాంటి భర్తను పొంది తను రవీంద్రలాంటి వ్యక్తిత్వం బొత్తిగా లేని మగవాడి కోసం నిట్టూర్పులు విడవడం ఏమిటి ?

కల్పనకు భర్త సమాధానం ఎంతో ఆనందాన్ని కలిగించింది.

రెండు రోజుల క్రితం ఇలాగే "ఏమిటా పుస్తకం" అని అడిగింది.

"నీకు నచ్చే పుస్తకం కాదులే !"

"అంటే !"

"ప్రేమకథ కాదు." అన్నాడు చాలా సీరియస్‌గా.

సిద్ధార్థ విశాలహృదయుడు. ఆత్మ స్థైర్యం గలవాడు. తను రవీంద్రను ప్రేమిస్తున్నదని తెలిసీ తనను వివాహం చేసుకున్నాడు. తన శ్రమల్ని తొలిగించగలననే ఆత్మధైర్యం అతనికి ఉంది కనుకనే తనను వివాహం చేసుకున్నాడు. తన ఫూలిష్‌నెస్ సహనంతో భరించాడు. తన తప్పుల్ని చిన్న పిల్లలు చేసే తప్పులుగా భావించి సరిదిద్దడానికి ప్రయత్నించాడు.

తను తెగిందాకా లాగింది. తమ మధ్య వున్న అనుబంధం పూర్తిగా తెగిపోయిందనే అనుకుంది. కాని .... పూర్తిగా తెగలేదు. చాలా సున్నితమైన పాయింటుకు వచ్చి ఆగిపోయింది.

అబ్బ! తనను ఎంత హడల్ గొట్టాడు.

నిజంగానే విడాకులు ఇస్తాడని భావించింది కొన్ని గంటల క్రితం వరకు.

నిద్ర పోతున్న భర్త ముఖంలోకి చూసింది.

అతని నల్లని జుట్టు నుదురు మీద పడుతున్నది. కల్పన చేతితో జుట్టును వెనక్కు సర్దింది. ఆ జుట్టులో వేళ్ళను దూర్చి కదిలిస్తూ ఆలోచనల్లో పడింది.

సిద్ధార్థ తృళ్ళిపడి లేచాడు.

కల్పన చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

"ఇంకా నిద్రపోలేదా?"

"ఊఁ హూఁ!"

"ఏం? దిగులుగా ఉందా?"

"ఆనందంగా ఉంది."

"నిద్రపో!" అంటూ గోడవైపుకు తిరిగి పడుకున్నాడు.

కల్పన ముసి ముసిగా నవ్వుకుంటూ వివాహం అయిన కొత్తలో తన భర్త చేసిన కొంటె చేష్టల్ని తల్చుకుంటూ పడుకుంది.

# 21

"కల్పనా! లే! లే!"

కల్పన తృళ్ళిపడి లేచింది.

భర్త ఎదురుగా నిల్చుని ఉన్నాడు.

తృళ్ళిపడి లేచి కూర్చుంది.

"టైమ్ ఎంత అయింది?"

"ఎనిమిది?"

"అరే! ఎనిమిదీ అయిందా?"

"రాత్రి ఆలస్యంగా నిద్ర పోయినట్టు ఉన్నావ్?"

"అవును!" అంటూ కల్పన పళ్ళు తోము కోవడానికి వెళ్ళింది. డైనింగ్ టేబుల్ ముందు కూర్చుని కాఫీ తాగింది.

భర్త గదిలోకి వచ్చింది. సిద్ధార్థ తాపీగా కూర్చుని సిగరెట్ కాలుస్తున్నాడు.

"స్నానం చేశారా?"

"ఆఁ!"

"టిఫెన్?"

"ఇంకా లేదు. నువ్వూ స్నానం చేసి రా ఇద్దరం కలిసే చేద్దాం!" అన్నాడు.

"మీకు ఆఫీసు టైం కావడం లేదూ!" అన్నది.

సాధారణంగా సిద్ధార్థ తొమ్మిదికి బయలు దేరతాడు.

"ఇవ్వాళ ఆఫీసుకు వెళ్ళడం లేదు."

"నిజంగా!" ఉత్సాహంగా అడిగింది కల్పన.

"అవును! నువ్వెళ్ళి స్నానం చేసిరా!"

కల్పన కూని రాగం తీస్తూ స్నానాల గదిలోకి వెళ్ళింది.

భర్తలో వచ్చిన మార్పుకు ఆశ్చర్యంగానూ ఉంది; ఆనందంగానూ ఉన్నది.

చాలా రోజులకు తమ జీవితాలను కమ్మేసిన మబ్బులు విచ్చిపోయాయి. హాయిగా ఈ రోజంతా ఇంట్లోనే కబుర్లు చెప్పుకుంటూ కూర్చోవాలి.

స్నానం చేసి వచ్చింది కల్పన.

ఇద్దరూ డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నారు. టిఫెన్ చేస్తున్నారు. కల్పన గలగల మాట్లాడుతున్నది. సిద్ధార్థ మాత్రం గంభీరంగా ఉన్నాడు.

మళ్ళీ ఇంతలోనే ఏమొచ్చింది? ఈ మధ్య ఈయనకు మూడ్సు కూడా ఎక్కువైనాయ్!

టిఫెన్ చేసి కూర్చున్న కల్పనతో "త్వరగా తయారవు." అన్నాడు సిద్ధార్థ.

కల్పన ప్రశ్నార్థకంగా భర్త ముఖంలోకి చూసింది.

"ఏమిటి అలా చూస్తున్నావ్?"

"మనం బయటికి వెళ్తున్నామా!"

"అవును! చెప్పానుగా మర్చిపోయావా?"

"నిజంగానే గుర్తులేదు. ఎవరింటికైనా వెళ్తున్నామా?"

"అవును!"

"ఎవరింటికి? రాజేంద్ర ఇంటికా?"

"కాదు. లాయర్ ఇంటికి."

కల్పన కణతకు కంకరరాయి తగిలినట్టు అయింది.

వెర్రి చూపులు చూస్తూ నిల్చునిపోయింది.

"అదేమిటి? అలా ఆశ్చర్యంగా చూస్తావ్? లాయర్ ఈ రోజు పది గంటలకు రమ్మన్నాడు మొన్ననే చెప్పాగా? మన ఒరిజినల్ సెషన్ ప్రకారం మొన్న స యంత్రం వెళ్ళవలసి ఉండె. లాయర్ ఊరికి వెళ్ళాడని చెప్పానుగా? త్వరగా బయలుదేరు. తొమ్మిదిన్నర అవుతూంది."

ఏమిటిది? ఈ సంకల్పం మారదా? రాత్రి మరి అలా ప్రవర్తించాడేం?

తను కోరింది సినిమాకు తీసుకెళ్ళమని. ఆఖరు రోజుకదా అని జాలితో అలా ప్రవర్తించాడన్న మాట! తనెంత ఫూల్! జీవితమంతా కలల్లోనే బ్రతికింది. వాస్తవంగా భావించిన తన ప్రతి భావనా భ్రమగానే మారుతోంది.

"నన్ను క్షమించలేవా? నీకెలా చెప్పాలో నాకు అర్థం కావడం లేదు. నేను పూర్తిగా మారి పోయాను. నీ భార్యను కాగలిగినందుకు గర్విస్తున్నాను."

సిద్ధార్థ పకపకనవ్వాడు. అద్దాల తలుపుల మీద కంకరరాళ్లు విసరినట్టు ఉంది అతని నవ్వు కల్పన చెవులకు. ఆ నవ్వు తన మనసుకు కంకరరాళ్ళలా తగులుతున్నది. మనసు విరిగిపోతున్నది. పగిలి పోతున్నది. గాయపడుతున్నది.

"నాకేమీ చెప్పక్కర్లేదు. మనిద్దరి మధ్యా ఏర్పడ్డ అగాధం మాటలతో పూడ్చగలిగేదికాదు. నువ్వు మరొకిడ్ని ఆరాధిస్తున్నావని తెలిసీ పెళ్ళి చేసుకున్నాను. పెళ్ళి అయాక అతనికి ఉత్తరం రాశావని తెలిసీ భరించాను. ఎన్నోరకాల నన్ను గాయపర్చాలనే ప్రయత్నించావు. నా మనసును నువ్వు జల్లెడలా చేశావ్. అయినా భరించాను. ఎందుకు? నిన్ను ప్రేమించాను కనక! నువ్వు మార్తావనే నమ్మకంతోనే. నీకు నేను ఇచ్చిన స్థానాన్ని గౌరవించడం నేర్చుకుంటావనుకున్నాను. నన్ను అర్థం చేసుకుంటావనుకున్నాను. నా అభిమానం మీద దెబ్బకొట్టావు. నా ఆత్మగౌరవాన్ని పరాయివాళ్ళముందు గేలిచేసి గాయపర్చావు. నాలో ద్వేషాన్ని రగిలించావు. నేను ఎంత ప్రేమించగలనో అంతకంటే ఎక్కువగా ద్వేషించగలనని చెప్పినా లక్ష్యపెట్టలేదు. నేను ఒక హద్దు దాటాక ఎంత కఠినంగా ఉండగలనో చెప్పడానికి ప్రయత్నించాను. అయినా నువ్వు లక్ష్యపెట్టలేదు."

"ప్లీజ్!" ఆ పైమాటలు పెగల్లేదు. వెక్కి వెక్కి ఏడవసాగింది.

"ఏడవకు! ఏడ్చే ఆడవాళ్ళంటే నాకు మరీ అసహ్యం! నీలో రియలైజేషన్ వచ్చిందని నువ్వు అనుకుంటున్నావు. కాని అది మానసికంగా నువ్వు ఎదగడం వల్ల వచ్చిన రియలైజేషన్ కాదు. రవీంద్ర వచ్చాడు. నిన్ను గాయపరచి వెళ్ళాడు నీ అహాన్ని గాయపర్చాడు. అతనంటే నీలో ద్వేషం చోటు చేసుకుంది. అంతేగాని...."

"కాదు....కాదు...."

"నన్ను చెప్పనియ్! నిన్ను నేను వదిలేస్తున్నాను అనడం లేదు. మనం విడిపోతున్నాం. ఆ రోజు నువ్వే అన్నావ్ "విడిపోదాం! డైవర్సు తీసుకుందాం!" అని. ఆ రోజే నువ్వు పూర్తిగా నా మనసులో నుంచి వెళ్ళిపోయావ్. మనం విడిపోతున్నాం. మనం వేరుగా ఉంటాం. మనకు పూర్తి స్వతంత్రం అంటే కోర్టు నుంచి డిక్రీ రావడానికి ఇంకా సమయం ఉన్నది. కాని లాయర్ నోటీసు మీద సంతకం పెట్టిన క్షణం నుంచే మనం వేరువేరుగా జీవించబోతున్నాం. నువ్వు ఒంటరిగా ఉంటావు. నీ జీవితాన్ని గురించి ఆలోచించుకుంటావ్. అప్పుడుగాని నీకు నేను ఇచ్చిన స్థానం ఎలాంటిదో నీకు అర్థం కాదు. అప్పుడు అర్థం అయినా ప్రయోజనం లేదు. పక్షులు గింజలన్నీ తినేశాక 'వడిసేల' ఉపయోగిస్తే ప్రయోజనం ఏముంటుంది!"

కల్పన ఏడుస్తూ ఉండిపోయింది.

"ఏడవకు! ఏడ్చి నా నుంచి ఏమీ సాధించలేవు."

కల్పన కన్నీళ్ళు తుడుచుకుంది.

రోషంతో ముఖం ఎర్రబడింది.

"మరి రాత్రి అలా ఎందుకు ప్రవర్తించావ్?"

"నువ్వే కోరుకున్నావుగా? ఈ రాత్రి నేను సంతోషంగా గడపదల్చుకున్నాను అన్నావు. అందుకే....ఇంకా నా భార్య స్థానంలోనే ఉండటం వల్ల ఆ మాత్రం కోరిక తీర్చడం నా బాధ్యతగా భావించాను."

"అంతేనా?"

"అంతే!"

"ఇదేనా తుది నిర్ణయం!"

"అవును!"

"ఇంతకాలం నీకు భార్యగా ఉన్నందుకు నేను గర్విస్తున్నాను."

"మేడమ్ కల్పనా! ఈ సినిమా డైలాగ్సుతో నా నిర్ణయాన్ని మార్చలేవు."

"నీ నిర్ణయాన్ని మార్చడానికి అనడం లేదు. నేను ఫీలవుతున్నది అంటున్నాను. ఇక నన్ను అవమానించకు. నీ నిర్ణయం అదే అయితే పద వెళ్దాం!"

"ఇలాగే?"

"అవును ఇలాగే వస్తాను."



ఖాలిద్ అబ్దుల్లా సువయ్యా....ఈ పేరు వింటే మీకేమీ వింతగా అనిపించడం లేదు కదూ. కాని సౌదీ అరేబియాలో అతని పేరు వింటే చాలు విదేశీ యాత్రికులు అందరూ గడగడలాడిపోయేవారట. అతగాడీ మధ్య ఏడుగురు విదేశీ యువతులను, ఒక స్థానిక యువతిని మానభంగం చేశాట్ట! వారిలో ఒక పదేళ్ళ అమెరికన్ బాలిక కూడా వున్నదట. అతడు యివికాక చిల్లరమల్లర దొంగతనాలు కూడా చేసేవాడుట. ఈ మధ్య అతనో బెల్జియం దేశపు యువతిని మానభంగం చేయబోతూంటే చుట్టుపక్కలవాళ్ళు గుమిగూడి ఆమెని రక్షించారు. అయితే ఖాలిద్ మాత్రం వారికి పట్టుబడకుండా తప్పించుకు పారిపోయాడు. చివరికి పోలీసులు దేశమంతా గాలించి ఈ మధ్య అతన్ని పట్టుకున్నారు. ఇస్లాం మత సంబంధమైన న్యాయస్థానం 'అతని తల నరకవలె'నని తీర్పు యిచ్చింది. అది వెంటనే అమలుపరచబడింది కూడా.

సిద్ధార్థ కారును గరాజ్ నుంచి బయటికి తీశాడు. కల్పన వెనకడోర్ తీసి ఎక్కబోయింది.

"ముందుకు రా!"

"అక్కర్లేదు."

"ఇంకా నీకు ఆ అధికారం ఉంది."

"నాకు ఆ అధికారమేమీ అక్కర్లేదు."

"ష్యూర్!"

"యస్!"

సిద్ధార్థ తనలో-తను నవ్వుకోవడం కన్పించింది కల్పనకు.

ఈ మనిషికి ఇప్పుడు కూడా నవ్వు వస్తోందా?

అంత దుర్మార్గుడా!

తనను ఏడిపించడానికి ఈ నాటకం ఆడటం లేదు కదా! తను లేకుండా ఉండగలడా? తనలో ఈర్ష్యను రగిలించడానికి ఎన్ని ప్రయత్నాలు చేశాడు? తన మనసును తిప్పుకోవడానికి ఎన్ని ప్రయాసలుపడ్డాడు! అటువంటివాడు తనను, ముఖ్యంగా తను తన తప్పును తెలుసుకున్నానని అంగీకరించిన తర్వాత, పోగొట్టుకుంటాడా?

కారు నారాయణ గూడా చౌరాస్తా కేసి పోతున్నది.

ఎక్కడికి పోతున్నాడు?

మార్నింగ్ షోకు వెళ్తున్నామా? అవును! వెంకటేశ్వరా టాకీసు వైపే వెళ్తున్నాం.

అబ్బ ఎంత హడల గొట్టాడు!

నిజంగానే విడాకుల పత్రం మీద సంతకం పెడితే!

రవీంద్ర ఏమన్నాడు?

తనకు బ్రతిమాలడం రాదన్నాడు. ఆత్మహత్య చేసుకోమన్నాడు.

తనెందుకు ఆత్మహత్య చేసుకోవాలి?

తను పిరికిది కాదు. తను అలా చేస్తే పేపర్లో పేరు వేస్తారా? "ప్రసిద్ధ రచయిత్రి కల్పన మరణం" అంటూ పత్రికలు వేస్తాయి. "కవయిత్రి" అని కూడా రాస్తాయి. కాని ప్రసిద్ధ అని రాస్తారా? ఎందుకు రాయరూ? ప్రతి రచయిత్రినీ ఈ మధ్య పత్రికల వాళ్ళు ప్రసిద్ధ రచయిత్రి అనే అంటున్నారు.

తన గురించి పేపర్లో తప్పక పడుతుంది. అది రవీంద్ర చదువుతాడు. దిమ్మెర పోతాడు. భోరున ఏడుస్తాడు.

సిద్ధార్థ! లోలోపల కుమిలిపోతాడు. కళ్ళలో నీరు తిరుగుతుంది. అంతే!

సిద్ధార్థ వ్యక్తిత్వమే వేరు.

భోరున ఏడ్చే మగవాళ్ళంటే తనకు అసహ్యం.

కారు ఆగడంతో కల్పన ఈ లోకంలోకి వచ్చింది.

ఛ! ఏమిటి తను మళ్ళీ ఇలాంటి ఆలోచనలు చేస్తున్నది!

కారు సినిమా హాలు ముందు ఆగలేదు.

"ఎక్కడికి వచ్చాం!" యాధాలాపంగా, పూర్తిగా ఆలోచనల నుంచి బయటపడిన కల్పన అడిగింది.

"లాయర్ ఇంటికి."

కల్పనకు కారుతో సహా తను భూమిలోకి దిగిపోతున్నట్టు అనిపించింది. లాయర్ పేరున్న బోర్డు చూస్తూ కూర్చుండిపోయింది.

సిద్ధార్థ కారుదిగి వచ్చాడు. డోర్ తెరుస్తూ 'దిగు" అన్నాడు కల్పనతో.

కల్పన యాంత్రికంగా కారు దిగింది.

ఆమెకు కలలో నడుస్తున్నట్టుగా ఉన్నది.

సిద్ధార్థ వెనకే 'కీ' ఇచ్చిన బొమ్మలా నడుస్తోంది.

ఆఫీసు గదిలో అడుగుపెట్టారు.

కాగితాలు చూసుకుంటున్న అడ్వకేటు రామచంద్రరావు తలెత్తి చూశాడు. వయసు మళ్ళిన రామచంద్రరావు ఇద్దర్నీ మార్చిమార్చి చూశాడు. అతని చూపులు ఎన్నో ప్రశ్నలు వేస్తున్నాయి.

"రండి! కూర్చోండి! మీ కాగితాలే చూస్తున్నాను."

"తయారుగా ఉన్నాయా?" సిద్ధార్థ అడిగాడు.

"ఆఁ" అంటూ మరోసారి ఇద్దర్నీ చూశాడు.

"బాగా ఆలోచించుకొనే ఈ నిర్ణయం తీసుకున్నారా?" కల్పన ముఖంలోకి చూస్తూ అడిగాడు అడ్వకేటు.

కల్పనలో ఆత్మాభిమానం తల ఎత్తింది.

ఏదో తెలియని కసి పడగవిప్పింది.

"అవును! బాగా ఆలోచించుకొనే ఈ నిర్ణయం తీసుకున్నాను." అన్నది.

"మీరు?"

సిద్ధార్థ "అవును!" అన్నట్టు తల ఆడించాడు.

"మీరిద్దరూ వయసులో ఉన్నవాళ్ళు. ఈ వయసులో చిన్నచిన్న విషయాలకు ఉద్రేకపడటం సహజం! పట్టుదలలు కూడా ఉంటాయి. క్షణిక ఆవేశంలో త్వరపడి నిర్ణయాలు తీసుకొని పశ్చాత్తాప పడ్డవాళ్ళను చాలామందిని నేను ఎరుగుదును. ఉడుకురక్తం! దేనికైనా సాహసిస్తుంది. పాలు ఒక్కసారే పొంగుతాయి. అప్పుడే పొయ్యి పాలు కాకుండా జాగ్రత్త పడాలి. మీ ఇద్దరూ చిలకా గోరింకల్లా ఉన్నారు. తర్వాత పశ్చాత్తాపపడి లాభం లేదు."

"మీరు లాయర్. మీ పని మీరు చెయ్యండి. మీ దగ్గరకు వచ్చింది ఉపదేశాలు వినడానికి కాదు," అన్నది కల్పన.

సిద్ధార్థ కల్పన ముఖంలోకి ఆశ్చర్యంగా చూశాడు.

"నిజమేనమ్మా! నేను నీ తండ్రిలాంటివాడిని. అడ్వకేటునే అయినా నీలాంటి ఆడపిల్లలు నాకూ ఉన్నారు. అందుకే ఇలాంటి కేసులు వచ్చినప్పుడు తొందరపడవద్దని చెబుతాను. కొంత సమయం ఆలోచించుకోవడానికి ఇస్తాను. నూటికి తొంభయ్ మంది ఉద్రేకం తగ్గాక విడాకులు అక్కర్లేదంటారు. అందుకే మీకూ చెబుతున్నాను."

"లాయరుగారూ కాగితాలు తయారుగా లేవా?" కోపంగా అడిగింది కల్పన.

సిద్ధార్థ మాట్లాడటం లేదు.

"కాగితాలు తయారుగానే ఉన్నాయ్!"

"అయితే వినిపించండి. కారణాలు ఏం రాశారు?" కల్పన అడిగింది.

"పూలిష్‌నెస్! మెంటల్‌టార్చర్" అందుకొని అన్నాడు సిద్ధార్థ.

"క్రుయల్టీ అండ్ హిపోక్రసీ అని కూడా యాడ్ చెయ్యండి" అన్నది కల్పన.

"అలాగే!" అన్నాడు లాయర్.

పది నిమిషాల్లో పేపర్లు టైపు అయ్యాయి.

ముందు సిద్ధార్థ సంతకం పెట్టాడు.

సిద్ధార్థ సంతకం చేస్తున్నప్పుడు వేళ్ళు వణకడాన్ని కల్పన స్పష్టంగానే చూసింది.

కల్పన సంతకం పెట్టింది. చేతులు వణకలేదు. వేళ్ళు కూడా వణకలేదు.

"కోర్టులో రేపే ఫైల్ చేస్తాను."

"ఎంతకాలం పడుతుంది?"

"ఇద్దరూ అగ్రీ అయారు కనక డిక్రీ త్వరగానే వస్తుంది. కాని మళ్ళీ వివాహం చేసుకోవడానికి రెండేళ్ళు ఆగాలి."

"అదేమిటి?" అన్నది కల్పన.

సిద్ధార్థ చివ్వున తల తిప్పి కల్పనకేసి చూశాడు.

"అవునమ్మా! అంతే! ఈ లోపల పశ్చాత్తాపం కలిగితే మళ్ళీ కలుసుకోవడానికి అవకాశం ఉంటుంది."

"థ్యాంక్యూ సర్! వస్తాం! వీలయినంత త్వరగా డిక్రీ వచ్చేలా చూడండి." అన్నది కల్పన.

కల్పన చరచరా బయటికి వెళ్ళిపోయింది.

కార్లో కూర్చుని వెనక్కు వాలి కళ్ళు మూసుకుంది. కను కొనలు చల్లగా ఉన్నట్టు అనిపించి గబుక్కున తుడుచుకుంది.

తను బాధపడదు! అతనికి లేని బాధ తనకు మాత్రం ఎందుకుండాలి? ఎంత అహంకారం! తనకు మాత్రం ఆత్మాభిమానం లేదా? తను బతక లేదా? తను ఉద్యోగం చేస్తుంది. నవలలు పుంఖాను పుంఖాలుగా రాసి కీర్తి గడించాలి. తన పేరు ప్రఖ్యాతులు విని అతను బాధపడాలి. తను ఏం పోగొట్టుకున్నాడో అతనికి ఇప్పుడు అర్థం కాదు.

ఏడీ! ఎంతసేపటికీ రాడేం? లాయర్‌తో ఏం మంతనాలు ఆడుతున్నాడో!

డబ్బు ఇస్తున్నాడేమో?

సిద్ధార్థ వచ్చాడు. స్టీరింగ్ దగ్గిర కూర్చున్నాడు. చాలా గంభీరంగా ఉన్నాడు.

దారిలో రెండుసార్లు సడన్‌బ్రేక్ వేయ్యాల్సి వచ్చింది.

కల్పన ఏడవలేక నవ్వుకుంది. ఆమె నవ్వు ఆమెకే అది నవ్వులా కాక ఏడుపులా అన్పించింది.

పాపం! బాధపడుతున్నట్టున్నాడు. అందుకే కారు సరిగ్గా నడపలేకపోతున్నాడు!

"ఇంతవరకూ నా ప్రేమనే చూశావ్. ఇక నా ద్వేషాన్ని చూస్తావ్" అని సిద్ధార్థ ఆరు నెలల క్రితం అన్న మాటలు చెవుల్లో మారుమ్రోగుతున్నాయి.

కారు వేగంగా పోతున్నది.

## 22

ఇంటి ముందు కారు ఆగింది.

సిద్ధార్థ కారు దిగాడు.

కల్పన కూర్చున్న వైపు వెనకసీటు డోర్ తెరిచాడు.

కల్పన యాంత్రికంగా దిగింది. "థ్యాంక్యూ" అన్నది.

కారు శబ్దం విని లోపల నుంచి జీన్స్‌లో ఉన్న ఒక అందమైన అమ్మాయి పోర్టికోలోకి వచ్చింది.

కల్పన ఆగింది. ఆ అమ్మాయి కేసి ప్రశ్నార్థకంగా చూసింది.

"హల్లో!" అన్నాడు సిద్ధార్థ.

"హాయ్!" అన్నది ఆ అమ్మాయి.

కల్పన ఇద్దర్నీ మార్చి మార్చి చూసింది.

"ఎవరూ?" అడిగాననుకుంది. మాటలు పెగల్లేదు.

"అవంతీ! మీట్ మిస్ కల్పన!" అన్నాడు సిద్ధార్థ.

కల్పన తృళ్లిపడింది. "మిస్ కల్పనా!" పెదవుల వరకూ వచ్చి మాట ఆగిపోయింది.

"మిస్ కల్పనా! మీట్ మిస్ అవంతి!"

"నమస్కారమండీ!" అన్నది అవంతి.

"నమస్కారం! రండి! లోపలకు" అన్నది కల్పన.

"అవంతి నాకు కాబోయ్యే భార్య" అన్నాడు సిద్ధార్థ.

కల్పన స్థాణువులా నిలబడింది.

అతనికి కాబోయే భార్యను తను లోపలకు ఆహ్వానించిందా?

ఇప్పుడు ఈ ఇంట్లో ఆమెకు ఉన్న స్థానం తనకు లేదు.

వళ్లు బిగువున నిలదొక్కుకుని నిల్చుంది.

కళ్లు తిరుగుతున్నట్లు అనిపించింది.

గోడ పట్టుకుని గబగబా లోపలకు వెళ్లింది.

డైనింగ్ టేబుల్‌ముందు కూర్చుంది. కూర్చునే ఫ్రిజ్ తెరిచి నీళ్లబాటెల్ తీసుకుంది. బాటెల్ ఎత్తి గటగట నీరు త్రాగింది.

అప్పటికి కొంత సేద తీరింది.

అవంతీ, సిద్ధార్థ కూడా లోపలకు వచ్చారు.

"సుబ్బమ్మా! మూడు కాఫీలు తీసుకురా!" అన్నాడు సిద్ధార్థ.

"కంగ్రాచ్యులేషన్స్!" అన్నది కల్పన అవంతితో.

"థ్యాంక్యూ!"

"రామూ! డ్రైవర్ వచ్చాడా?"

"వచ్చాడు సార్!"

ఓ పది నిమిషాలు అందరూ మౌనంగా కూర్చున్నారు.

సుబ్బమ్మ కాఫీ తెచ్చి ఇచ్చింది.

ముగ్గురు మౌనంగా తాగుతున్నారు.

విడాకులకు పట్టుపట్టడానికి కారణం ఇప్పుడు అర్థం అయింది. ఆ పిల్ల ప్రేమలో పడ్డాడు అన్న

## ప్రేమపక్షులు

సుదూరంగా
కన్పిస్తున్న
భూమ్యాకాశ తీరాలు
ప్రేమికులే అయి ఉండాలి
కానిదే
నూతన ప్రేమికుల్లా
ఎడతెగకుండా
ముచ్చటు లెందుకాడతాయి?
ప్రణయకోపంలో
ప్రియునిలా
ఆకాశం
ఎందుకురుముతుంది?
వర్షించిన ప్రేమకు
భూమి
ఎందుకు స్పందిస్తుంది?

—ముమ్మారెడ్డి హేమలత

మాట! వివాహం కూడా చేసుకోవడానికి నిశ్చయించుకున్న తర్వాతే విడాకుల పత్రం మీద సంతకం చేశాడు. ఎంత మోసం! ఇందుకోసమే తనను రెచ్చగొట్టాడు. తనతో సిల్లీగా తగాదాలు పడసాగాడు.

"కల్పనా! ఆ ఫియట్ కారు తీసుకెళ్ళు. నీ కోసం అన్ని వసతులూ ఉన్న ఇల్లు బర్కత్ పురాలో చూశాను. పని కుర్రాడు ఉన్నాడు. సుబ్బమ్మను కూడా తీసుకెళ్లు. దేనికీ ఇబ్బంది పడకుండా అన్ని ఏర్పాట్లు చేశాను."

కల్పన సిద్ధార్థ ముఖంలోకి చూస్తూ ఉండిపోయింది.

"నీకు కావలసిన సామానంతా పట్టుకెళ్ళు"

"ఫ్రిజ్‌తో సహా...."

"నీకు కావలసినవన్నీ అన్నానుగా!"

"నగలూ!"

"అన్నీ! నీకు కావలసినవన్నీ!"

ఏమిటీ మనిషి! తనకు విడాకులు ఇస్తున్నాడు. తను దేనికీ ఇబ్బంది పడకుండా ఏర్పాట్లు చేశాడు. ఇల్లంతా తీసుకెళ్ళమంటున్నాడు. తనంటే ఇష్టం తగ్గలేదు. కాని ఆ పిల్లను వివాహం చేసుకోవాలనుకున్నాడు. ప్రాక్టికల్ మేన్!

కాదు! రాక్షసుడు!

"సుబ్బమ్మను తీసుకెళ్తే నీకు వంట?"

"పర్వాలేదు. కొంతకాలం అవంతీ వాళ్లింట్లో భోజనం చేస్తాను. ఈలోపల మనిషిని చూసుకుంటాను."

"పాపం! రెండేళ్ళదాకా పెళ్లి చేసుకోకూడదు." వ్యంగ్యంగా అన్నది కల్పన.

"దానికేముంది? కలిసి ఉంటే ఎవడూ అడగడానికి లేదు. ఆ తర్వాతే పెళ్లి డిక్లేర్ చేస్తాం!"

చేతిలో ఉన్న కప్పు తీసుకొని సిద్ధార్థ తలమీద కొట్టాలనిపించింది.

అవంతి మాత్రం తన పెద్ద పెద్ద కళ్లను టపటపలాడిస్తూ ఇద్దర్నీ మార్చి మార్చి చూస్తూ కూర్చుంది.

"ఈ ఏర్పాట్లన్నీ ఎందుకు చేస్తున్నావ్?"

"ఇంకా కోర్టు నుంచి డిక్రీ రాలేదుగా! అంతవరకూ నీకు ఎలాంటి ఇబ్బందీ కలక్కుండా చూడటం నా బాధ్యత."

"ఆ తర్వాత కూడా నేను కోరితే నాకు అన్ని వసతులూ కల్పిస్తావా!"

"కల్పించను!" ఖచ్చితంగా అన్నాడు.

అవంతి ఇబ్బందిగా కదిలింది.

అక్కడ్నుంచి లేచి వరండాలోకి వచ్చి నిల్చుంది.

"అవంతీ ఉండు! వస్తున్నాను. డ్రాప్ చేస్తాను." అన్నాడు.

కల్పన వైపు తిరిగి "కల్పనా! నేను రావడానికి ఆలస్యం కావచ్చును. డ్రైవర్‌కు ఆ ఇల్లు తెలుసు. నీకు కావల్సిన సామాను తీసుకొని వెళ్లు. సుబ్బమ్మను కూడా తీసుకెళ్లు. నీకు వంట చెయ్యడం రాదుగా. బై! బై! విష్‌యూ బెస్ట్ ఆఫ్ లక్! కమాన్ అవంతీ!

కారు స్టార్టు అవడం విన్పించింది.

కల్పన ఆ బల్లముందు ఎంత సేపు కూర్చుందో ఆమెకే తెలియదు.

"అమ్మా, కారు తియ్యమన్నారా?" డ్రైవర్ వచ్చాడు.

"యూ షట్ అప్!" పిచ్చిదానిలా అరిచింది.

డ్రైవర్ తలవంచుకొని నిల్చున్నాడు.

"సారీ సుబ్బయ్యా! కారు అక్కర్లేదు, నువ్వెళ్లు."

సుబ్బయ్య అలాగే నిల్చున్నాడు.

"నీకే చెబుతూంది!"

సుబ్బయ్య బయటికి వెళ్ళాడు.

"అమ్మా! సామాను సర్దాలా!" రాముడు వచ్చాడు.

"యూ రాస్కెల్ నా సామాను సర్దుతావట్రా!"

రాముడు తలవంచుకొని నిల్చున్నాడు.

"వెళ్లు నా ముందునుంచి వెళ్లండి. అందరూ వెళ్లండి." పిచ్చిగా అరుస్తూ తన గదిలోకి వెళ్లి తలుపులు వేసుకుంది.

# 23

దాదాపు నాలుగు గంటల ప్రాంతంలో సిద్ధార్థ ఇంటికి వచ్చాడు.

అతని ముఖం పీక్కుపోయి ఉన్నది.

తన యావదాస్తినీ మోసుకొస్తున్న పడవ సముద్రంలో మునిగిపోయిందని విన్నవాడిలా దిగులుపడి కన్పిస్తున్నాడు.

సుబ్బయ్య వరండాలో కూర్చుని కన్పించాడు.

"అమ్మగారు కారులో వెళ్లలేదా?"

"లేదు బాబూ!"

"మరి ఎలా వెళ్లింది?"

"అసలు బయటికే రాలేదు. ఇంట్లోనే ఉన్నారు."

సిద్ధార్థ ఓ క్షణం నిల్చున్నాడు.

గబగబా లోపలకు వచ్చాడు.

రాముడూ, సుబ్బమ్మా ఏదో కంగారుగా ఉన్నారు.

"అయ్యగారూ! అమ్మగారు మీరు వెళ్లగానే తలుపులు వేసుకుని గదిలో పడుకున్నారు. ఇంత వరకూ బయటికే రాలేదు. తలుపులు కొట్టాలంటే భయంగా ఉంది. కాఫీ కూడా తాగలేదు. బాగా కోపంగా ఉన్నారు." అన్నాడు రాముడు.

సిద్ధార్థ గది ముందుకు వెళ్లి నిలబడ్డాడు.

తలుపు తట్టాడు.

సమాధానం లేదు.

"కల్పనా! కల్పనా!" అంటూ దబదబ తట్టాడు. సమాధానం లేదు.

ఏదో అనుమానం వచ్చింది.

రాముడ్నీ, సుబ్బయ్యనూ కేకలు పెట్టాడు. తలుపులు బద్దలు కొట్టారు.

కల్పన మంచం మీద పక్కకు ఒదిగి నిద్ర పోతున్నట్టు పడుకొని ఉన్నది.

కల్పన మొదటిసారిగా సిద్ధార్థ కొన్న చీర కట్టుకొని పడుకొని ఉన్నది.

"కల్పనా! కల్పనా!" గాభరగా తట్టాడు సిద్ధార్థ.

కల్పన పలకలేదు.

పక్కనే నిద్రమాత్రల సీసా ఉన్నది.

ఈ మధ్య సిద్ధార్థ నిద్రమాత్రలు ఉపయోగిస్తున్నాడు.

సిద్ధార్థ వళ్లంతా చమట్లు పట్టసాగాయి.

"కల్పనా! ఎందుకు ఇలా చేశావ్?" అనే మాటలు మళ్లీ మళ్లీ పిచ్చివాడిలా వల్లించాడు.

కార్లో నర్సింగ్ హోంకు తీసుకెళ్ళాడు.

డాక్టర్ సిద్ధార్థ స్నేహితుడు. బయటికి పొక్కకుండా జాగ్రత్త పడ్డారు.

డాక్టర్ ప్రాణభయం లేదని చెప్పాడు. తెల్లవారి ఏ పదిగంటలకో కాని పూర్తిగా స్పృహ రాదని చెప్పాడు.

సుబ్బమ్మనూ నర్సునూ కల్పన దగ్గిర ఉంచి సిద్ధార్థ ఇంటికి వచ్చాడు.

రాత్రి పన్నెండు దాటింది. ప్రమాదం దాటిందని చెప్పాక సిద్ధార్థ ఇంటికి వచ్చాడు.

గదిలోకి వెళ్లాడు. తల దగ్గిర దిండు కిందగా ఉన్న కాగితపు మడత విప్పి చదవసాగాడు.

"నేను ఆత్మహత్య చేసుకుంటున్నాను. ఇందుకు ఎవరూ బాధ్యులు కారు. నా తెలివితక్కువతనమే నన్ను ఇంతవరకు దిగజార్చింది. జీవితాన్ని ఒక కలగా భావించాను. నాకు రెక్కలు లేవని చాలా ఆలస్యంగా తెలుసుకున్నాను. నింగినుంచి నేలకు దిగాను. కాని అప్పటికే నేలమీద నాకోసం ఏమీ మిగల్లేదు, నేను వెళ్లిపోతున్నాను."

సిద్ధార్థ కళ్ల నుంచి కారుతున్న కన్నీటిబొట్లు అక్షరాలను అలుకుతున్నాయ్.

# 24

కల్పన కళ్లు తెరిచింది.

ఎదురుగా సిద్ధార్థ కన్పించాడు.

ఏదో మాట్లాడాలని ప్రయత్నించింది. పెదవులు కదల్లేదు. కల్పన కళ్లు మళ్లీ మూతపడ్డాయి.

సిద్ధార్థ దగ్గిరకు వచ్చి మంచం మీద పక్కగా కూర్చుని కల్పన చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

మరో అర్ధగంటకు కల్పన కదిలింది. కళ్లు తెరిచింది.

తన ప్రక్కన కూర్చున్న సిద్ధార్థను చూసింది. చూస్తూ ఉండిపోయింది.

"కల్పనా! ఎలా ఉంది?" సిద్ధార్థ మెత్తగా అడిగాడు.

కల్పన కళ్లు పెద్దవి చేసుకొని మరోసారి చూసింది. ఆమెకు తను చూస్తున్నది కలో నిజమో తెలియడం లేదు.

"కల్పన్!"

"ఊఁ"

"ఎలా ఉంది?"

**డి. సుజాత**

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడెమీ ఆధ్వర్యంలో హైద్రాబాదులో జరిగిన రాష్ట్ర స్థాయి పోటీలలో భరతనాట్యం సీనియర్స్ విభాగంలో ప్రథమ బహుమతి అందుకున్న డి. సుజాత, శ్రీకాకుళం మహిళా కళాశాలలో ఇంటర్ తొలి సంవత్సరం చదువుతున్నది. పదిహేను సంవత్సరాల సుజాత, పాలిటెక్నిక్ ఇంజనీరింగ్ కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ డి. కృష్ణమూర్తి కుమార్తె; భరతనాట్యం నేర్చుకుని, అనేకచోట్ల ప్రదర్శనలు ఇచ్చింది. సుజాతకు



చదువు మీద కూడా చాలా శ్రద్ధ. చదువులో మంచి మార్కులు తెచ్చుకుంటూనే, తన 'హాబీ'ని వృద్ధిపరచుకుంటున్నది. —టి.వి

"నన్నెందుకు బతికించారు?" నీరసంగా అన్నది.

సిద్ధార్థ మృదువుగా ఆమె చేతిని నిమరసాగాడు.

"చెప్పు! నన్నెందుకు బ్రతికించావ్? నేను చిత్రహింసను అనుభవిస్తుంటే చూడాలనేగా?" ఆవేశంగా అన్నది.

"కాదు."

"నువ్వు రాక్షసుడివి!"

"కల్పన్!"

"నన్ను అలా పిలవకు! ఇప్పుడు నీకు నేనేమీ కాను. పరాయి ఆడదాన్ని అలా పిలవకూడదు."

సిద్ధార్థ తల వంచుకున్నాడు.

"చెప్పు నన్నెందుకు ఈ నర్సింగ్ హోంకు తీసుకొచ్చావ్? నన్నెందుకు బతికించావ్?"

"నా కోసం కల్పన్! నా కోసం! నువ్వు చచ్చిపోతే, అదీ నావల్ల నువ్వు చచ్చిపోతే నేను బతికి ఉంటాననుకున్నావా?" ఆవేశంగా అన్నాడు సిద్ధార్థ.

కల్పన అతని మాటలు అర్థం కానట్టు చూసింది.

"అవును! కల్పన్! నిన్ను నీ కలల నుంచి తట్టి లేపడానికే ఇంత నాటకం ఆడాను. నిన్ను నింగినుంచి నేలకు దింపడానికే నిన్ను మానసికంగా చిత్రహింసకు గురిచేశాను. కాని నువ్వు ఇంత అఘాయిత్యం చేస్తావనుకోలేదు."

"ఇది కలా నిజమా!"

"ఇది కల కాదు. వాస్తవం!"

"మరి అవంతి...."

"అది కూడా కట్టుకథే. ఆ పిల్ల నా స్నేహితుడి కూతురు. ఈ ఊళ్లో హాస్టల్లో ఉండి డాక్టరీ చదువుతూంది."

"అబ్బ! ఎంత భయపెట్టేశావ్?"

"లేకపోతే అమ్మగారు నేలమీదకు దిగుతారా?"

"ప్రస్తుతం ఈ మంచం మీదనుంచి దిగేస్తాను. ఇంటికి వెళ్దాం!"

"నో! నో! ఇప్పుడే కాదు. డాక్టర్ వచ్చాక పంకెళతాను."

"నాకు ఇంకా నమ్మకం కలగడం లేదు."

"నమ్మకం కలిగించనా?"

"ఊఁ!"

సిద్ధార్థ వంగి కల్పన పెదవుల్ని చుంబించాడు.

[సమాప్తం]

# అరటి చెట్టు



ఈ చెట్టు చేయడం కొంచెం శ్రమే గాని చాలా అందంగా వుంటుంది. కావలసిన వస్తువులు: 22 గేజి కమ్మి, ప్యాకింగ్ పేపరు (బిస్కెట్ల డబ్బాలో, ప్యాకింగుకు వస్తాయి), గ్రీన్ కలర్ (ఎనామిల్ పెయింటు) చెక్కస్టాండు.

చేసే విధం: ముందు మెంతులు, చిత్తు కాగితాలు మూడురోజులు బాగా నాననిచ్చి మెత్తగా రుబ్బి పెట్టుకోవాలి. (ఇది చాలామంది చాటలకు పూస్తారు) ప్యాకింగు కాగితం తీసుకొని అరటి ఆకు షేపులో మనకు కావలసిన సైజులో సైజు వారీగా (కొన్ని పెద్దవి, కొన్ని చిన్నవిగా) కట్ చేసి పెట్టుకోవాలి. ఒక చెట్టుకు 10, 12 ఆకులు కావాలి. ఆ ఆకు యెంత సైజు వుందో అంత సైజు కన్నా అర మూర పొడుగు వుండేలాగా 22 గేజి కమ్మి కట్ చేసుకొని గ్రీన్ పేపరు దానికి చుట్టుకోవాలి (కమ్మి కనపడకూడదు). ఇక ఒక్కొక్క కమ్మి ఒక్కొక్క ఆకుకు మైదా గమ్ వేసి అంటించుకొంటూ రావాలి. బాగా ఆరనివ్వాలి. ఇక అన్ని ఆకులు ఒకటిగా అరటిచెట్టుకు వుండేలాగా ఒక కట్టగా పెట్టుకోవాలి. మధ్య ఆకు మటుకు కొంచెం చిన్నదిగా వుండాలి. చుట్టు పెద్ద చిన్న ఆకులు పెట్టుకొంటూ వచ్చి అన్నీ చేర్చి ఒక దారంతోగాని లేక సన్న కమ్మితోగాని కట్టగా చుట్టుకోవాలి. ఒక కమ్మిమటుకు కొంచెం పొడుగు జాస్తిగా పెట్టుకోవాలి. అది క్రింది స్టాండులోకి పోతుంది. ఇక స్టాండు చెక్కను మధ్య చిన్న రంధ్రం చేసి ఈ కమ్మి దానిలోకి దూర్చి క్రింద వంచివేయాలి. ఈ చెట్టును ఒక సైడుకు వంచి పెట్టాలి. ఇక మనం రుబ్బి వుంచుకున్న (మెంతులు, కాగితం)ది ఈ కమ్ముల పైనంతా చెట్టు బెరడు లాగా బాగా దట్టంగా మెత్తుకుంటూ రావాలి. పైన కొంచెం సన్నగా క్రింద పోను పోను లావుగా వుండేటట్లుగా ఆ గుజ్జు మెత్తాలి. దానికి ఒకవైపున అదే రకంగా చిన్నపిలకలు (అరటిపిలకలు) 1, 2 కమ్ములతోచేసి పెద్దవి పెట్టినట్టే యివి పెట్టి వాటికి బాగా గుజ్జుతో చెట్లకాండం అమర్చుకోవాలి.

ఇట్లా 3, 4 చెట్లు అమర్చుకోవచ్చు. మనం యెన్ని పెట్టాలో అన్నిటికి సరిపడా చేసి తీసుకోవాలి. చెట్లు సైజువారీగా గుబురుగా అరటిచెట్లు వుండేలాగానే అమర్చుకోవాలి. ఒక చెట్టుకు మధ్య ఆకు ముడుచుకున్నట్లు, ఒక చెట్టుకు చిన్న ఆకు పెట్టి పూవు, గెల వున్నట్లు అమర్చుకోవాలి. తెలిసినవారు గెలలను పూసలతో చేసి పెట్టవచ్చు. లేనివారు ఈ గుజ్జే చిన్న కమ్మికి (గడ్డిలాగా) పూసి దానిమీద పచ్చ పొడుగు పూసలు అంటించుకొని నల్ల పూసలు అంటించవచ్చు. దీనికిముందే అన్ని కమ్ములతోపాటు పెట్టుకోవాలి. గెల పెట్టే చెట్టు మాత్రం ఒకవైపుకి వంచాలి. అన్ని చెట్లు అమర్చిన తరువాత క్రింద అన్నిటిని మూయునట్లు కొంచెం యేటవాలుగా (అన్నివైపులా) వుండునట్లు పైన చెప్పిన గుజ్జు పెట్టుకోవాలి. అంటే మధ్య మాత్రం యెత్తుగా అన్నివైపులా యేటవాలుగా వుండాలి. (ఇది మట్టిలాగా అన్నమాట) దీన్ని బాగా ఆరనివ్వాలి. బాగా ఆరిన తరువాత ఆకులకు ఆకుపచ్చరంగు (అరటి ఆకుల రంగు) పూయాలి చెట్టు కాండమునకుమటుకు లైట్ గ్రీన్ కలరు పూయాలి. క్రిందమట్టి కలరు పూయాలి. ఇష్టమున్న వారు అరటిపట్ట తెచ్చి కాండము పైకి అంటించవచ్చు. అంతా అయిన పిదప చాల అందంగా అసలు అరటిచెట్టే చేసి వుంచామా అన్నంత బాగా వుంటుంది. కొన్ని ఆకులు అక్కడక్కడ కట్ చేసి వుంచినా బాగా వుంటుంది. అరటి ఆకులు చీలిపోయి వుంటాయిగా మరి.

—ఆమంచర్ల రాజేశ్వరి



డెన్మార్క్ రాజధాని అయిన కోపన్ హెగన్‌లోని న్యాయస్థానం ఈమధ్య ఓ వింత తీర్పు యిచ్చింది. 'పోలీసువారు స్త్రీల నడకని బట్టి వారు విటులని ఆహ్వాని స్తున్నట్లు చెప్పవచ్చు'—అదీ తీర్పు.

ఈ విషయం వీన్న డానిష్ వేశ్యలు తమ అభ్యంతరం తెలియజేస్తూ "పోలీసులు స్త్రీ నడకని బట్టి ఆమె వేశ్య అని నిర్ణయించే టట్టయితే నగరంలో చాలామంది స్త్రీలని అరెస్ట్ చెయ్యాల్సి వస్తుంది" అన్నారట.

ఇంతకీ జరిగిందేమిటంటే ఒక అధికారి-ఒక యువతి వీధులలో అనేకమార్లు ఆహ్వాన పూరితమైన చూపులు విసురుతూ 'ఓ మాది రిగా' నడుస్తూవుంటే చూసి అరెస్ట్ చేశాడట. అతని కథనం ప్రకారం ఆమెకి కోర్టు జరి మానా విధించి పై తీర్పు యిచ్చింది. ఆ యువతి తాను వేశ్యని కానని చెప్పలేదు కాని 'విటులని తన నడకతో ఆహ్వానించ లేదు' అందట. డెన్మార్క్‌లో వేశ్యావృత్తి చట్టబద్ధమైనదే కాని బహిరంగ ప్రదేశాలలో ఆహ్వానించడం నేరమట.... అదీ విషయం.

## నీలగిరి కుర్మా

కావలసిన పదార్థాలు: **1 కిలో మాంసం, 10 గ్రాముల వెల్లుల్లి, 250 గ్రా॥ ఉల్లిపాయలు, 10 గ్రా॥ అల్లం, 20 గ్రా॥ గసగసాలు, 250 గ్రా॥ పెరుగు, 5 గ్రా॥ పచ్చిమిరపకాయలు, 10 గ్రా॥ ధనియాలపొడి, 10 గ్రా॥ గరం మసాలా, 120 గ్రా॥ నెయ్యి, అర్ధకట్ట కొత్తిమిర, రుచికి తగినంత ఉప్పు.**

తయారు చేయవలసిన విధానం: ముందుగా మాంసాన్ని నీళ్లల్లో బాగా కడిగి చిన్నచిన్న ముక్కలుగా తరుక్కోవాలి. ఆ ముక్కల్ని పెరుగులో వేసి అరగంటసేపు నానబెట్టాలి. మనం నిర్ణయించుకున్న ఉల్లిపాయలలో సగం—అంటే 125 గ్రా॥ తీసుకుని వాటిని పచ్చిమిరపకాయలు కొత్తిమిర, అల్లం, వెల్లుల్లి, గసగసాలతో చేర్చి మెత్తగా నూరి ముద్దగా చేసి వుంచుకోవాలి. ఆ తరువాత బాణలిలో నెయ్యి వేసి అందులో తక్కిన ఉల్లిపాయలను (ముక్కలుగా తరుక్కుని) బంగారువన్నె వచ్చేదాకా వేయించాలి. వీటికి నూరి వుంచుకున్న మసాలా చేర్చి వేయించిన తర్వాత పెరుగు చేర్చి కొంతసేపు ఉడకనివ్వాలి. ఈ మిశ్ర మానికి మాంసపు ముక్కల్ని చేర్చి అవి ఉడికాక దింపుకునేటప్పుడు గరంమసాలాపొడి పైన చల్లు కుంటే ఘుమఘుమలాడుతూ వుంటుంది.

## చికెన్ బాదం పసందా

కావలసిన పదార్థాలు: **4 కోళ్లు, 15 గ్రాములు ఎండుమిరపకాయలు, 10 గ్రా॥ ధనియాలపొడి, 225 గ్రా॥ ఉల్లిపాయలు, 115 గ్రా॥ నెయ్యి, 60 గ్రా॥ అల్లం, 30 గ్రా॥ వెల్లుల్లి, 55 గ్రా॥ వసుపు, 55 గ్రా॥ పెరుగు, 55 గ్రా॥ జీడిపప్పు, 55 గ్రా॥ బాదంపప్పు, 2 కోడిగ్రుడ్లు, 1 కట్ట కొత్తిమిర, 15 మిల్లీ లీటర్ల పాలు, 2 టీ స్పూనుల పన్నీరు, కొంచెం గరమ్‌మసాలా, చిటి కెడు మిరియపుపొడి, రుచికి తగినంత ఉప్పు, జల్లించిన బియ్యప్పిండి, టమోటాలు.**

తయారు చేయవలసిన విధానం: ఒక్కొక్క కోడినే కడిగి శుభ్రంచేసి నాలుగు నాలుగు ముక్కలు చొప్పున చేసుకోవాలి. ఎముకలు తీసేసి పెరుగులో వేసి అరగంటసేపు నానబెట్టాలి. నానిన తర్వాత ఆ ముక్కల్ని తీసి జల్లించిన పిండిలో వేసి రొట్టెల పిండిలా మెత్తాలి. ఆ తరువాత వీటిని కోడిగ్రుడ్ల సొనలో ముంచి వాటి మీద జీడిపప్పు, బాదంపప్పు చల్లి నేతిలో బంగారువన్నె వచ్చేదాకా వేయించి విడిగా తీసి వుంచుకోవాలి.

ఇప్పుడిక ఉల్లిపాయల్ని నేతిలో దోరగా వేయించి అందులో—నూరిన అల్లం, వెల్లుల్లి, గరం మసాలా మిశ్రమాన్ని చేర్చి కొంతసేపు వుడక నివ్వాలి. వీటికి ఎండుమిరపకాయలు, ధనియాల పొడి చేర్చి నెయ్యి విడిగా వచ్చేదాకా ఉడకబెట్టాలి. ముక్కలుగా తరుక్కున్న టమోటాలు బాణలిలోని ఈ మిశ్రమంలో వేసి కొద్ది నిముషాలు ఉకకనివ్వాలి. ఆ తరువాత బాగా చిలికిన పెరుగు దీనికి చేర్చి కొద్ది క్షణాలు ఉడకనిచ్చి, ముందుగా వేయించి వుంచు కున్న చికెన్ ముక్కల్ని అందులో వేసి కొద్దిగా నీరు పోసి అవి మెత్తగా అయ్యేదాకా ఉడకబెట్టాలి.

కొద్దిగా పాలల్లో జీడిపప్పు వేసి మెత్తగా రుబ్బు కుని ఈ ముద్దని ఉడుకుతున్న చికెన్ ముక్కలకి కలపాలి. కొద్దిక్షణాలపాటు ఈ మిశ్రమాన్ని ఉడక నిచ్చి తర్వాత పన్నీరు చేర్చాలి.

ఈ మిశ్రమంతోపాటు చికెన్ ముక్కలు బాగా ఉడికిన తర్వాత వాటిని ఒక పళ్లెంలో పోసి-ముక్కలుగా తరుక్కున్న కొత్తిమిరను చల్లి, తోలు వలిచిన బాదంపప్పును, టమోటా ముక్కలను వాటి పైనా, నాలుగువైపులా అందంగా అమర్చితే ఈ చికెన్ బాదం పసందా చూడముచ్చటగానూ, రుచికరంగానూ వుంటుంది. □

వర్ణచిత్రాలు: సత్యకుమార్

## మాంసాహార వంటలు



# విశ్వసాహిత్యంలో ఉద్గ్రంథాలు

## 'బ్రాహ్మీదేవి'

'స్పానిష్ భాషాసాహిత్యం 'సర్వాంతిస్'తో పుట్టి అతనితోనే మరణించింది' అన్న ప్రసిద్ధోక్తి ప్రచారంలో ఉన్నది. ఈ అభియుక్తోక్తి సారమేమంటే ప్రపంచ సాహిత్యపరిధులను సమీపించే రచన స్పానిష్‌భాషలో సర్వాంతిస్‌ది మాత్రమేనని. అతని ముఖ్య గ్రంథం డాన్‌క్వీక్సోట్. ఈ పదాన్ని స్పానిష్‌భాషలో కిహోటే అని పలుకుతారు.

సర్వాంతిస్ (పూర్తి పేరు – మిగువెల్ డి సర్వాంతిస్ సావేద్రా) స్పెయిను దేశంలో క్రీ. శ. 1547లో ఆల్కాలాడెహెనారెస్ అనే చిన్న పట్టణంలో జన్మించాడు. తండ్రి వైద్యుడు. మాడ్రిక్‌లో విద్యాభ్యాసం చేసిన కాలం నుంచీ సర్వాంతిస్ రచన చేస్తూనే ఉండేవాడు. 1570లో సైనికుడై–ఆ వృత్తి సహజమైన కష్టాలుపడి — యుద్ధాలలో గాయాలు పొంది–ఎడమచేయి పోగొట్టుకొని శత్రువులచేత చిక్కి– 1580లో విడుదల చేయబడ్డాడు. 1582 నుంచి సాహిత్యజీవిగా స్థిరపడ్డాడు. ఈ గ్రంథం ప్రథమభాగాన్ని 1605లో ద్వితీయభాగాన్ని 1614లో ప్రకటించాడు. ఈ గ్రంథం కాక 'ఎగ్జెంప్లరీ టేల్స్' అన్నది కూడా కొంత ప్రసిద్ధిని పొందింది. ఇతడు 1616లో మాడ్రిడ్ నగరంలో మరణించాడు.

### కథ

శౌర్య ఔదార్య సాహసాదిగుణాలు గల వీరుని కృత్యములుగా అల్లబడే అద్భుత కథలకి సర్వాంతిస్ రచన అపహాస్యంతో కూడిన వెక్కిరింపు కావ్యం.

పదహారవ శతాబ్ది స్పెయిను దేశంలో లామంచా ప్రాంతంలో ఒక గ్రామంలో 'అలన్సో క్విజానో' అనే పెద్దమనిషి ఉన్నాడు. పూర్వ వీరుల శౌర్య ఔదార్య గుణాలతో నిండిన అద్భుతగాధల్ని – ఆ వీరులు కష్టాలలో ఉన్న సుందరాంగులను ఆదుకుంటూ, దుర్మార్గుల్ని, భీకరమృగాల్ని సంహరిస్తూ విహరించిన వీరగాధల్ని నిరంతరం చదివి ఆనంద పులకితుడౌతుండేవాడు. ఇటువంటి గాధల్ని ఎక్కువగా చదివినందువలన అతడు మళ్లీ అటువంటి అద్భుత వీరసాహసకృత్యాలు చెయ్యవచ్చుననీ, అసలట్లా చేయడం మళ్ళీ దేశంలో పునరుద్ధరింపబడాలనీ దృఢంగా విశ్వసించి సాహసకృత్యాలకై వెదకుతూ శూరుడుగా తానే బయలుదేరాడు. ఒక పాత కవచాన్ని, తుప్పుపట్టిన కత్తిని సంపాదించాడు. మంగలి దగ్గర ఉన్న పెద్ద గిన్నెను శిరస్త్రాణంగా పెట్టుకున్నాడు. 'రాక్సినాంటి' అనే పేరు గల ముసలి గుర్రాన్ని సంపాదించాడు. ప్రతి సాహస వీరునికి ఒక ప్రియురాలు కూడా ఉండాలి కనుక– ఒక పల్లెటూరి పిల్లను ప్రియురాలుగా ఎన్నుకుని ఆమెకు 'డల్‌సినియా డెల్‌టొబోసో' అనే పెద్ద పేరు పెట్టుకున్నాడు. ఇంతకూ ఆమెను తానొక సారి చూచాడో లేదో. ఆమెకు ఇతని ఉనికి కూడా తెలియదు. ఆమె సర్వలక్షణ సంపన్న అని భావనలు చేశాడు. తన పేరు 'డాన్‌క్విక్సాట్' అని మార్చుకున్నాడు.

ఇక అతన్ని యోధుడనే బిరుదుతో ప్రభులెవ్వరైనా సత్కరించవలసి ఉన్నది. అందుకోసం ప్రయాణం చేసి ఒక పెద్ద పూటకూళ్ల ఇంటికి చేరుకున్నాడు. అది అతని దృష్టిలో ఒక పెద్ద కోట. దాని యజమాని (పూటకూళ్లవాడు) పెద్ద ప్రభువు. తన్ను వీరయోధ బిరుదుతో అలంకరించి-అందుకు అవసరమైన క్రియలు చేయమని పూటకూళ్లవానిని ప్రాధేయపడ్డాడు. ఇతడొక అపాయంలేని పిచ్చివాడని తలచి - అతడట్లాగే చేశాడు. అక్కడ చేరిన వాళ్లంతా నవ్వుతూండగా, తిరిగి గ్రామానికి వచ్చి 'సాంచోపాంజా' అనే రైతుని తన సేవకుడుగా కుదుర్చుకున్నాడు – తానెన్నో ఘన విజయాలు సాధించిన తరువాత వాడిని ఒక దీవి రాజ్యానికి గవర్నరు చేస్తానని ఆశపెట్టి.

ఇక వాళ్ళ సాహసకృత్యాలు హాస్యంగా మారి, వాళ్లకెన్నో కష్టాలు తెస్తాయి. అయితే ఎంత అపహాస్యకర సంఘటనైనా మహాద్భుత కార్యంగా ఊహించుకోగల భావన డాన్‌క్విక్సాట్‌కు ఉన్నది. ఎన్నో సంఘటనలు జరిగినై. గాలిమరల్ని (విండ్ మిల్స్) పెనుభూతాలనుకుని తలపడి గుర్రం మీద నుంచి క్రిందపడిన సంఘటన చాలా ప్రఖ్యాతి గలది. ఇంకోసారి గొర్రెల మందను పెద్ద సేనగా భావించి కలియపడగా - గొర్రెలకాపర్లు చితుక పొడిచారు. రాత్రిపూట ఒక ఇల్లు చేరుకున్నారు. దానిలోంచి విచిత్రధ్వనులు వస్తున్నాయి. దాన్నొక పెద్ద కోట అనుకుని మరునాడుదయం దాన్ని ముట్టడించబోయాడు. అదొక మిల్లు. మరొకనాటి రాత్రి ఒక పూటకూళ్ళ ఇంటికి చేరుకున్నారు. అక్కడ ద్రాక్ష పానీయం తోలుతిత్తులలో నింపి ఉన్నది. ఆ తోలుతిత్తుల్ని పెనుభూతాలనుకుని కత్తితో వాటి మీద పడ్డారు. పైకి పొంగి కారిన ద్రాక్షసారాని నెత్తురని భావించాడు.

డాన్‌క్విక్సాట్, సాంచోపాంజా సాహసకృత్యాలతో కొన్ని ఉపకథలు పెనవేసుకుని ఉన్నాయి. ఒక ప్రధాన ఉపకథలో ఇద్దరు ప్రేమికుల వృత్తాంతం. ఎన్నో అవరోధాలను అధిగమిస్తేనే గాని వాళ్ళను భార్యాభర్తలు చేయడానికి వీలుపడదు. ఇంకో ఉపకథ-ఒక స్పెయిను దేశీయుణ్ణి అల్జీరియా వాళ్ళు (మూర్స్) బందీగా పట్టుకుంటే అతడు తప్పించుకొని పారిపోయి వచ్చాడు - అందమైన అల్జీరియా స్త్రీని వెంటబెట్టుకుని. ఇందులో పాత్రలు



కబుర్లు చెప్పుకుంటూ అందులో కథలు చెప్పుకుంటారు. కథ మధ్యలో కథ మధ్యలో కథ.

డాన్‌క్విక్సాట్ బంధువులు అతని క్షేమాన్ని గురించి ఆందోళనపడి వెతుక్కుంటూ వచ్చి పట్టుకుంటారు. అతని ప్రియురాలు 'డల్‌సినియా' జబ్బుతో ఉన్నదని నాటకమాడి అతన్ని ఇంటికి తీసుకు వస్తారు. అతన్ని ఒక బోనులో కూచోబెట్టి దాన్ని ఎద్దులబండిలో పెట్టి ప్రయాణం సాగిస్తారు. అతడు బలహీనంగా - చిత్తస్థైర్యంలేక ఉంటాడు. ఇంట్లో బంధువులు జాగ్రత్తగా చూస్తారు.

డాన్‌క్విక్సాట్ ఆరోగ్యం బాగుపడింది కాని బుద్ధి కుదుట పడలేదు. సేవకునితో కలిసి మళ్ళీ సాహస యాత్రలకు బయలుదేరుతాడు. సేవకుడు సాంచోపాంజాకు అతని పైన హాస్యం చెయ్యాలని పించి ఎదురుగా మొట్టమొదట వచ్చిన పల్లెటూరి పిల్లను 'డల్‌సినియా' అని చెప్పుతాడు. అయితే అతడు మోసపడలేదు.

అనేక సాహసకృత్యాల తర్వాత ఒక జమీందారుగారి కోటను చేరుకున్నాడు డాన్‌క్విక్సాట్. అతనివెంట సేవకుడు సాంచోపాంజా ఉన్నాడు. ఆ కోటకు ప్రభువైన జమీందారు, అతని భార్య డాన్‌క్విక్సాట్ వెర్రి చేష్టలను గురించి అంతకు ముందే విని ఉన్నారు. అందుచేత ఇతన్ని ఆట పట్టిద్దామని తమాషాగా నాటకమాడారు.

ఆ నాటకం ఏమంటే-డాన్‌క్విక్సాట్ తన మహా ప్రతాప వీర సాహస కృత్యాలను పొగడుకుంటూ చెప్పుతున్న కల్పనలన్నీ నిజమైనవిగా నమ్ముతున్నట్లు నటించడం అతడొక మహా గొప్ప శౌర్య సాహసవీరుడని అమిత గౌరవం చూపిస్తున్నట్లు నటించడం. ఉత్తమ స్త్రీలు దుష్టుల చేతుల్లో చిక్కుకుని కష్టాలు పడుతున్నారని వార్తలు తెప్పించి ఇతని సహాయాన్ని అర్థించడం. ఇదంతా జమీందారుకి హాస్యం. డాన్‌క్విక్సాట్‌కు మాత్రం అంతా వాస్తవమే. జమీందారు నౌకర్లంతా యీ హాస్య నాటకంలో ఏమీ తెలియనట్లు పాల్గొంటారు. ఈ నాటకానికి పతాక సన్నివేశమేమంటే దేవలోక స్త్రీలవంటి కన్యలు దుర్మార్గులైన మంత్రగాళ్ళ చేతుల్లో చిక్కి-పోయినట్లు చూపించడం. అందులో డాన్‌క్విక్సాట్ ప్రియురాలు డల్సీనియా కూడా ఉన్నదని నమ్మింపజేయటం.

పిరుదులమీద మూడువేల కొరడా దెబ్బలు కనుక డాన్‌క్విక్సాట్ కొట్టించుకుంటే డల్సీనియాను రక్షింపవచ్చునని చెప్పారు. అయితే ఆ దెబ్బలు



ముప్పై ఐదేళ్ళ విన్సెన్‌జా డి రోసా అనే ఆవిడ ఇటలీలో ఒక పేరుమోసిన దొంగ. వరసపెట్టి దొంగతనాలు చేసుకు పోతున్న విన్సెన్‌జాని చివరికి ఎలాగైతేనేం పెస్కా-వా నగర పోలీసులు పట్టుకున్నారు. శ్రీ కోర్టువారు ఆమెకి ఆరేళ్ళ జైలుశిక్ష విధించారు. కాని తీరా పోలీసులు ఆమెని జైల్లో పెట్టబోయేసరికి ఆవిడగారు కాస్తా తల్లికాబోతున్నదని తెలిసింది.

'గర్భవతి అయిన స్త్రీని జైలులో వుంచరాదు'-అని ఇటలీలో ఓ చట్టం వుంది. దాంతో పోలీసువారు ఆమెని భద్రంగా ఇంటికి చేర్చారు. ఇటలీలో మరో చట్టం కూడా వుంది—ఈ చట్టం ప్రకారం 'ఆరెన్నెల్ల పసిపాప గల తల్లుల్ని జైలులో వుంచరాదు.' కాబట్టి పోలీసులు విన్సెన్‌జా పాపకి ఆరెన్నెల్లు దాటేదాకా కాచుక్కూర్చున్నారు. గడువు దాటిన తరువాత హుటాహుటీన బయల్దేరి ఆమె ఇంటికి వెళ్ళారు. కాని తెల్లమొహంవేసుకుని తిరిగివచ్చారు. కారణం-ఆవిడగారు మళ్ళీ గర్భవతి అయింది!

1972లో శిక్షపడిన విన్సెన్‌జా ఆరేళ్ళ పాటు వరసగా గర్భం ధరించేస్తూ పోలీసుల్ని ముప్పతిప్పలుపెట్టి జైలుశిక్ష తప్పించుకుంది. పోలీసులు ఈమధ్య యధాలాపంగా ఆమె మళ్ళీ గర్భవతి అయ్యుంటుందిలే అన్న ధీమాతో వెళ్ళారు. కాని ఆమె గర్భవతి అని తెలియజేయడానికి తగిన వైద్య పత్రం లభించకపోవడంతో ఆశ్చర్యపోయి ఆమెని అరెస్ట్ చేశారు. పాపం విన్సెన్‌జాని ఈసారి 'గర్భదేవత' వరించలేకపోయింది!

తన సేవకుడు సాంచోపాంజా కొట్టవచ్చు.

సాంచోపాంజాకు డాన్‌క్విక్సాట్ యిస్తానన్న ఒక దీవి గవర్నరు పదవి కూడా ఆ జమీందారు ఇచ్చి నాటకం పొడిగించారు. ఆ దీవి పేరు బారటేరియా, అది జమీందారు ఎస్టేటులోని కుగ్రామం. ఆ గ్రామస్థులకు ముందుగానే జమీందారు యీ నాటకం సంగతులు చెప్పి సాంచోపాంజాను గవర్నరుగా చూడమన్నాడు. సాంచోపాంజా చాలా తెలివిగానే పరిపాలన చేశాడు. అయితే. గవర్నరుకి ప్రత్యేక వైద్యుడొకడుండి యితడిని ఏమీ తిననివ్వలేదు. ఏమితింటానన్నా - అది రోగం తెస్తుందని - గవర్నరు ఆరోగ్యం ప్రజలకు ముఖ్యమని అడ్డు చెప్పి-బాధలు పెట్టాడు. నాటకంలో ఒక భాగంగా శత్రు సైనికులు వచ్చి ఆ దీవి మీద పడ్డారు. సాంచోపాంజాకు బాగా తన్నులు తగిలినై. సాంచోపాంజా పన్నెండు రోజులకే గవర్నరు పదవికి రాజీనామా ఇచ్చి - తాను నిజాయితీ గల వాణ్ణని ఏమీ సంపాదించుకోలేదనీ - తన పాత గుడ్డలతోనే తిరిగిపోతున్నానని ప్రకటన చేశాడు.

శాన్సన్ కేరదస్కో- అనే యువకుడొకడు యోధునివేషంలో వచ్చి డాన్‌క్విక్సాట్‌ను ద్వంద్వ యుద్ధానికి పిలుస్తాడు. ఓడినవాడు గెలిచినవాని ఆజ్ఞ శిరసావహించాలన్న షరతు పెట్టాడు. ద్వంద్వ యుద్ధం జరిగింది. శాన్సన్ గెలిచాడు. డాన్‌క్విక్సాట్ స్వగ్రామానికి వెళ్ళిపోయి మళ్ళీ కత్తి పట్టకూడదని ఆజ్ఞ చేశాడతను. డాన్‌క్విక్సాట్ ఆశాభంగం పొందాడు. కాని చెప్పిన మాట ప్రకారం అతని ఆజ్ఞ శిరసా వహించాడు. ఇక తాను యోధుడు కాలేకపోతే — పశువుల కాపరిగా — కొండలలో - కోనలలో సస్యశ్యామలమైన బయళ్ళలో సంచరిద్దామనుకున్నాడు. అతనికి జబ్బుచేసి ఆ కోరిక తీరకపోయింది. ఆ జబ్బు ఫలితంగా ఉన్న వెర్రి కాస్త వదిలిపోయి - మామూలు మనిషి అయ్యాడు.

సాంచోపాంజా మాత్రం - "మీరు త్వరగా కోలుకొండి డల్సీనియాను వెదకుదాం" అన్నాడు. డాన్‌క్విక్సాట్ అతన్ని మందలించి - ఆ మానసిక భ్రమలు వదలిపెట్టమని చెప్పి - స్వాస్థ్యమైన మనస్సుతో-దైవభక్తితో-కొన్నాళ్ళకు గతించాడు.

ఈ గ్రంథం ఒక గొప్ప అపహాస్య రచన. తాత్త్విక దృష్టితో చూస్తే వాస్తవికతకు-భ్రమకు-మధ్య ఉన్న తారుమారును చూపే కావ్యం. □

# అబ్బూరి కమలాదేవి

నాటక రంగంలో ఆడవారు ఆడ పాత్రలే ధరించి పేరు తెచ్చుకోవడంలో విశేషమేమీ లేదు. అట్లాగే మగవారు ఆడపాత్రలు ధరించి ప్రేక్షకాదరణ పొందడంలోనూ వింతేమీలేదు. కాని ఆడవారు మగపాత్రలు ధరించి విశేషమైన ప్రేక్షకాభిమానం సంపాయించడం అన్నది మాత్రం చెప్పకోదగ్గ విషయం. అలా పేరు తెచ్చుకున్న నటనా విదుషీమణి శ్రీమతి అబ్బూరి కమలాదేవి.

**1925** లో బందరు సమీపంలోని పెడన గ్రామంలో పుట్టిన కమలాదేవి మీద ఆమె అన్నగారైన శ్రీ తోట సుబ్రహ్మణ్యం ప్రభావం పడింది. అప్పటికే ఆయన నాటకాలలో పేరు తెచ్చుకున్నారు. ఆ ప్రభావంతో పాఠశాలలో చదువుతున్నప్పుడే కమలాదేవి 'సతీ సావిత్రి' నాటకంలో సత్యవంతుని పాత్ర ధరించి పలువురి మన్ననలు పొందారు.

'కృష్ణలీలలు' నాటకంలో దేవకి పాత్ర ద్వారా మొట్టమొదట నాటక రంగానికి పరిచయం చేసిన గురుదేవులు జి. మల్లిఖార్జునరావుగారైతే, ఆడవారు కూడా మగ పాత్రలు ధరించవచ్చునని ధైర్యాన్నిచ్చి ప్రోత్సహించారు స్వర్గీయ ఎమ్. రంగారావుగారు'' అని చెప్పారు కమలాదేవి.

ఆ రోజుల్లో ఆమెకి బాగా పేరు తెచ్చినవి– 'తులసీదాస్' నాటకంలోని మమత పాత్ర, హరిశ్చంద్ర నాటకంలోని చంద్రమతి పాత్ర. ఆ నాటి నాటకరంగంలోని ఉద్దండులందరితోనూ ఆమె నటించి వారికి సమఉజ్జీగా పేరు తెచ్చుకున్నారు. అబ్బూరి నాగేశ్వరరావు స్థాపించిన అబ్బూరి కంపెనీలో చేరి 'అబ్బూరి కమల'గా ఆమె పేరు పొందారు.

రాముడు, కృష్ణుడు, హరిశ్చంద్రుడు, దుర్యోధనుడు, కర్ణుడు, అర్జునుడు, బిల్వమంగళుడు మొదలైన పురుష పాత్రలు, సత్యభామ, రుక్మిణి, చిత్రాంగి, చింతామణిలో రాధ మొదలైన స్త్రీ పాత్రలు ఆమెకి కరతలామలకాలు. అబ్బూరి కంపెనీలో వుండగా ఆమె అన్నీ మగపాత్రలే ధరించడం ఒక విశేషం!

**1952**లో ఆమె, భర్త శ్రీ వి. శేషగిరిరావుతో కలిసి 'కమలా నాట్యమండలి' స్థాపించి కొంత మంది కళాకారులకు నెల జీతాలు ఇస్తూ నాటక ప్రదర్శనలను ముమ్మరంగా జరిపారు. అనాధ బాలబాలికలకు నాటకరంగంలో శిక్షణ ఇచ్చి, వారిచేత ప్రదర్శనలు యిప్పించి, వారికి వివాహాలు కూడా జరిపించిన ఆదర్శవనిత–కమలాదేవి.

**1961** లో కమలా నాట్యమండలిని 'జాతీయ మహిళా నాట్యమండలి'గా మార్చి ఆంధ్ర దేశంలోని వివిధ పట్టణాలలో ప్రదర్శనలు యిచ్చి, ఘన సన్మానాలను, సువర్ణ కంకణాలను, కనకాభిషేకాలను ఆమె అందుకున్నారు. ఆమె స్థాపించిన ఈ నాట్యమండలికి ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ గుర్తింపు లభించింది.

శ్రీమతి కమలాదేవి తన కళాభినివేశాన్ని కేవలం నాటక రంగానికే పరిమితం చెయ్యలేదు. **1947** లో ఉదయశంకర్ నిర్మించిన 'కల్పన' చిత్రంలో ఆమె ఒక నాట్యం చేశారు. ఆ తర్వాత ఆమె చలనచిత్ర రంగానికి దూరంగా వుంటూ వచ్చినా ప్రముఖ దర్శకుడు తిలక్ 'కొల్లేటి కాపురం', 'భూమి కోసం' చిత్రాలలో ఆమెని నటింపజేశారు. ఇటీవల వచ్చిన 'తరం మారింది' చిత్రంలో కూడా ఆమె నటించారు.

—మల్లిడి కనకరత్నం



హరిశ్చంద్రుడిగా...

# జుట్టుకు సిల్క్‌వంటి మృదుత్వము నిచ్చుటకు నైసర్గిక ఉపాయము...



శుద్ధమైన షీకాయిలోని సహజ లాభకర గుణములు స్వస్తిక్ షీకాకాయ్ సబ్బులో నింపబడినవి. వాడడానికి అనువైనది. లిక్విడ్ షాంపూ కంటే ఎంతో పొదుపైనది.



దీని పుష్కలమైన, మృదువైన నురగ మీ జుట్టును మెత్తగా, పూర్తిగా శుభ్రపరుస్తుంది.
మీ జుట్టును ఆరోగ్యంగా, నిగనిగాలాడేలా వుంచుతుంది. తాజా సువాసన నింపి పట్టువంటి మృదుత్వాన్ని ఒసగుతుంది.

SWASTIK
SHIKAKAI
TOILET SOAP FOR THE HAIR

# స్వస్తిక్ షీకాకాయ్ సబ్బు

ఇందులో షీకాయి కలిసి వుంది. భారత స్త్రీల అందమైన జుట్టుకు పారంపర్యమైన రహస్యము.

shilpi dm 25/79 tel

# భాషలు నేర్చుకోండి

| తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం | మరాఠీ | గుజరాతీ | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| మ య | ம ய | ಮ ಯ | മ യ | म य | મ ય | ମ ଯ |
| మా యా | மா யா | ಮಾ ಯಾ | മാ യാ | मा या | મા યા | ମା ଯା |
| మి యి | மி யி | ಮಿ ಯಿ | മി യി | मि यि | મિ યિ | ମି ଯି |
| మీ యీ | மீ யீ | ಮೀ ಯೀ | മീ യീ | मी यी | મી યી | ମୀ ଯୀ |
| ము యు | மு யு | ಮು ಯು | മു യു | मु यु | મુ યુ | ମୁ ଯୁ |
| మూ యూ | மூ யூ | ಮೂ ಯೂ | മൂ യൂ | मू यू | મૂ યૂ | ମୂ ଯୂ |
| మృ యృ | — | ಮೃ ಯೃ | മൃ — | मृ यृ | મૃ યૃ | ମୃ ଯୃ |
| మౄ యౄ | — | — — | — — | — — | — — | — — |
| మె యె | மெ யெ | ಮೆ ಯೆ | മെ യെ | — — | — — | — — |
| మే యే | மே யே | ಮೇ ಯೇ | മേ യേ | मे ये | મે યે | ମେ ଯେ |
| మై యై | மை யை | ಮೈ ಯೈ | മൈ യൈ | मै यै | મૈ યૈ | ମୈ ଯୈ |
| మొ యొ | மொ யொ | ಮೊ ಯೊ | മൊ യൊ | — — | — — | — — |
| మో యో | மோ யோ | ಮೋ ಯೋ | മോ യോ | मो यो | મો યો | ମୋ ଯୋ |
| మౌ యౌ | மௌ யௌ | ಮೌ ಯೌ | മൗ യൗ | मौ यौ | મૌ યૌ | ମୌ ଯୌ |
| మం యం | — | ಮಂ ಯಂ | മം യം | मं यं | મં યં | ମଂ ଯଂ |
| మః యః | — | ಮಃ ಯಃ | മഃ യഃ | मः यः | મઃ યઃ | ମଃ ଯଃ |

[వచ్చే సంచికలో మరికొన్ని]



మద్రాసు ఆదర్శ మహిళామండలి ఇటీవల తమ ప్రథమ వార్షికోత్సవాన్ని వైభవంగా జరుపుకున్నారు. ఆ నాటి కార్యక్రమానికి సినీ నటి కాంచన ముఖ్య అతిథిగా విచ్చేశారు. మండలి అధ్యక్షురాలు గోటేటి సీతా బాపేశ్వర్ అతిథిలకు స్వాగతం పలికారు. నిర్మలా ముద్దుకృష్ణారెడ్డి బహుమతి ప్రదానం చేశారు.

హైద్రాబాద్ శ్రీనగర్ కాలనీలో ఆంధ్ర బ్యాంకు శాఖ ప్రారంభించిన సందర్భంగా వెల రోజుల పాటు కళలు, చేతి పనుల ప్రదర్శన శాలను ఏర్పాటు చేశారు. బొమ్మలు చేయడంలో ప్రథమ బహుమతి పొందిన రీటా అలగ్జాండర్‌కి రాష్ట్ర సంక్షేమ శాఖమంత్రి రోడామిస్త్రీ బహుమతిని అందజేశారు. పక్కనే వున్నవారు ఆంధ్రా బ్యాంకు శ్రీనగర్ కాలనీ శాఖ మేనేజర్ గీతా రాఘవన్.



# వార్తావనిత

విశాఖపట్నం సౌత్ లయన్ లేడీస్ ఆక్సిలియరీ ఆధ్వర్యంలో నగరంలోని నాలుగు లయన్‌లేడీస్ క్లబ్బుల సభ్యురాండ్రు, లయనెస్‌క్లబ్బు సభ్యురాండ్రు కలిసి అక్టోబరు 13వ తేదీన ఊటీ హొటల్‌లో సంయుక్తంగా ఏర్పాటు చేసిన సమ్మేళనానికి లయన్‌లేడీ చంద్రా రూబెన్ అధ్యక్షత వహించగా లయన్‌లేడీ సుశీలా పట్టాభిరామన్ ఆహుతులకు స్వాగతం చెప్పారు. లయన్ లేడీస్, లయనెస్ క్లబ్బుల డిస్ట్రిక్టు ఛెయిర్మన్ లయన్ ఎ. ఎస్. రాజా ముఖ్య అతిథిగా పాల్గొన్న ఆనాటి సభలో ప్రత్యేకవక్తగా లయన్స్ డిప్యూటీ డిస్ట్రిక్టు గవర్నరు లయన్ డా॥ బి. స్వామి ప్రసంగించారు. లయజాన్ ఆఫీసరు లయన్ సి: పట్టాభిరామన్ వందన సమర్పణ చేశారు. —విలేకరి



అక్టోబరు ఎనిమిదవ తేదీన ప్రపంచ లయన్సు సంస్థ "సర్వీస్ డే" (సేవా దినోత్సవం) సందర్భంగా విశాఖపట్నంలోని లయన్సు, లయన్‌లేడీస్ కింగ్ జార్జి హాస్పిటలులో రక్త ప్రదానం చేసినప్పటి దృశ్యం. జోన్ ఛెయిర్మన్, లయన్ డి. సిహెచ్. తిరుపతిరాజు, విశాఖ సౌత్ లయన్ లేడీస్ అడ్వయిజర్ లయన్ సి. పట్టాభిరామన్ కూడా ఫోటోలో ఉన్నారు. విలేకరి





హైద్రాబాద్ ఉస్మానియా విశ్వ విద్యాలయం టాగూర్ ఆడిటోరియంలో ప్రముఖ గాయని ఎం. ఎస్. సుబ్బులక్ష్మి గానం చేసిన అన్నమాచార్య కీర్తనలు ఐదు ఎల్. పి. రికార్డులను ముఖ్యమంత్రి డాక్టర్ మర్రి చెన్నారెడ్డి ఆవిష్కరించారు.

—మల్లిడి కనకరత్నం

రాజమండ్రి యువతీ రోటరాక్టు క్లబ్ 'ఛార్టర్ ప్రదానోత్సవం' ఇటీవల వైభవంగా జరిగింది. క్లబ్ అధ్యక్షురాలు ములుకుట్ల లలితకు ఆనాటి సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన మద్ది జవహర్ లాల్ ఛార్టర్‌ను యిచ్చారు.



అనంతపురం ఇన్నర్‌వీల్ క్లబ్ ఇటీవల ఉచిత హోమియోపతి క్లినిక్‌ను ప్రారంభించారు. ఆ సందర్భంగా జరిపిన సభలో ఆహుతులకు స్వాగతం చెబుతున్న క్లబ్ అధ్యక్షురాలు కె. కళావతి.




మద్రాసు మ్యూజిక్ అకాడెమీ హాలులో నవంబరు 3వ తేది రష్యన్ బాలె బృందంచే 'కోరియోగ్రాఫిక్ మినియేచర్స్' ప్రదర్శన జరిగింది. భారతదేశంలోని ప్రధాన నగరాలలో రెండు వారాలపాటు పర్యటించే ఈ బృందంలో 50 మంది సభ్యులు వున్నారు. భారత సాంస్కృతిక సంబంధ పరిషత్తు ఆధ్వర్యంలో ఈ కార్యక్రమాలు నిర్వహింపబడుతున్నాయి.






శ్రీకాకుళం రోటరీ ఇన్నర్‌వీల్ క్లబ్ ఇటీవల అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా 'అందాల బాల' పోటీ ఏర్పాటు చేశారు. ఆమదాలవలస సుగర్ ఫ్యాక్టరీ మేనేజింగ్ డైరక్టర్ సతీమణి సరోజిని ప్రసాద్ చిరంజీవి సరోజకు 'అందాల బాల' బిరుదు ప్రదానం చేసి కిరీటధారణ చేశారు. ఇన్నర్‌వీల్ క్లబ్ అధ్యక్షురాలు విమల కార్యదర్శి మహాలక్ష్మి ప్రసంగించారు.

మద్రాసులోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ 'కళాసాగర్' ఇటీవల స్థానిక మ్యూజిక్ అకాడెమి హాలులో అంతర్జాతీయ ఖ్యాతి గాంచిన నర్తకి మల్లికా సారాభాయ్ నాట్య ప్రదర్శనను ఏర్పాటు చేశారు. ఈ ప్రదర్శనలలో ఆమెతోబాటు మరో నలుగురు ఉత్తర భారతదేశపు నర్తకీమణులు కూడా పాల్గొన్నారు. 'మయూర్‌కుంద్', 'గీతా గోవిందం' నృత్యాలతో మల్లిక ప్రేక్షకుల ప్రశంసలు అందుకున్నారు. మల్లిక తల్లి, ప్రముఖ నాట్యతార అయిన మృణాళిని సారాభాయ్ ఆనాటి కార్యక్రమానికి వ్యాఖ్యాతగా వ్యవహరించారు. సినీ తార చంద్రకళ మల్లిక, మృణాళిని సారాభాయ్‌లను 'కళాసాగర్' తరఫున జరీ అంచు పట్టు వస్త్రాలతో సత్కరించారు. ఆనాటి సభకు సంగీత దర్శకులు తాతినేని చలపతిరావు అధ్యక్షత వహించారు.





# వార్తావనిత

తాడేపల్లిగూడెం డి. ఆర్. జి. స్త్రీల కళాశాల విద్యార్థినులు ఉపన్యాసకురాలు వి. విద్యావతి ఆధ్వర్యంలో పరిమళ్ళ గ్రామంలో పారిశుభ్రత, శిశు సంరక్షణ, పోషకాహారం మొదలైన అంశాలపై సేవా కార్యక్రమాల్ని నిర్వహించారు.



మద్రాసు ఆంధ్ర కళామండలి, దక్షిణ రైల్వే విభాగం వారు అక్టోబర్ 22న సారస్వత సమావేశం జరుపుకున్నారు. ఆనాటి సభకు సినీ నటి శారద అధ్యక్షత వహించారు. పట్టాభిరాం హిందూ కళాశాల ఉపన్యాసకురాలు యం. కె. జయభారతి, జె. లీలాకుమారి 'సంఘం పట్ల స్త్రీల బాధ్యతలు' అనే అంశంపై ప్రసంగించారు. మండలి కార్యదర్శి జి. సంజీవరాజు వందన సమర్పణ చేశారు.



హైద్రాబాద్ జవహర్ బాలభారతి ప్రాంగణంలో చిల్డ్రన్స్ ట్రాఫిక్ పార్కుకు హోంశాఖామాత్యులు ఎం. ఎం. హషీం శంఖుస్థాపనం చేశారు. ఆనాటి కార్యక్రమానికి మహిళల, బాలల సంక్షేమశాఖ మంత్రి రోడామిస్త్రీ అధ్యక్షత వహించారు.

—మల్లిడి కనకరత్నం



ఖరగ్‌పూర్ ప్రవాసాంధ్ర నవ్యకళాపరిషత్తువారు అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా తెలుగు పాఠశాలల విద్యార్థుల మధ్య జరిపిన నృత్యపోటీలలో బహుమతు లందుకున్న మహాకవి గురజాడ విద్యాలయం బాలికలు—'మాధవీ సనారా'

విశాఖపట్నంలోని వాసవీ మహిళామండలి ప్రథమ వార్షికోత్సవం అక్టోబరు 14వ తేదీన "వాసవీ భవన్"లో వైభవంగా జరిగింది. ఈ సందర్భంగా ఏర్పాటయిన సభకు శ్రీమతి బొడ్డు సీతారత్నమ్మ అధ్యక్షత వహించగా శ్రీమతి సర్వమంగళా కందూర్ (విజయనగరం) ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. కార్యదర్శి శ్రీమతి శేషస్వామి (పాలూరి) సంవత్సర నివేదికను సమర్పించారు. గీతా పఠనం, రంగోళీ, ఆటల పోటీలలోని విజేతలకు శ్రీమతి సి. రమాకపాడియా బహుమతులను పంచిపెట్టారు. ప్రధానవక్త విజయనగరం విమెన్స్ కాలేజీ తెలుగు లెక్చరర్, శ్రీమతి కె. శారదా సురేష్‌కు మండలి అధ్యక్షురాలు శ్రీమతి కందుల కమలమ్మ మెమెంటోను బహూకరించారు. కుమారి మణిప్రభ శాస్త్రీయ సంగీతం "ముగింపు మీదే!" అను బాలికల నాటిక ప్రదర్శన అనంతరం శ్రీమతి పందిరి హేమలతాదేవి వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది. —విలేకరి



## మృతి

భారత కార్మికోద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన సంఘ సంస్కర్త, కార్మిక నాయకురాలు అయిన మిస్. మణిబెన్ కారా అక్టోబర్ 28న బొంబాయిలో మరణించారు. ఆమె వయసు 75 సంవత్సరాలు. మిస్. కారా అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్, హింద్ మజ్దూర్ సభ, అఖిలభారత రైల్వే ఉద్యోగుల సమాఖ్యకు మాజీ అధ్యక్షురాలు.





# బాధ్యత!

విన్నకోట సుశీలాదేవి

"అమ్మా! ధర్మం చెయ్యండమ్మా! రెండ్రోజుల నుంచీ అన్నం లేదు. మీ కాళ్ళు పట్టుకుంటాను. ఒక్క పైసా ధర్మం చెయ్యండమ్మా'' – కోటిగాడు దీనంగా అడుగుతున్నాడు.

ఉదయం పదిగంటల సమయంలో, ఆ పెద్ద హోటల్ ముందు నిలబడి వచ్చేపోయే వారిని అడుగుతున్నాడు.

కాళ్ళకు అడ్డం పడుతున్న కోటిగాడిని విసుక్కుంటూ పక్కకు నెట్టిపోతున్నారు కొందరు. కొందరు విదిల్చి కొడుతున్నారు.

కోటిగాడికి దాదాపు ఎనిమిదేళ్ళుంటాయి. ఎండకి నల్లని శరీరం చెమటలు కక్కుతోంది. చిరిగిపోయిన లాగూ నడుం కింది నుండి వేలాడుతోంది. అప్పుడే మెడికల్ కాలేజీ నుంచి తీసుకొచ్చిన అస్థిపంజరంలా వున్నాడు కోటిగాడు. ఎవరూ ధర్మం చెయ్యటంలేదు. ఏ క్షణంలోనైనా శోషొచ్చి పడిపోయే స్థితిలో వున్నాడు కోటిగాడు.

"అమ్మా! ధర్మం చెయ్యండమ్మా''

రెండు కాళ్ళు పుచ్చుకున్నాడు. కాని ఆ కాళ్ళు విదిల్చి కొట్టలేదు. పైసా రాల్చలేదు.

ఆశ్చర్యంగా తలెత్తి చూసి వులిక్కి పడ్డాడు కోటిగాడు.

"అమ్మా! నువ్వా!'' అన్నాడు.

"అవున్రా! నీ అమ్మనే. పద నీ పని సెప్తా.''

అని జుట్టు పట్టుకుని కోటిగాడిని పైకి లేవదీసి రెక్క పట్టుకుని "పద" అంటూ బరబరా ఈడ్చుకు పోయింది.

నాలుగు రోడ్డులు దాటి వూరికి ఒక ప్రక్కగా వున్న తమ గుడిసెలవైపు దారి తీసింది రావులమ్మ. తడిక తోసుకుని కొడుకుని లోపలకు నెట్టి చూరులో నుంచి వాసం లాగి కొట్టడాని కెత్తింది.

"ఎందుకే కొట్టేదీ'' రోషంగా అడిగాడు కోటిగాడు.

"ఎందుకా! అడుక్కుతింటున్నందుకు. సిగ్గులేదూ అలా అడుక్కోడానికి'' కళ్ళెర్ర జేసింది రావులమ్మ.

"ఏం సేయను ఆకలేత్తా వుంటే! అన్నం పెట్టవ్. ఆకలతో సత్తే? జారిపోతున్న లాగూని పైకి లాక్కుంటూ అన్నాడు కోటిగాడు. అలా అంటుంటే కోటిగాడి కళ్ళల్లో నీళ్ళు తిరిగి జారడానికి సిద్ధంగా వున్నాయి.

రావులమ్మ తెల్లబోయింది.

"అన్నం పెట్టే. అడుక్కోబోను''

కొడుకు అడిగిన తీరుకి ఏం జవాబు చెప్పాలో తెలియక రావులమ్మ నిర్ఘాంతపోయింది. అప్రయత్నంగా చేతిలోని కర్ర దానంతటదే జారిపోయింది! తల్లి చేతిలోంచి కర్ర జారిపోవడం చూసి ధైర్యం కలిగింది కోటిగాడికి.

"ఆకలీ'' అంటూ కళ్ళు నులుముకుంటూ ఏడుపు ప్రారంభించాడు.

"మీ అయ్యని రానీరా! వండి పెడ్తా'' అంది నెమ్మదిగా ఇంకేం చెప్పాలో తెలియక.

మనసులో తన చేత కాని తనానికి తననే తిట్టుకుంది.

## లోకజ్ఞానం - సమాధానాలు

1. మేరీ క్యూరి. ఫ్రాన్స్ దేశస్థురాలైన ఈమెకు 1903 లో భౌతిక శాస్త్రంలో జరిపిన పరిశోధనలకు నోబెల్ బహుమతి లభించింది. ఈ బహుమతిని ఆమె ఎ. హెచ్. బెక్వెరల్, పియరీ క్యూరీలతో పంచుకున్నారు. 1911 లో తిరిగి ఆమెకి రసాయనిక శాస్త్రంలో నోబెల్ బహుమతి లభించింది.

2. గత సంవత్సరం 'నోబెల్ శాంతి బహుమతి'ని ఇద్దరు 'షేర్' చేసుకున్నారు. వారు-ఈజిప్ట్ అధ్యక్షుడు అన్వర్ సాదత్, ఇజ్రేల్ ప్రధాని బెగెన్.

3. శాంతా రంగస్వామి.

4. గోల్డామీర్. 1969 లో ఆమె ఇజ్రేల్ ప్రధాని అయ్యారు. 1973 లో ఆమె ప్రధానిగా వుండగానే సిరియా, ఈజిప్ట్ దేశాలు ఇజ్రేల్ మీద యుద్ధం ప్రకటించాయి.

5. ఛార్లొటి డాట్. (1871-1960) 1887 లో ఆమె వింబుల్డన్ ఛాంపియన్‌షిప్ గెలుపొందారు. అప్పటికి ఆమె వయసు 15 ఏళ్ల తొమ్మిది నెలలు మాత్రమే. అయితే వింబుల్డన్ పోటీలలో పాల్గొన్న వారిలో అతి పిన్నవయస్కురాలు-అమెరికాకు చెందిన ట్రేసీ ఆస్టిన్. 1977 లో 14 ఏళ్ల 7 నెలల ప్రాయంలో ఆమె ఈ పోటీలలో పాల్గొన్నది.

6. లతామంగేష్కర్. ప్రముఖ గ్రామఫోన్ రికార్డు సంస్థ హెచ్. ఎమ్. వి. మాతృసంస్థ అయిన ఇ. ఎమ్. ఐ. ఇటీవల లండన్ రాయల్ ఆల్బర్ట్ హాలులో లతామంగేష్కర్‌కి 'ప్లాటినమ్ డిస్క్' బహూకరించింది.

7. శ్రీమతి ఫ్రాన్సెస్ క్రాస్‌బి (1820 — 1915). అమెరికా దేశస్థురాలు. ఆమె ఆరు వారాల పసివయసులో వుండగానే గుడ్డితనం ఏర్పడింది. అయినా నిరుత్సాహం చెందక, కృషితో మొత్తం 8,500 శ్లోకాలు (ఆంగ్లంలో) రాసి రికార్డు సృష్టించింది.

8. 'వాలీ ఆఫ్ ది డాల్స్'. జాక్వలిన్ సుసాన్ (1921-'74) రాసిన ఈ నవల మార్చి '66 లో తొలిసారిగా ప్రచురించబడింది. ఏప్రిల్ 1977 నాటికి 2 కోట్ల 2 లక్షల 30 వేల కాపీలు అమ్ముడుపోయాయి. ఈ నవల పేపర్ బ్యాక్‌లో ప్రచురించిన ఆర్నెల్లలోనే అరవై ఎనిమిది లక్షల ప్రతులు అమ్ముడు పోయాయి.

9. కేథరిన్ హెప్‌బర్న్. ఆమె మూడు సార్లు ఈ అవార్డును పొందారు. 'మార్నింగ్ గ్లోరి' (1933), 'గెస్ హూ ఈజ్ కమింగ్ టు డిన్నర్' (1967), 'ది లయన్ ఇన్ వింటర్' (1968) చిత్రాలలో ఉత్తమ నటిగా ఈ అవార్డు ఆమెకి లభించింది.

10. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో పేరుపొందిన గూఢచారిణి: అసలు పేరు మార్గరెట్ జి. జెల్లి. 1870 లో జన్మించిన ఈమె 1917 లో ఫ్రెంచి సైన్యానికి పట్టుబడి వారిచే హతమార్చబడింది.

కొడుకు ఆకలంటే పట్టెడన్నం పెట్టలేని జన్మ ఎందుకూ అనుకుంది.

"నువ్వెప్పుడూ ఇలాగే అంటావ్ కాని అన్నం పెట్టవ్" అన్నాడు కోటిగాడు.

కోటిగాడి ఏడుపు చూసి మిగతా పిల్లలు కూడా ఏడుపు అందుకున్నారు.

రావులమ్మ విసుక్కుంది.

"నన్ను సంపెయ్యండిరా పీడా పోతుంది" అంటూ తలొకటీ అంటించింది కోపంగా.

పిల్లలు ఇంకా ఏడుపు ఎక్కువ చేశారు.

"నోర్మూస్తారా లేదా?" అంటూ పక్కనున్న కర్ర పట్టుకుంది.

పిల్లలు టక్కున ఏడుపు ఆపేశారు.

ఆకలితో నీరసించిన శరీరాలు దెబ్బలు తినడానికి ఇష్టపడలేదు. కర్ర పారేసి రావులమ్మ గుమ్మంలో మొగుడి కోసం ఎదురు చూస్తూ కూర్చుంది.

*

పొద్దుపోతుండగా వచ్చాడు వీరడు తూలుకుంటూ. సారా వాసన ఆమడ దూరానికి గుప్పున కొడుతోంది. రావులమ్మ మొగుడి చేతుల కేసి ఆశగా చూసింది. పిల్లలు తండ్రి మీదికి ఎగబడి చొక్కా జేబులు వెతకసాగారు.

"ఛీ! వదలండిరా!" అంటూ వీరడు అరిచాడు.

పిల్లలు బిక్కమొగాలేసి దూరంగా జరిగారు.

"మల్లీ తాగొచ్చినావేటి! ఊ! బియ్యం ఏవీ" రావులమ్మ అడిగింది.

'తేలా' నిర్లక్ష్యంగా అన్నాడు.

'డబ్బులన్నా వున్నయ్యా' అంది రావులమ్మ.

"లేవు" అని నులకమంచం వాల్చుకుని కూర్చున్నాడు వీరడు.

మొగుడి ధోరణికి రావులమ్మకి మండిపోయింది.

'అయితే ఎందుకొచ్చావ్ ఇంటికి' అంటూ అరిచింది.

"ఛీ! మొగుడింటికొస్తే ఏడుస్తావా!" అంటూ లేచి రావులమ్మ మీదికెళ్లాడు.

రావులమ్మ మొగుడిని అవతలకి తోసేసి—

"ఏడక! గొప్ప మొగుడొచ్చాడని సంతోసించనా! పెళ్లాం పిల్లలు వున్నారనే గ్యానం కూడా లేదు. సంపాయించిందంతా తాగొస్తావ్! పిల్లలకి కూడా కాస్త ఆ ఇసం పోయకపోయావ్"

అంటూ జాడించేసింది.

'సాలే! అపు' అని మళ్ళీ వెళ్ళి మంచం మీద కూర్చున్నాడు

"అపుతాన్లే! ముందెళ్ళి ఎక్కడైనా పిల్లలకి నూకలట్టుకురా! వాళ్ళు గంజినీళ్ళు తాగి రెండ్రోజులైంది. పిల్లలు ఆకలికి తట్టుకోలేక ముస్తెత్తుకుంటున్నారు తెలుసా!"

రావులమ్మ ఆ మాటలను ఎంత నిదానంగా చెబుదామనుకున్నా చెప్పలేకపోయింది. వీరడు అర్థం చేసుకోగలిగితే రావులమ్మ అన్న మాటల్లో బాధ, కోపం, రెండూ చోటు చేసుకున్నాయి.

కానీ ఆ మాటలను అర్థం చేసుకోలేదు గనుకనే—

"అడుక్కోనీవే" అన్నాడు వీరడు తాపీగా. రావులమ్మలో సహనం నశించింది.

"నువసలు మనిసివేనా" అంటూ మొగుడి కేసి విసురుగా రెండడుగులు వేసింది.

రావులమ్మ ఎంత విసురుగా లేచిందో వీరడు కూడా అంత విసురుగా లేచి—

"ఛీ! ఎదవగోల, బయటే బాగుండాది" అని లేచి బయటికి పోబోయేడు. రావులమ్మ తడికకి అడ్డుగా నిలబడి—

"పిల్లలు కూడు తిని రెండ్రోజులైంది" అన్నది.

"అయితే........"

"ఆళ్ళకేదైనా తింటానికి తీసుకురా. ఆళ్ళ పొట్టలు సూడు ఎన్నుకు ఎలా అతుక్కుపోయాయో" అంది బాధగా.

"నా దగ్గిర డబ్బుల్లేవు" అని వీరడు బయటకు పోబోయేడు.

# జనాభా సమస్య–స్త్రీ విద్య

ఇల్లాలుగా, తల్లిగా ఇంటినీ పిల్లల్నీ తీర్చిదిద్దడంలో స్త్రీలకు చదువు ఎంతో సాయపడుతుందని కొత్తగా చెప్పనవసరం లేదు. అందుకే 'అబ్బాయి చదువు అతని వరకే పరిమితం కాని, అమ్మాయిని చదివిస్తే భావి సంతతినే చదివించినట్లవుతుంది' అంటారు. అయితే మన దేశంలోని ఎన్నో సమస్యలకు పరిష్కారం స్త్రీ విద్య అనీ దేశ భవిష్యత్తుకు బంగారు బాట వేయడంలో స్త్రీ విద్య పాత్ర అద్వితీయమైనదనీ గుర్తించడం కూడా చాలా అవసరం.

మన దేశంలో రకరకాల సమస్యలు ఉత్పన్నం కావడానికి, ఉన్న సమస్యలు ఓ పట్టాన తీరక పోడానికి ముఖ్య కారణం అదుపు దాటిపోతూన్న జనాభా సమస్య అని కొందరి పరిశీలకుల అభిప్రాయం. ఏటా రూపొందిస్తున్న పరిష్కార మార్గాలు, కొత్తకొత్త పథకాలు సఫలం కాకుండా అడ్డుపడేది క్షణం క్షణం పెరిగిపోతున్న జన సంఖ్య. ఈ జనాభా పరిష్కారానికి స్త్రీ విద్యకు అవినాభావ సంబంధం వుంది.

స్త్రీలు చదువుకోడం వల్ల వారి పెళ్ళీడు ఇతోధికంగా పెరుగుతుంది. పాఠశాల చదువు పూర్తి చేయడానికే పదిహేనేళ్ల అవుతాయి. ఇంటర్, డిగ్రీ అని వెళ్ళడంతో వారి పెళ్లిళ్ల వయసు తప్పకుండా పెరుగుతుంది. ఐక్యరాజ్య సమితి విభాగం, భారత ప్రభుత్వం సంయుక్తంగా జరిపిన ఒక సర్వేలో కూడా ఇదే విషయం తేటతెల్లమయింది.

బాల్యవివాహాలు తరచూ జరగడం వల్ల ప్రపంచం మొత్తంలో మన దేశంలోనే స్త్రీల పెళ్ళిళ్ళ వయసు తక్కువగా వుంటోంది. రాష్ట్రాలవారీగా స్త్రీల పెళ్ళిళ్ల వయసును పరిశీలించినప్పుడు స్త్రీ అక్షరాస్యత ఎక్కువగా వున్న రాష్ట్రాలలో కూడా స్త్రీల వివాహ వయసు అధికంగానే వున్నట్టు తెలియవచ్చింది. నిరక్షరాస్యత ఎక్కువగా వున్న రాష్ట్రాలలో స్త్రీల పెళ్ళి వయసు తక్కువగానూ, బాల్యవివాహాలు విరివిగానూ కనిపించాయి.

కేరళ, తమిళనాడు, పంజాబు, పశ్చిమ బెంగాల్, కర్ణాటక, అస్సాం రాష్ట్రాలలో అక్షరాస్యులైన స్త్రీలు ఎక్కువ. దానికి అనుగుణంగా అక్కడ స్త్రీల పెళ్ళి వయసు కూడా ఎక్కువగానే కనబడింది. మన దేశంలో స్త్రీల సగటు వివాహం వయసు పదిహేను సంవత్సరాలయితే ఈ రాష్ట్రాలలో సగటు వివాహ ప్రాయం పదహారేళ్లకు పైబడి వుంది.

వివాహ ప్రాయం ఎక్కువ కావడంతో స్త్రీ సంతానయోగ్యకాలాన్ని తగ్గిస్తుంది. పర్యవసానంగా శిశు జనన సంఖ్య కూడా తగ్గుతుంది.

పరిమిత కుటుంబంలోని ఆనందం, దాని ఆవశ్యకత చదువుకున్నవారయితే ఇట్టే గ్రహించగలరు. అలాంటివారే కుటుంబ నియంత్రణకు తమకుతామే ముందుకు వస్తారు. పరిమిత కుటుంబ ఆవశ్యకతను గ్రహించి తమకు ఇంక సంతానం వద్దు అనుకున్న వారు కూడా కొందరు కుటుంబ నియంత్రణ శస్త్రచికిత్స చేసుకోడానికి వెనుకాడుతారు. ఇలాంటివారిలో చాలమటుకు విద్యాగంధం లేని వారే వుంటున్నారు. కుటుంబ నియంత్రణ పద్ధతులను అనుసరించడంలోనూ చదువుకున్నవారే ఎక్కువ ఆసక్తి కనబరుస్తారు. ఈ విషయంగా జరిగిన అనేక పరిశోధనలు విద్యావంతులైన స్త్రీలలో చాలామందికి పరిమిత సంతానమే వున్నట్లు వెల్లడయింది. కుటుంబ నియంత్రణలో అగ్రగాములైన రాష్ట్రాలలో విద్యావంతులైన స్త్రీల సంఖ్య కూడా ఎక్కువగా వుండడం గమనించదగ్గ విషయం! అంచేత కుటుంబ నియంత్రణ కార్యక్రమాలు సులభంగా నెరవేరాలంటే మొదట స్త్రీలలో నిరక్షరాస్యత లేకుండా చేయాలి.

మనిషి సామాజిక స్థాయిని నిర్ణయించేది ముఖ్యంగా ఆర్థిక స్థితి. ఉద్యోగ సంపాదనకూ, ఆర్థిక స్థితిగతులను పెంపొందించుకోడానికి చదువుకు వున్న ప్రాముఖ్యత చెప్పనవసరం లేదు. బాగా బ్రతికి పదిమందినీ బ్రతికించడానికి దోహదం చేసే చదువు ప్రాముఖ్యత గురించి అందరూ మాట్లాడుతూనే వున్నారు. ఇవాళ స్త్రీలలో అక్షరాస్యత పెరుగుతూనే వుంది. పై చదువులు చదివేవారు రోజురోజుకు ఎక్కువవుతూనే వున్నారు. అయినా పెరుగుతూన్న స్త్రీ జనాభాకు తగినట్టుగా వారిలో అక్షరాస్యత పెంపొందక పోవడం విచారకరం. □

"అయితే నువ్వెల్టానికి ఈలులేదు" అంది రావులమ్మ మొండిగా.

"నువ్వెవత్తివే? నన్నడ్డేందుకు? నా ఇట్టం" అని రావులమ్మని ఒక్క నెట్టునెట్టి వీరడు బయటికి వెళ్ళిపోయాడు!

వెళుతున్న మొగుడికేసి నిర్ఘాంతపోయి చూస్తూ నిలబడిపోయింది రావులమ్మ.

అంతవరకూ అమ్మా, అయ్యల పోట్లాటని వినోదంగా చూసి ఆనందిస్తున్న పిల్లలకి తండ్రి వెళ్ళగానే ఆకలి జ్ఞాపకం వచ్చింది.

"అమ్మా! ఆకలే!" అంటూ ఏడిచారు.

ఈసారి రావులమ్మ పిల్లల్ని విసుక్కోలేదు. కొట్టలేదు. అక్కడే నీరసంగా దడికానుకుని పిల్లల్ని దగ్గరకు తీసుకుంది. పిల్లల్ని చూస్తున్న కొద్దీ రావులమ్మకు దుఃఖం ఆగడం లేదు. కళ్ళల్లో నుంచి అదేపనిగా నీళ్ళు చెంపలమీదుగా స్రవించ సాగాయి.

పిల్లల ఆ బక్క శరీరాలను ప్రేమగా నిమర సాగింది. ఎంత అపుకుందామని ప్రయత్నించినా కన్నీళ్ళు ఆగడం లేదు.

పిల్లల్నందర్నీ ఆప్యాయంగా మరోసారి దగ్గరకు తీసుకుని వాళ్ళవేపు దిగులుగా చూసింది.

తన చుట్టూ వున్న పిల్లలు ఏ క్షణంలోనైనా ఆకలికి చచ్చిపోయేస్థితిలో వున్నారు.

అవును! వీళ్ళకి బువ్వపెట్టాలి. చేసుకున్నవాడికి లేకపోయినా తల్లిగా తనకి బాధ్యత వుంది.

హఠాత్తుగా ఏదో నిర్ణయానికి వచ్చినదానిలా లేచి నిలబడింది, రావులమ్మ. పిల్లల చేతులు పుచ్చుకుని "పదండిరా" అని బయటికి నడిచింది.

*

"అమ్మా! బాబూ! ధర్మం నెయ్యండి బాబూ! పిల్లల్ని సూడండి బాబూ! రెండ్రోజుల నుంచీ అన్నం లేదు"—

అని చెయ్యిచాచి, ఆ పెద్ద హోటల్ ముందు అడుక్కుంటోంది రావులమ్మ. ప్రొద్దున తన కొడుకు అదే హోటల్ ముందు అడుక్కుంటుంటే సహించలేకపోయిన రావులమ్మ.

అదే హోటల్ ముందు ఇప్పుడు తన తల్లి అడుక్కుంటుంటే ఆశ్చర్యంగా చూస్తుండి పోయాడు కోటిగాడు.

*

# DENIMS AND TOE RINGS

# TIPS AND TOES




If you're the casual young 'blue-jeans-and-silver' kind of girl, try our back-to-nature colours: *Juicy Apricot, Apple Blush, Russet Glow, Strawberry Cream* and *Plum Pudding* Nail Lustre shades. All specially formulated to last longer without chipping or peeling.

We also have 19 different 'personality' shades to choose from. In pearl and plain.

On view at all leading stores.

Also available: Lanolin enriched Tips and Toes Nail Lustre Remover.

**Make-up for nails.** TIPS AND TOES NAIL LUSTRE

వర్ణచిత్రం : ఏ. సత్యం



# ప్రొఫెసర్ కనకదుర్గ

సర్వాంగ సుందరమూ, సంపూర్ణమూ అయిన కళ నాట్యకళ. ఏనాడో భరతముని ప్రతిపాదించిన నాట్య శాస్త్రం ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కో రూపు సంతరించుకుంది. మామూలుగా పండితులు మాత్రమే ఆస్వాదించడానికి అనువుగా వున్న నాట్య కళను సామాన్యులు కూడా చూసి ఆనందించేట్టుగా చేయాలంటే అందులో ఎప్పటికప్పుడు ఎన్నో ప్రయోగాలు చేస్తూ కొత్త కొత్త రీతులు ప్రవేశపెట్టి ఎంతో కృషి చేయవలసి వుంటుంది. ఇవాళ అలా కృషి చేస్తున్న వారు చాలా కొద్దిమందే. ఆ కొద్ది మందిలో మున్నెన్నదగ్గవారు శ్రీమతి వాసిరెడ్డి కనకదుర్గ.

ఋగ్వేద మంత్రాలనూ, శ్రీ శ్రీ 'జగన్నాథ రథ చక్రాల్' లాంటి కవితలనూ సయితం నృత్య

రూపంలో జనరంజకంగా ప్రదర్శించవచ్చు అని ప్రప్రథమంగా నిరూపించిన నర్తకి - శ్రీమతి కనకదుర్గ. అందుకే ఆమె నాట్యం చూసిన విశ్వనాథ సత్యనారాయణగారు "చిరంజీవి కనకదుర్గ చేసిన నాట్యం అంతా ఛందోబద్ధమైన, రసవత్తరమైన కవిత్వం లాంటిది"—అని మెచ్చుకున్నారు.

బాల్యం నుంచే నాట్యకళ పట్ల ఎంతో అభిరుచి కనబరచిన కనకదుర్గ అతి త్వరలోనే అందులో అభినివేశం సంపాయించారు. తంజావూరు బాల సుబ్రహ్మణ్యం పిళ్లై వద్ద శాస్త్రీయ పద్ధతిలో భరతనాట్యం, సూరబ్ ఖాన్ గౌర్ వద్ద కథక్ నృత్యం అభ్యసించారు. రంగ ప్రవేశం చేసే నాటికే తారాచౌదరి, ఉదయశంకర్, గోపీనాథ తంగమణి, కృష్ణ అయ్యర్‌లాంటి నాట్య కోవిదుల అభినయరీతులను ఆకళింపు చేసుకుని దేశం నలుమూలలా నృత్య ప్రదర్శనలు జరిపి - నెహ్రూ, రాజేంద్రప్రసాద్, హరీంద్రనాథ్ చటోపాధ్యాయ వంటి ప్రముఖుల ప్రశంసలు అందుకున్నారు.

నృత్య నాటికలకు సరికొత్త రీతులలో నృత్యం కూర్చడంలో కనకదుర్గ చూపుతున్న నేర్పు అసాధారణమైనది. భారతీయ శాస్త్రీయ నృత్యం ఒక ప్రత్యేక సంప్రదాయానికి చెందినది. అలాంటి నృత్యాన్ని మధ్య ప్రాచ్య ఆహార్యంతో కూడిన పాత్రలకు 'అతిథిశాల' అన్న నృత్య నాటికలో సమకూర్చి ప్రముఖుల మన్ననలందుకున్నారు. సాంఘిక ఇతివృత్తం గల 'మూలస్తంభాలు' అనే నృత్య నాటికలో శాస్త్రీయ పద్ధతిలో నృత్య రీతులు చూపించారు.

క్షేత్రయ్య పదాలను, త్యాగరాజ కృతులను, రామదాసు కీర్తనలను ప్రత్యేకమైన శైలిలో అభినయించే కనకదుర్గ — శ్రీశ్రీ 'అంతేలే పేదల గుండెలు' 'జగన్నాథ రథ చక్రాల్' లాంటి కవితలను కూడా తన నృత్య ప్రదర్శనలలో దృశ్య కావ్యాలుగా అద్భుతంగా అభినయించడం — ఆమె సృజనాత్మక శక్తికి చక్కని ఉదాహరణ!

శ్రీమతి కనకదుర్గ విజయవాడ ప్రభుత్వ సంగీత కళాశాలలో ఉపన్యాసకురాలుగా నాట్య కళలో అనేకమంది యువతీ యువకులకు శిక్షణ ఇస్తున్నారు. రాష్ట్ర సంగీత నాటక అకాడెమీ సభ్యురాలైన ఈమెను మద్రాసు సంస్కృత విద్యా పీఠం గౌరవించింది. సంగీత కళానిధి ముసిరి నుంచి 'భరతనాట్య భూషణ' అన్న బిరుదును కూడా ప్రొఫెసర్ కనకదుర్గ అందుకున్నారు. ❋

## చిట్టి కథ

## పొరపాటు

"అమ్మాయ్ గీతా!" పార్వతమ్మగారి పొలికేక లాంటి పిలుపుకి 'పుస్తక ప్రపంచం'లోంచి తప్పనిసరిగా 'ఇహ ప్రపంచం'లో పడవల్సి వచ్చింది గీతకి. అలవాటు ప్రకారం నవలలో చదువుతున్న పేజీని మూల మడతపెట్టబోయి ఆగిపోయింది - భర్త మందలింపు గుర్తుకొచ్చి.

ఆమె భర్త—పుస్తకాలను పసిపిల్లల కంటే అపురూపంగా చూసుకుంటాడు. తనకు బాగా నచ్చిన పుస్తకాలను తప్పకుండా కొనడం, వాటిని బీరువాలో అందంగా అమర్చి, ప్రతి యేడాది వాటిని 'రివిజన్' (తిరిగి చదువుకోవటం) చేయటం అతనికున్న ఒకానొక హాబీ.

పుస్తకాలను నీట్‌గా వుంచడానికి అతనెన్నో జాగ్రత్తలు తీసుకుంటాడు. ఆ జాగ్రత్తల్లో — 'ఏదైనా పుస్తకం చదువుతూ మధ్యలో ఆగవల్సి వస్తే పేజీ నంబరు గుర్తుంచుకోవాలిగాని పేజీ కార్నర్‌ని మడత పెట్టగూడదు' అనేది ఒకటి.

కానీ ఆ విషయం మర్చిపోయి పేజీ మూల మడత పెట్టినందుకు ఎన్నోసార్లు భర్తచేత ముక్కచీవాట్లు తింది గీత.

ఆ విషయం గుర్తు రావడంచేత గీత పేజీ నంబరు చూసింది. 'పేజీ నంబర్ 25' అనుకుంటూ, పుస్తకాన్ని భద్రంగా టేబుల్ మీద పెట్టి హాల్లోకి నడిచింది.

పార్వతమ్మగార్ని చాప వేసి కూర్చోమని, తనూ కూర్చుంది. ఆవిడ 'ఇరుగమ్మ, పొరుగమ్మ' గోడవలను తన కంచుగంట లాంటి నోటితో గంటసేపు



అనర్గళంగా ప్రసారం చేసింది. ఆవిడ చెప్పే కబుర్లు వింటూ మధ్య మధ్య పేజీ నంబరు నెమరు వేసుకోసాగింది గీత.

గంట తర్వాత ప్రసార సమాప్తి గావించి లేచి వెళ్ళబోతూ, "చూడు తల్లీ, వచ్చిన పని మర్చిపోయి వెళ్ళిపోతున్నాను. మతిమాలినదాన్ని! నిన్ననే 'పరలోకం' పత్రిక నుంచి పారితోషికం అందింది. అప్పుడే వచ్చి నీ బాకీ యిచ్చేదామనుకున్నానుగానీ మర్చిపోయాను. అన్నట్టు నీకివ్వాల్సిందెంత?" అంది ఆవిడ.

పార్వతమ్మగారు పత్రికలకు తరచుగా వంటలు—పిండివంటలు శీర్షికలకి వంటలు, కొన్ని పత్రికలకు 'పురాణకాలపు పతివ్రతలు - వారు భర్తలకు చేసిన సేవలు', 'బట్టలు శుభ్రంగా వుతకడమెలా?'లాంటి వ్యాసాలు రాసి పంపిస్తుంది. అవి 'అరుదుగా' అచ్చవుతుంటాయి. తన కొచ్చిన కాంప్లిమెంటరీలలో తన పేరును, తను రాసినదాన్ని వాడకట్టులో వాళ్ళందరికీ చూపించడం ఆవిడకి పరమానందం కల్గించే విషయం. వంటలూ, వ్యాసాలూ రాసే తను కూడా ఓ రచయితే అనే గర్వం కూడా లేకపోలేదు ఆవిడకి. ఆ విషయాన్ని తరచుగా అందరివద్దా ప్రస్తావించడానికి ప్రయత్నిస్తుంది.

ఆవిడ ప్రశ్నకు బదులుగా గీత, "ఇరవైఅయిదు" అంది చటుక్కున.

"ఏమో తల్లీ! నేనందరి దగ్గరా అప్పులు చేస్తానేగాని, ఎవరి దగ్గరెంత తీసుకుందీ గుర్తుండే చావదు. అంత మతిమరుపనుకో! బాకీ తీర్చేటప్పుడు వాళ్లనే అడుగుతాను 'ఎంతిచ్చారని'. వాళ్ళెంత చెబితే అంత యిచ్చెయ్యడమే! ఎక్కువైనా, తక్కువైనా" అంటూ బొడ్లోంచి తీసిన పాతిక రూపాయలు గీత చేతిలోపెట్టి చకచకా వెళ్ళిపోయిందావిడ.

ఆవిడ గేటు దాటుతుండగా గుర్తొచ్చింది గీతకి ఆవిడ తనకివ్వవల్సింది నలభై రూపాయలని, పొరపాట్న తను పేజీ నంబరు చెప్పిందని!

రాకెట్‌లా దూసుకుపోతున్న పార్వతమ్మగార్ని వెనక్కి పిలిచి ఆ విషయమెలా చెప్పా[illegible] యక, తెల్లబోయి అలా చూస్తూండిపోయింది [illegible]

— [illegible]

Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) & Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., Madras-600 026.

## ఆమె కళ్లలో
## పరవళ్లుతొక్కే అందం.




## ఆ ఆకర్షణనుపెంచే
## ఆమె నొసటి కుంకం

శింగార్...రంగులలోని అత్యుత్తమమైన పదార్థాలతో తయారైంది, మీ హావభావాలకి సరితూగేలా...మీ బట్టలకి అనుగుణంగా. భారతదేశంలోని అత్యంత సౌందర్యవతులంతా దీనిని ఎంచుకుంటున్నారు.

**శింగార్** కుంకుమ్ బొట్టు—
భారతదేశపు సౌందర్యతిలకం.

everest/78/SH/135-11

